భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన

# శ్రీ నారద పురాణం






జిల్లెళ్ళమూడి అమ్మ
మాతృశ్రీ అనసూయాదేవి ఆశీస్సులతో...

వచనం : డాక్టర్ జయంతి చక్రవర్తి
ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

ప్రచురణ



శ్రీ బాలాజీ పబ్లికేషన్స్
28-25-32/1, అరండల్‌పేట, ఏలూరురోడ్, విజయవాడ-2
సెల్ : 9441176276 / 9966675815

# శ్రీ నారద పురాణం


| | | |
|---|---|---|
| వచనం | : | డాక్టర్ **జయంతి చక్రవర్తి**<br>విజయవాడ. 9390526272 |
| కాపీరైట్ | : | పబ్లిషర్స్ |
| ప్రథమ ముద్రణ | : | 2014 |
| ముఖచిత్రం | : | రమణ |
| డి.టి.పి. &<br>పేజి లే-అవుట్ | : | విద్యార్థి క్రియేషన్స్<br>విజయవాడ |
| ముద్రణ | : | శ్రీ స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్<br>విజయవాడ-3 |
| ప్రచురణ | : | **శ్రీ బాలాజీ పబ్లికేషన్స్**<br>నసురుల్లాఖాన్ వీధి<br>అరండల్‌పేట, విజయవాడ |
| వెల | : | ₹. 60 /- |




ఆర్షవిజ్ఞాన భాండాగారాలైన అష్టాదశ పురాణాలని ఆంధ్రుజాతికి అందించిన శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతి ట్రస్ట్ వారికి, ఆ పురాణాలను అనువదించిన మహారచయితలకి సహస్రాధిక ప్రణామాలు సమర్పిస్తున్నాం.

# భగవాన్ వేదవ్యాస మహర్షి

## వ్యాసగుహ, సరస్వతీ తీరం, బదరీనాథ్



*అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరో హరిః ।*
*అఫాలలోచనః శంభుర్భగవాన్ బాదరాయణః ॥*

## కృతజ్ఞతలు

అష్టాదశ పురాణాలని సామాన్య జనానికి అందించాలని సంకల్పించిన శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ అధినేత **శ్రీ పుట్టగుంట వీరయ్యచౌదరి (బోస్) గారికి** ముందుగా ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ గ్రంథాలకి తమ అమూల్యమైన ఆశీస్సులందించిన శ్రీ పీఠాధిపతులు పరమపూజ్య **శ్రీశ్రీశ్రీ పరిపూర్ణానంద సరస్వతీ స్వామివారికి,** అస్మద్గురువర్యులు ఆర్షవిద్యాసాగర **బ్రహ్మశ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి గారికి** సహస్రాధిక వందనాలు సమర్పిస్తున్నాను.

ప్రోత్సహించిన మిత్రులు రోహిత్ ప్రింటర్స్ అధినేత శ్రీ పుప్పాల అప్పారావు గారికి, డా॥ కానుకొల్లు బాలకృష్ణ, వలివేటి శివరామకృష్ణమూర్తి, వేదాంతం సార్వభౌమ, ఉన్నవ గణేష్‌లకి..... అలాగే ఈ గ్రంథాన్ని డి.టి.పి. చేసిన శ్రీమతి వినీల గారికి పేజి మేకింగ్ చేసిన విద్యార్థి క్రియేషన్స్ వారికి ప్రత్యేక అభినందనలు...




Sreepeetam
# 1-9-278/10/1, Lalitha Nagar, Vidyanagar, Hyderabad - 500 044.
Ph: 27076655, M: 098490 33991

# ఆశీస్సులు

డా॥ జయంతి చక్రవర్తి గారు అనేక ఆధ్యాత్మిక రచనల ద్వారా తెలుగు పాఠకులకు సుపరిచితులు. విజయవాడ కనకదుర్గ దేవస్థానం పక్షాన వెలువడుతున్న 'కనకదుర్గ ప్రభ' పత్రికకు ప్రారంభ సంపాదకులుగా ఆయన పేరు తెచ్చుకున్నారు. 'దశ మహావిద్యలు' పుస్తక రచన తరువాత డా॥చక్రవర్తి గారు అష్టాదశ పురాణాలను తెలుగు పాఠక ప్రపంచంలోకి లోతుగా తీసుకువెళ్లాలని సంకల్పించారు. ఒక్కొక్క పురాణ సారాంశాన్ని ఒక్కొక్క చిన్న పుస్తకంగా విడుదల చేయాలన్న ఆ రచయిత సంకల్పం ప్రశంసనీయం.

ఈ చిన్నిపొత్తాలు పాఠకులందరికీ ప్రయోజనకరంగా, సదుపాయకరంగా ఉంటాయి. వీటి ఉపయోగాన్ని పాఠకులందరూ అందిపుచ్చుకోవాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.



స్వామి పరిపూర్ణానంద

**జయ వత్సరం, శ్రావణ పూర్ణిమ**

**(10.8.2014)**

"ఆర్షవిద్యాసాగర", "మధురభారతి"
మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



దూరవాణి : 81061 96418

301, శ్రీ సాయి ఎన్‌క్లేవ్, అడవి శేషగిరిరావు వీధి, లక్ష్మీనగర్
సత్యనారాయణపురం, విజయవాడ-520011



తేది : 19-8-2014

# ఇది సృష్టి కథ

"అన్నీ వేదాల్లోనే ఉన్నాయిష" అనే వెక్కిరింపు లోకంలో బాగా ప్రచారంలో ఉంది. వెక్కిరించడానికి అన్నమాటే అయినా, ఇది నిజమని మాత్రం చెప్పక తప్పదు. వేదం సృష్టితత్త్వాన్ని, సృష్టికి మానవుడికి ఉన్న సంబంధాన్ని, మానవుడికి సృష్టికర్తతో గల అనుబంధాన్ని వ్యక్తం చేసింది. వేదం ఏ ఒక్కరో రచించిన గ్రంథం కాదు. సృష్టితత్త్వాన్ని, పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోవాలని ఆరాటపడిన మహర్షి సముదాయానికి అంతర్నేత్రానికి గోచరించిన ఒక దర్శనం. హృదయస్థానంలో వినిపించిన ఒక నాదం (శ్రుతి).వేదం 'అపౌరుషేయం' అని కూడా పెద్దలు గుర్తించారు. 'అపౌరుషేయం' అంటే మానవమాత్రుడి రచన కాదు అని అర్థం.

అనాదిగా అలా దిగి వచ్చిన వేదం వ్యాసమహర్షి కాలానికి చిక్కువడిన దారాల రాశిగా ఉంటే, ఆ చిక్కును విడదీసి, వేదవిభాగ నిర్ణయంచేసి, వేదం మనకు అక్కరకు వచ్చేలా చేశాడు ఆ మహర్షి. ఆనాటి నుండి అతడికి 'వేదవ్యాసుడు' అనే పేరు వచ్చింది. సకల వేదాల సారాన్ని 555 సూత్రాలుగా "బ్రహ్మసూత్రాలు" రచించాడు. అయినా, ఆ మహర్షికి తృప్తి కలుగలేదు. వేదమనే విత్తనంలో నుంచి విశాలమైన పురాణ మహావృక్షాలను అంకురింపచేశాడు. అందుకే పురాణాలకు

"వేదోపబృంహణాలు" అని పేరు. "ఉపబృంహణం" అంటే విత్తనాలు నుంచి మొలక రావడం. విత్తనంలో ఏమి ఉన్నదో మొలకలో, మొక్కలో, చెట్టులో అదే ఉంటుంది.

వేదవాఙ్మయంలో దాగిన సృష్టితత్త్వాన్ని కథారూపంగా వివరించడానికి అష్టాదశ పురాణాలను రచించాడు వ్యాసమహర్షి. మానవాభ్యుదయం కోసం వెలువడిన ఈ పురాణ వాఙ్మయసారాన్ని సంక్షిప్తంగా సంకలనం చేసి అందిస్తే, ఈనాటి సమాజానికి శ్రేయస్సు కలుగుతుందని సంకల్పించాడు మా శిష్యమిత్రుడు డా॥ జయంతి చక్రవర్తి. తన ఓర్పు నేర్పులతో అష్టాదశ పురాణాల ఆంతర్యాన్ని వాడుకభాషలో నేటి జన సామాన్యానికి అందుబాటులోకి తెచ్చే పవిత్రమైన బాధ్యతను నెరవేర్చాడు.

మంచి సాహిత్యాన్ని మన సమాజానికి అందించే మహత్తర లక్ష్యంతో శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఈ అష్టాదశ పురాణాలని ప్రచురించటానికి ముందుకు వచ్చారు. వీరిద్వారా ఇంకా ఎన్నో చక్కని గ్రంథాలు వెలుగు చూస్తున్నాయి.

పురాణ వాఙ్మయంలోని పుణ్యకథా విశేషాలను ఈనాటి సమాజానికి పంచే కృషిలో పాలు పంచుకుంటున్న మా చక్రవర్తి, సంప్రదాయ సాహిత్యాన్ని ప్రచురించే సత్కార్యాన్ని మహాయజ్ఞంగా స్వీకరించిన ప్రచురణకర్త శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఎంతైనా అభినందనీయులు.

వీరిద్దరికీ ఆ అంతర్యామి అనంత శుభాలనూ ప్రసాదించాలని ఆశీర్వదిస్తూ, ఈ గ్రంథాలు ప్రజలకు చేరువ కాగలవని ఆకాంక్షిస్తున్నాను.

- మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



# పురాణ పురుషుడు శ్రీమన్నారాయణుడు



# విషయసూచిక

# ఉపోద్ఘాతము

అం.ఆ

**వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ ।**
**నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా ॥**

**వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్ ।**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥**

## అష్టాదశ పురాణాలు

మన భారతవాఙ్మయంలో వేదాల తరువాత అంతటి ప్రాశస్త్యాన్ని పొందిన గ్రంథాలు పురాణాలు. వేదాల్లో చెప్పిన ధర్మాల్ని కథలరూపంలో, ఆఖ్యానాల రూపంలో సామాన్యులకు సైతం అర్థమయ్యేలా తెలియచెప్పేవే పురాణాలు. అందుకే పురాణాల్ని పంచమవేదంగా కీర్తించారు. అసలు పురాణం అంటే? పురా పినవం-పురాతనమైనప్పటికీ నూతనంగా వుండేది అని అర్థం. అలాగే 'పురా ఆనతి' అంటే ప్రాచీనకాలంలో జరిగింది అని, వాయుపురాణం పురాణశబ్దాన్ని నిర్వచిస్తే, 'పురాఏతత్ అభూత్' పూర్వం ఇలా జరిగింది అని బ్రహ్మాండ పురాణం పురాణశబ్దానికి అర్థాన్ని చెబుతుంది. వీటన్నిటినీ క్రోడీకరించి చూస్తే పురాణం అంటే పూర్వకాలంలో జరిగిన ఎన్నో విషయాల్ని వివరించి చెప్పేది అని తెలుస్తోంది.

పురాణాలు ఎన్ని-

పురాణాలు మహాపురాణాలు, ఉపపురాణాలని రెండు విధాలుగా వున్నాయి. మహాపురాణాలు 18, అలాగే ఉపపురాణాలు 18.

**బ్రహ్మం పాద్మం వైష్ణవం చ వాయవీయం తథైవచ ।**
**భాగవతం నారదదీయం మార్కండేయంచ కీర్తితమ్ ॥**

**ఆగ్నేయంచ భవిష్యంచ బ్రహ్మవైవర్త లింగకే ।**
**వారాహంచ తథా స్కాందం వామనం కూర్మ సంజ్ఞకమ్ ।**
**మాత్స్యం చ గారుడం తద్వద్బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్ ॥**

1.బ్రహ్మపురాణం 2.పద్మపురాణం 3.విష్ణుపురాణం 4.వాయు పురాణం 5.భాగవత పురాణం 6.నారదపురాణం 7.మార్కండేయ పురాణం

8.అగ్నిపురాణం 9.భవిష్యపురాణం 10.బ్రహ్మవైవర్త పురాణం 11.లింగపురాణం 12. వరాహ పురాణం 13.స్కాంద పురాణం 14.వామన పురాణం 15.కూర్మ పురాణం 16.మత్స్య పురాణం 17.గరుడ పురాణం 18.బ్రహ్మాండ పురాణం-ఈ పద్దెనిమిదీ మహాపురాణాలు. అలాగే 18 ఉపపురాణాలు కూడా వున్నాయి. ఈ మహాపురాణాల పేర్లని గుర్తుంచుకోవటానికి శ్లోకం కూడా వుంది.

**'మ' ద్వయం 'భ' ద్వయం చైవ 'బ్ర'త్రయం 'వ' చతుష్టయం।**
**అనాపలింగ కూస్కాని పురాణాని పృథక్ పృథక్ ॥**

'మ' తో మొదలయ్యేవి రెండు 1.మత్స్య 2.మార్కండేయ

'భ' తో మొదలయ్యేవి రెండు 1.భాగవత 2.భవిష్య

'బ్ర' తో మొదలయ్యేవి మూడు 1.బ్రహ్మ 2.బ్రహ్మవైవర్త 3.బ్రహ్మాండ

'వ' తో మొదలయ్యేవి నాలుగు 1.వాయు 2.విష్ణు 3.వామన 4.వరాహ

అ-అగ్ని, నా-నారద, ప-పద్మ, లిం-లింగ, గ-గరుడ, కూ-కూర్మ, స్కా-స్కాంద ఇలా మొత్తం పద్దెనిమిది పురాణాలు.

## పురాణాలు విష్ణుస్వరూపం

అష్టాదశ పురాణాలను సాక్షాత్తు విష్ణు స్వరూపంగా పోల్చారు. 18 పురాణాలని మహావిష్ణువు శరీరంలోని 18 అంగాలుగా భావిస్తారు మన ప్రాచీన ఋషులు.

1. బ్రహ్మపురాణం - శ్రీ మహావిష్ణువు శిరస్సు
2. పద్మపురాణం - శ్రీ మహావిష్ణువు హృదయం
3. విష్ణుపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిభుజం
4. వాయుపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమభుజం
5. భాగవతపురాణం - శ్రీ మహావిష్ణువు ఊరువులు
6. నారదపురాణం - శ్రీ మహావిష్ణువు నాభి
7. మార్కండేయపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిపాదం
8. అగ్నిపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమపాదం

| | | | |
|---|---|---|---|
| 9. | భవిష్యపురాణం | - | శ్రీ మహావిష్ణువు కుడిమోకాలు |
| 10. | బ్రహ్మవైవర్తపురాణం | - | శ్రీ మహావిష్ణువు ఎడమమోకాలు |
| 11. | లింగపురాణం | - | శ్రీ మహావిష్ణువు కుడి చీలమండ |
| 12. | వరాహపురాణం | - | శ్రీ మహావిష్ణువు ఎడమ చీలమండ |
| 13. | స్కందపురాణం | - | శ్రీ మహావిష్ణువు కేశాలు |
| 14. | వామనపురాణం | - | శ్రీ మహావిష్ణువు చర్మం |
| 15. | కూర్మపురాణం | - | శ్రీ మహావిష్ణువు పృష్ఠభాగం |
| 16. | మత్స్యపురాణం | - | శ్రీ మహావిష్ణువు మెదడు |
| 17. | గరుడపురాణం | - | శ్రీ మహావిష్ణువు మాంససారం |
| 18. | బ్రహ్మాండపురాణం | - | శ్రీ మహావిష్ణువు ఎముకలు |

పురాణ లక్షణం :-

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంత రాణి చ ।**
**వంశానుచరితం చేతి పురాణం పంచ లక్షణం ॥**

పురాణానికి ఐదు లక్షణాలు ప్రధానంగా వుండాలని చెప్పారు. 1.సర్గ-అంటే ప్రపంచ సృష్టి, 2.ప్రతిసర్గ-ఈ ప్రపంచ ప్రళయం, 3.వంశం-రాజుల, ఋషుల, దేవతలకు సంబంధించిన వంశ విశేషాలు-అవతారాలు 4.వంశానుచరితం-రాజవంశాలలో, ఋషుల వంశాలలో పుట్టిన వారి జీవితచరిత్రలు, 5.మన్వంతరాలు-మనువులు, మనువు ద్వారా ఏర్పడ్డ సంతతి, ఆయా మన్వంతరాలలో జరిగిన విశేషాలు. ఈ విధంగా ప్రతిపురాణం పంచలక్షణాలతో కూడి వుంటుంది.

పురాణకర్త :-

**విష్ణోరంశో మునిర్జాత సత్యవత్యాం పరాశరాత్ ।**
**పురాణ సంహితాం దద్యే తేషాం ధర్మ విధిత్సయా ॥**

అనే ఈ ప్రమాణ శ్లోకం ప్రకారం సత్యవతీ పరాశర మహర్షి కుమారుడుగా శ్రీ మహావిష్ణు అంశంతో జన్మించిన వ్యాసుడే అష్టాదశ పురాణాల కర్త అని తెలుస్తోంది. ఈయననే కృష్ణద్వైపాయనుడు అని కూడా అంటారు. పురాణాలకు కర్త వ్యాసుడైతే వక్త సూతమహర్షి. ఈయన నైమిశారణ్యంలో శౌనకాది మహామునులకు ఈ పురాణాలన్నిటినీ ప్రబోధించాడు.

పురాణాల ప్రాచీనత :-

వేద వాఙ్మయం ఎంత విస్తృతంగా వుందో, పురాణ వాఙ్మయం కూడా అంత విస్తృతంగా వుంది. సాధారణంగా లోకంలో వేదాలు అత్యంత ప్రాచీనమైనవని చెబుతారు. అయితే ఈ శ్లోకం వేదాలకన్నా పురాణాలే ప్రాచీనమైనవని చెబుతుంది.

**పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతమ్ ।**
**నిత్యం శబ్దమయం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ।**
**అనంతరంచ వక్త్రేభ్యః వేదాంతస్య వినిర్గతాః ॥**

పూర్వం బ్రహ్మ నోటి నుంచి వందకోట్ల శ్లోకాలతో ముందు పురాణాలు బయలుదేరి ఆ తరువాత వేదాలు బయలుదేరాయట. ఇలా వందకోట్ల శ్లోకాలతో చతుర్ముఖ బ్రహ్మతో చెప్పబడ్డ పురాణం మొత్తం ఒక్కటిగానే వుండేది. అల్పబుద్ధులైన మానవుల కోసం ఆ బ్రహ్మదేవుడే వ్యాసుడి రూపంలో వచ్చి ఆ కోటిశ్లోకాల పురాణాన్ని నాలుగు లక్షల శ్లోకాలలోకి కుదించి దాన్ని పద్దెనిమిది పురాణాలుగా రచించాడని స్కందపురాణం చెబుతుంది.

**పురాణమేక మేవాసీ దస్మిన్ కల్పాంతరే నృప ।**
**త్రివర్గ సాధనం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ॥**
**స్మృత్వా జగాదచ మునీన్ ప్రతి దేవశ్చతుర్ముఖః ।**
**చతుర్లక్ష ప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా ।**
**తదష్టాదశధా కృత్వా భూర్లోకేஉస్మిన్ ప్రభాష్యతే ॥** *(స్కంద పురాణం)*

## పాఠకులకు నమస్కారం

భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన అష్టాదశ పురాణాలు ఆర్షవిద్యా భాండాగారాలు. ఆ భాండాగారాలలో నిక్షిప్తమైన ప్రధాన విషయాల్ని 18 పుస్తకాలుగా క్రోడీకరించి మీ ముందుకు తెస్తున్నాం. సరళమైన భాషలో మేము ప్రచురించిన ఈ 18 పురాణాలని ఆదరించి, మమ్మల్ని ప్రోత్సహిస్తారని ఆశిస్తూ... మీ

***- ప్రకాశకులు, వచనకర్త***

# అష్టాదశ పురాణాల మొదటి వక్త - శ్రోత

అష్టాదశ పురాణాలను మొదటగా చెప్పిన వక్తలు వారి నుంచి మొదటిసారి విన్న శ్రోతలు ఈ క్రింద చెప్పిన విధంగా వుంటారు. అదేవిధంగా ఒక్కొక్క పురాణానికి వక్తృ శ్రోతృపరంపర వేరువేరు విధాలుగా ఉండవచ్చు.

| సం. పురాణం | ఏకల్ప వృత్తాంతం | వక్తృశ్రోతలు |
|---|---|---|
| 1. బ్రహ్మ పురాణాన్ని | బ్రహ్మ కల్పంలో | బ్రహ్మ మరీచి మహామునికి బోధించాడు |
| 2. పద్మ పురాణాన్ని | పద్మ కల్పంలో | స్వాయంభువుమనువు బ్రహ్మకు బోధించాడు |
| 3. విష్ణు పురాణాన్ని | వరాహ కల్పంలో | పరాశరుడు బ్రహ్మకు బోధించాడు |
| 4. శివ(వాయు)పురాణాన్ని | శ్వేత కల్పంలో | శివుడు వాయువుకు బోధించాడు |
| 5. భాగవత పురాణాన్ని | సారస్వత కల్పంలో | విష్ణువు బ్రహ్మకు బోధించాడు |
| 6. నారద పురాణాన్ని | బృహత్ కల్పంలో | పూర్వ భాగాన్ని – సనకాదులు నారదునికి బోధించారు. ఉత్తరభాగాన్ని – వశిష్ఠుడు మాంధాతకు బోధించాడు |
| 7. మార్కండేయ పురాణాన్ని | శ్వేత వారాహకల్పంలో | మార్కండేయుడు జైమినికి బోధించాడు |
| 8. అగ్ని పురాణాన్ని | ఈశాన కల్పంలో | అగ్నిదేవుడు వశిష్ఠునికి బోధించాడు |
| 9. భవిష్య పురాణాన్ని | అఘోర కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |
| 10. బ్రహ్మవైవర్త పురాణాన్ని | రథంతర కల్పంలో | సావర్ణి నారదునికి బోధించాడు |
| 11. లింగ పురాణాన్ని | కల్పాంత కల్పంలో | పరమశివుడు నారదునికి బోధించాడు |
| 12. వరాహ పురాణాన్ని | మనుకల్పంలో | విష్ణువు పృథ్వికి బోధించాడు |
| 13. స్కాంద పురాణాన్ని | తత్పురుషకల్పంలో | స్కందుడు భూమికి బోధించాడు |
| 14. వామన పురాణాన్ని | కూర్మ కల్పంలో | బ్రహ్మ పులస్త్య మహామునికి బోధించాడు |
| 15. కూర్మ పురాణాన్ని | లక్ష్మీ కల్పంలో | విష్ణువు పులస్త్య మహామునికి బోధించాడు |
| 16. మత్స్య పురాణాన్ని | సప్త కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 17. గరుడ పురాణాన్ని | గరుడ కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 18. బ్రహ్మాండ పురాణాన్ని | భవిష్య కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |

# పురాణాలు ఎందుకు చదవాలి?

**పురాణశ్రవణే శ్రద్ధా యస్య స్యాద్బ్రాతరస్వహమ్ ।**
**తస్య సాక్షాత్ప్రసన్నః స్యాత్ శివో విష్ణుశ్చ సానుగః ॥**

**యత్స్నాత్వా పుష్కరే తీర్థే యాగే సింధౌ చ సంగమే ।**
**తత్ఫలం ద్విగుణం తస్య శ్రద్ధయా వై శృణోతి యః ॥**

**యే పఠంతి పురాణాని శృణ్వన్తి చ సమాహితాః ।**
**ప్రత్యక్షరం లభంత్యేతే కపిలాదానజం ఫలమ్ ॥**

**అపుత్రో లభతే పుత్రం ధనార్థీ లభతే ధనమ్ ।**
**విద్యార్థీ లభతే విద్యాం మోక్షార్థీ మోక్షమాప్నుయాత్ ॥**

**యే శృణ్వన్తి పురాణాని కోటిజన్మార్జితం ఖలు ।**
**పాపజాలంతు తే హిత్వా గచ్ఛన్తి హరిమందిరమ్ ॥**

పురాణాలు వినడంలో ఎవరికైతే శ్రద్ధ ఉంటుందో మరియు నిత్యము ఎవరైతే శ్రవణం చేస్తారో, అటువంటి వారి విషయంలో శివ-కేశవులు మరియు వారి గణాలు సంపూర్ణానుగ్రహం ప్రదర్శిస్తారు. పుష్కర తీర్థాల్లో, ప్రయాగ మొదలైన నదీసంగమ క్షేత్రాల్లో స్నానాలాచరిస్తే ఏవిధమైన పుణ్యం పొందగలరో దాని రెట్టింపు పుణ్యం పురాణ శ్రోతలకు లభిస్తుంది. భక్తి శ్రద్ధలతో పురాణ పఠన-శ్రవణాలు చేసేవారు కపిలగోవును దానం చేస్తే కలిగే పుణ్యరాశిని పొందగలరు. పుత్రులు లేనివారు పుత్రులను, దరిద్రులు ధనాన్ని, విద్యార్థులు విద్యను, మోక్షగాములు మోక్షాన్ని పొందగలరు. పురాణ శ్రోతలు తమ కోటి జన్మల పాపాలను దూరం చేసికొని చివర్లో శ్రీమన్నారాయణమూర్తి సాయుజ్యం పొందగలరు.

# పురాణ వైభవం

**అష్టాదశ పురాణానాం నామధేయాని యః పఠేత్ ।**
**త్రి సంధ్యాం జపతే నిత్యం సోऽశ్వమేధ ఫలం లభేత్ ॥**

ఈ అష్టాదశ మహాపురాణాల పేర్లను ఉదయ-మధ్యాహ్న-సాయంకాల సమయాల్లో ఎవరైతే పఠిస్తారో వారు అశ్వమేధ ఫలాన్ని పొందగలరని భావం.

# శ్రీ నారద పురాణం



శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ॥

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్ ॥

అష్టాదశ పురాణాలలో ఆరవది నారదపురాణం. పురాణ పురుషుడైన శ్రీమహావిష్ణువుకి నాభిస్థానంగా ఈ పురాణం వర్ణించబడింది. ఈ పురాణం పూర్వభాగం, ఉత్తరభాగం అని రెండు భాగాలుగా విభజించబడింది. వీటిలో పూర్వభాగం తిరిగి నాలుగు పాదాలుగా 125 అధ్యాయాలుగా విభజించబడగా ఉత్తర భాగంలో 82 అధ్యాయాలున్నాయి. ఇలా మొత్తం ఈ పురాణం 207 అధ్యాయాలతో 25000 శ్లోకాలతో రచించబడింది.

అష్టాదశ పురాణాలలో శివపరమైనవిగా కొన్ని విష్ణు ప్రాధాన్యతతో మరికొన్ని కనిపిస్తాయి. అయితే ఈ నారద పురాణం మాత్రం శివకేశవులకి సమానమైన ప్రాధాన్యతనిస్తూ శివకేశవుల అభేదతత్త్వాన్ని ప్రబోధిస్తుంది.

ఈ పూరాణానికీ నారదీయపురాణమని, బృహన్నారదీయపురాణమని వ్యవహారంలో వుంది. అయితే కొందరు పరిశోధకులు బృహన్నారదీయ పురాణం అనేది ఉపపురాణం మాత్రమే అని నిర్ధారించారు. బ్రహ్మమానస పుత్రుడైన సనకమహర్షి నారదుడికి ఈ దివ్య పురాణాన్ని ప్రబోధించాడు.

## నారదపురాణంలో చెప్పిన ప్రధాన విషయాలు

**పూర్వభాగం 1-30 అధ్యాయాలు :** వీటిలో పురాణమాహాత్మ్యం, నారదుడు చేసిన విష్ణుస్తుతి, భరత ఖండోత్పత్తి, ప్రాశస్త్యం, శ్రీహరి భక్తినిరూపణం, మృకండమహర్షి వృత్తాంతం, మార్కండేయుడు ప్రళయాన్ని దర్శించటం,

గంగామాహాత్మ్యం, ప్రయాగ క్షేత్ర ప్రాశస్త్యం, జేర్వముని వృత్తాంతం, భగీరథుడు గంగని తీసుకురావటం, గంగానది ఉత్పత్తి, అదితి తపస్సు, శ్రీహరి వామనావతారాన్ని ధరించటం, హరిపాదాన గంగ ఆవిర్భవించటం, బ్రాహ్మణ లక్షణం, దేవాలయ, వాపీ, కూప తటాకాల నిర్మాణం, వర్ణాశ్రమ ధర్మాలు, ప్రాయశ్చిత్త విశేషాలు, శ్రాద్ధ పంచకం, నరకవర్ణన, మార్గశీర్షమాసం నుంచి కార్తీకం వరకూ ఉద్యాపన పూర్వకంగా శుక్ల ద్వాదశీ వ్రతవిధానం, శ్రీలక్ష్మీ నారాయణ వ్రతం, విభాండకముని జన్మవృత్తాంతం, హరిపంచరాత్రవ్రతం, మాసోపవాస వ్రతం, భద్రశీలద్విజోపాఖ్యానం, నాలుగు వర్ణాల స్త్రీల సదాచారవర్ణనం, వేదాధ్యయనాది ధర్మ నిరూపణం, శ్రాద్ధకృత్య వివరణం, ప్రాయశ్చిత్త పూర్వకంగా తిథ్యాది నిర్ణయం, పంచమహాపాతక ఉపపాతకాలకు ప్రాయశ్చిత్త కథనం వంటి విషయాలు వివరంగా చెప్పబడ్డాయి.

**31-60 అధ్యాయాలు :** పాప పుణ్యాలు చేసిన వారికి కలిగే దుఃఖ-సుఖ మార్గాలు, సంసారయాతన తొలగించే శ్రీహరి ఆరాధనాకథనం, అష్టాంగయోగనిరూపణం, హరిభక్తి లక్షణం, భగవద్భక్తి మాహాత్మ్యం, వేదమాలివృత్తాంతం, విష్ణు మహాత్మ్యం ఉత్తంకముని భగవత్‌స్తుతి, విష్ణుపదప్రాప్తి, హరిమందిరంలో దీపదానం చేసిన జయధ్వజుడి ఇతిహాసం, నాలుగుయుగాల స్థితి, కలియుగంలో భగవన్నామ మాహాత్మ్యం, భరద్వాజ భృగు సంవాదం, ధ్యానయోగం, మోక్షనిరూపణం, భవబంధనివృత్తికి ఆధ్యాత్మిక కథనం, రాజర్షి భరతుడి జన్మలు, మోక్ష ధర్మావిష్కరణం, శుకముని చరిత్ర, నక్షత్రవేద సంహితాకల్పం, వ్యాకరణ నిరూపణం, జ్యోతిషంలో గణిత విభాగవిచారణం, జ్యోతిషంలో జాతక భాగనిరూపణం, వివిధ రకాల మహోత్పాతాలు, సంక్షేపంగా ఛందోవర్ణనం, జనక-శుకసంవాదం, విద్యాప్రభావం వంటి విషయాలు వర్ణించబడ్డాయి.

**61-90 అధ్యాయాలు :** వీటిలో ప్రధానంగా జ్ఞానులప్రభావం, మోక్షదర్శన నిరూపణం, విష్ణు ఆరాధనా విధానం, శరీరధర్మం, దీక్షావిధి, మంత్రదీక్ష, వివిధ దేవతల మంత్రవిధి, దేవపూజావిధి గణేశమంత్ర విధానం,

శ్రీమహావిష్ణుమంత్ర విధానం, నృసింహోపాసనామంత్ర గాయత్రీ విశేషాలు, హయగ్రీవోపాసన, రామాద్యుపాసనావిషయాలు, హనుమన్మంత్ర కథనం, దీపవిధి, కార్తవీర్య మహాత్మ్యం మంత్రదీపకథనం, కార్తవీర్య కవచం, హనుమత్కవచం, హనుమచ్చరిత్ర, కృష్ణ మంత్ర విశేషాలు, కృష్ణ మంత్రభేదాలు, రాధాకృష్ణ సహస్రనామ కథనం, పంచప్రకృతి దేవతల మంత్రాలు, దేవీమంత్రనిరూపణం, యక్షిణీమంత్ర భేదాలు, యక్షిణీ మంత్ర సాధన, దుర్గామంత్ర చతుష్టయం, రాధామంత్రాలు, శ్రీలలితా స్తోత్రకవచం, సహస్రనామ స్తోత్రకథనం, నిత్యపటల కథనం లాంటి విశేషాలు సవివరంగా వర్ణించబడ్డాయి.

**91–125 అధ్యాయాలు :** వీటిలో బ్రహ్మపురాణ ఇతిహాసకథనం, పద్మపురాణం అనుక్రమణిక, విష్ణు, వాయు, శ్రీభాగవత, నారదీయ, మార్కండేయ, అగ్ని, భవిష్య, బ్రహ్మవైవర్త, లింగ, వరాహ, స్కంద, వామన, కూర్మ, మత్స్య, గరుడ, బ్రహ్మాండ అనే అష్టాదశపురాణాల అనుక్రమణికా వర్ణనం, ద్వాదశమాసవ్రత నిరూపణం – ప్రతిపత్, ద్వితీయా, తృతీయా, చతుర్థీ, పంచమీ, షష్ఠీ, సప్తమీ, అష్టమీ, నవమీ, దశమీ, ఏకాదశీ, ద్వాదశీ, త్రయోదశీ, చతుర్ధశీ, పౌర్ణమాసీ వ్రతనిరూపణం, పురాణ మహిమ అనేవి వర్ణించబడ్డాయి.

**ఉత్తరభాగం 1–50 అధ్యాయాలు :** వీటిలో ద్వాదశీ మాహాత్మ్యం, యమధర్మరాజు బ్రహ్మలోకానికి వెళ్ళటం, యముడి వాక్యాలు, యముడి విలాపం, మందర పర్వత వర్ణనం, రుక్మాంగదుడి వృత్తాంతం, మోహినీ దర్శనం, మోహినీ సమ్మోహనం, పితాపుత్ర సంవాదం, మాతృసన్మానమ్, ధర్మాంగద దిగ్విజయం, శిక్షా నిరూపణం, మోహినీ ప్రశ్నకాష్ఠీలోపాఖ్యానం, కాశీవర్ణనం, మాఘమాహాత్మ్యం, భగవద్దర్శనమ్, శాపప్రాప్తి, గంగామాహాత్మ్యం, స్థల విశేష స్నానఫలకథనం, దానవిధి, పూజాకథనం, గయామాహాత్మ్యం, పిండదాన మాహాత్మ్యం, కాశీమాహాత్మ్యం వంటి విశేషాలు చెప్పబడ్డాయి.

**51–82 అధ్యాయాలు :** వీటిలో పురషోత్తమ క్షేత్ర మాహాత్మ్యం అభిషేకవిధి, పురుషోత్తమ క్షేత్రయాత్రా ఫలం, ప్రయాగ తీర్థవిధి, కురుక్షేత్ర మాహాత్మ్యం, తీర్థయాత్రా వర్ణనం, హరిద్వార మాహాత్మ్యం, బదరికాశ్రమ

మాహాత్మ్యం, కామాక్షా మాహాత్మ్యం, ప్రభాసతీర్థ మాహాత్మ్యం, పుష్కరతీర్థ మాహాత్మ్యం, గౌతమాశ్రమ మహాత్మ్యం, వేదపాదస్తవం, గోకర్ణక్షేత్ర మహాత్మ్యం లక్షిణాచల మహాత్మ్యం, సేతు (రామేశ్వరం) మాహాత్మ్యం, నర్మదా తీర్థమాహాత్మ్యం, అవంతీ క్షేత్ర మహాత్మ్యం, మధురాతీర్థ మహాత్మ్యం, బృందావనమహాత్మ్యం, వసుచరిత్రా నిరూపణం, పురాణ శ్రవణాది ఫలం లాంటి మహత్తరమైన విషయాలు సవివరంగా వర్ణించబడ్డాయి.

## పురాణ మాహాత్మ్యం

వందే బృందావనాసీన మిందిరానంద మందిరమ్ ।
ఉపేంద్రం సాంద్ర కారుణ్యం పరానందం పరాత్పరమ్ ॥

బ్రహ్మవిష్ణు మహేశాఖ్యాయస్యాంశా లోక సాధకాః ।
తమాది దేవం చిద్రూపం విశుద్ధం పరమం భజే ॥ *(శ్లో॥1-2,అధ్యా-1)*

బృందావన దివ్య ధామంలో ఆసీనుడైవున్నవాడు, శ్రీమహాలక్ష్మి దేవి ఆనందానికి నివాసంగా వున్నవాడు, గొప్ప దయ కలిగినవాడు, పరంకన్నా పరమైనవాడు, అన్నిరకాల ఆనందాలకన్నా గొప్ప ఆనందాన్ని ప్రసాదించే ఆనంద స్వరూపుడు, అయిన ఉపేంద్రుడికి (శ్రీకృష్ణ పరమాత్మకి) నమస్కారం చేస్తున్నాను.

ముల్లోకాల్నీ కాపాడే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ఎవరి అంశతో అవతరించారో అలాంటి జ్ఞాన స్వరూపుడు పరిశుద్ధాత్ముడు, పరమపురుషుడు అయిన ఆదిదేవుడికి నమస్కరిస్తున్నాను.

పూర్వం నైమిశారణ్యంలో ఎంతోమంది మునులు మహర్షులు దీర్ఘకాలంగా సత్రయాగాన్ని నిర్వహిస్తున్నారు. ఒకనాడు వ్యాసభగవానుడి శిష్యుడు, పురాణ వేత్త అయిన సూతమహర్షి నైమిశానికి విచ్చేసాడు. ఆయన్ని దర్శించి ఎంతో ఆనందించిన శౌనకాది మహర్షులు సూతుడికి ఘనంగా స్వాగత సత్కారాలు జరిపి ఆయన సుఖంగా ఆసీనుడవగానే ఆయన్నిలా ప్రశ్నించారు.

మహానుభావా! పురాణతత్త్వజ్ఞా! ఈ ప్రపంచమంతా ఎవరివల్ల పుట్టింది? ఈ ప్రపంచానికి ఆధారం ఎవరు? ఇది ఎవరి స్వరూపం? ఈ చరాచర

సృష్టి మొత్తం ఎవరిలో నిలిచి ఉంది? అది ఎవరిలో చివరికి లయమైపోతుంది? ఆది పురుషుడైన శ్రీమహావిష్ణువుని ఎలా ప్రసన్నం చేసుకోవాలి? వర్ణాశ్రమ ధర్మాలు ఎలా ఉంటాయి? అతిథిని ఎలా పూజించాలి? మానవులు మోక్షాన్ని పొందే ఉపాయం ఏది? భక్తి స్వరూపం ఎలా వుంటుంది? దయచేసి మాకీ విశేషాలన్నీ వివరించు అని ప్రార్థించారు. వారి ప్రార్థన విన్న సూతమహర్షి ఎంతో ఆనందించి వారికిలా ప్రబోధించాడు.

మహర్షులారా! పూర్వం సనకమహర్షి నారదుడికి చెప్పిన పురాణాన్నే మీకు చెబుతాను శ్రద్ధగా వినండి. నారదుడు విన్న పురాణం కాబట్టి దీనికి నారదపురాణం అనిపేరు. ఈ నారదపురాణం వేదార్థమంత పవిత్రమైనది. విన్నవారి పాపాలన్నిటినీ నాశనం చేస్తుంది. దుష్టగ్రహాల్ని దుఃస్వప్నాలనీ నశింపచేస్తుంది. ధర్మాని ప్రబోధించి భోగమోక్షాల్ని మానవులకి అందిస్తుంది. ఈ దివ్యపురాణ పఠనం వల్ల మహాపాతకాలు, ఉపపాతకాలు నశిస్తాయి.

మోక్షసాధనమైన ఈ నారదపురాణాన్ని అరిషడ్వర్గాల్ని జయించి, శ్రీహరి మీద భక్తి ప్రపత్తులు కలిగిన సదాచార పరాయణులకి మాత్రమే బోధించాలి. తనని స్మరించేవారి బాధల్ని తొలగించేవాడు, అందరు దేవతలలో కొలువై వుండేవాడు అయిన శ్రీహరి కేవలం భక్తితోనే ఎంతో సంతోషిస్తాడు. శ్రీహరి నామాన్ని శ్రద్ధతోగానీ అశ్రద్ధతోగానీ ఎలా స్మరించినా ఆ మానవుడు పాపవిముక్తుడై మోక్షాన్ని పొందుతాడు.

శ్రీమన్నారాయణుడే బ్రహ్మ, విష్ణువు, శివుడు అనే పేర్లతో అవతరించి, ఈ ప్రపంచాన్ని సృష్టిస్తూ, పాలిస్తూ చివరికి దాన్ని లయం చేస్తున్నాడు. అలాంటి ఆది దేవుణ్ణి మనసులో నిలుపుకున్న వారు ముక్తి పొందుతారు. నామరహితుడు, జాతిలేనివాడు, పరంకన్నా పరమైనవాడు, వేదవేద్యుడు అయిన నారాయణుడు అన్ని పురాణాల చేతా స్తుతించబడుతున్నాడు.

అన్ని పురుషార్థాలకీ కారకుడైన ఆ శ్రీహరిని స్మరించినవాడు మాత్రమే సంసార సాగరాన్ని దాటగలడు.

పరమ పవిత్రమైన ఈ నారద పురాణాన్ని దేవాలయాలలో లేదా పుణ్య ప్రదేశాలలో, పుణ్య తీర్థాలలో, దైవ, బ్రాహ్మణ సన్నిధిలో చెప్పాలి. సత్కథని చెప్పేవారు, వినేవారు ఇద్దరూ సావధాన చిత్తంతో ఉండాలి. ఇది సనాతన ధర్మం. ఏకాగ్రమైన మనస్సుతో హరికథామృతాన్ని స్వీకరించాలి. వ్యాకులమైన మనస్సుతో వుండేవాడు హరికథలోని మాధుర్యాన్ని రసాన్ని ఎలా ఆస్వాదించగలడు? ఎన్నో పాపాలు చేసినవాడైనా సరే ఏదోవిధంగా శ్రీహరినామ స్మరణ చేస్తే ఆయన ప్రసన్నుడవుతాడు. ఓ ధర్మాత్ములారా! హరిభక్తి కలిగినవారికి ధర్మార్థకామమోక్షాలు తప్పక సిద్ధిస్తాయని తెలుసుకోండి".

## నారదమహర్షి చేసిన విష్ణుస్తుతి

సనకుడు, సనందుడు, సనత్కుమారుడు, సనాతనుడు అనే నలుగురూ సనక సనందనాదులుగా ప్రసిద్ధి చెందిన మహర్షులు. వీరు నలుగురూ బ్రహ్మ మానసపుత్రులు. అంతేకాదు పరమవిష్ణు భక్తులు. మహాత్ములు, బ్రహ్మ ధ్యానంచేసే వారు, కోటిసూర్యుల కాంతితో ప్రకాశించే ఆ సనకాది మహర్షులు ఒకనాడు మేరుపర్వతం మీదకి బయలుదేరారు. దారిలో వారికి శ్రీహరిపాదాల నుంచి పుట్టిన గంగాదేవి కనిపించింది. ఆ నదిని చూడగానే దానిలో స్నానం చేయాలని వారికనిపించింది. వెంటనే నదిలో దిగటానికి ఉద్యుక్తులయ్యారు. అదే సమయంలో దేవర్షి నారదుడు అక్కడికి వచ్చాడు.

తన సోదరులైన సనకాది మహర్షులకి భక్తితో నమస్కరించి, ఎంతో భక్తితో నారాయణ నామ సంకీర్తన చేయసాగాడు.

నారాయణాచ్యుతానంత వాసుదేవ జనార్దన ।
యజ్ఞేశ యజ్ఞపురుష కృష్ణో విష్ణో నమోస్తుతే ॥
పద్మాక్ష కమలాకాంత గంగాజనక కేశవ ।
క్షీరోదశాయిన్ దేవేశ దామోదర నమోఽస్తుతే ॥
శ్రీరామ విష్ణో నరసింహ వామన ప్రద్యుమ్న సంకర్షణ వాసుదేవ ।
అజానిరుద్ధా మలరున్మురారే త్వంపాహినః సర్వభయాదజస్రమ్ ॥

*(శ్లో॥9-11,అధ్యా-2)*

ఓ నారాయణా! అనిరుద్ధా! మురారీ! నీవు మమ్మల్ని అన్ని రకాల భయాల నుంచీ రక్షించు" అని శ్రీహరిని ప్రార్థించిన నారదుడు తన అగ్రజులతో కలిసి తాను కూడా పవిత్ర గంగానదిలో స్నానం చేసాడు.

అలా వారంతా గంగాస్నానం చేసిన తరువాత దేవ ఋషి, పితృతర్పణాలు సమర్పించి ఒడ్డుకి వచ్చారు. సంధ్యావిధిని ముగించుకుని, నారాయణుడి గుణ గణాల్ని స్మరిస్తూ పరస్పరం సంభాషించుకోసాగారు. అలా వారంతా హరికథా చర్చలతో తన్మయులై ఉండగా నారదుడు వారితో " ఓ బ్రహ్మవేత్తలారా! మీరంతా సనాతనులు, పరమభాగవతోత్తములు. ఆదిపురుషుడు సృష్టిస్థితి లయకారకుడు ఆ శ్రీమన్నారాయణుడే. ఆయన నిజతత్వాన్ని గురించి నాకు బోధించండి. అలాగే మానవులు చేసే కాయిక, వాచిక, మానసిక, కర్మలు ఏవిధంగా ఫలవంతమవుతాయో దయచేసి తెలియచేయండి" అని వినయంగా ప్రార్థించి దేవాది దేవుడైన శ్రీమహావిష్ణువుని ఇలా ఘనంగా స్తుతించాడు.

## పురుషోత్తమ స్తుతి

నమః పరాయ దేవాయ పరస్మాత్పరమాయ చ
పరావరనివాసాయ సగుణాయాగుణాయ చ ॥ 1

అమాయాయాత్మ సంజ్ఞాయ మాయినే విశ్వరూపిణే
యోగీశ్వరాయ యోగాయ యోగగమ్యాయ విష్ణవే ॥ 2

జ్ఞానాయ జ్ఞానగమ్యాయ సర్వజ్ఞానైకహేతవే
జ్ఞానేశ్వరాయ జ్ఞేయాయ జ్ఞాత్రే విజ్ఞానసంపదే ॥ 3

ధ్యానాయ ధ్యానగమ్యాయ ధ్యాతృపాపహరాయ చ
ధ్యానేశ్వరాయ సుధియే ధ్యేయాధ్యాతృస్వరూపిణే ॥ 4

ఆదిత్యచంద్రాగ్ని విధాతృదేవాః సిద్ధాశ్చ యక్షాసురనాగసంఘాః
యచ్ఛక్తి యుక్తాస్తమజం పురాణం సత్యం స్తుతీశం సతతం నతోఽస్మి ॥ 5

యో బ్రహ్మరూపీ జగతాం విధాతా స ఏవ పాతా ద్విజ విష్ణురూపీ,
కల్పాన్తరుద్రాఖ్యతమస్సదేవశ్శేతేం ఽఘ్రిపానస్తమజం భజామి ॥ 6

యన్నామసంకీర్తనతో గజేన్ద్రో గ్రాహోగ్రబంధాన్మ్ముచే స దేవః
విరాజమానస్స్వపదే పరాఖ్యే తం విష్ణుమాద్యం శరణం ప్రపద్యే ॥ 7
శివస్వరూపీ శివభక్తిభాజాం యో విష్ణురూపీ హరిభావితానామ్,
సంకల్పపూర్వాత్మకదేహ హేతుస్తమేవ నిత్యం శరణం ప్రపద్యే ॥ 8
యః కేశిహన్తా నరకాన్తకశ్చ బాలో భుజాగ్రేణ దధార గోత్రమ్;
దేవం చ భూభారవినోదశీలం తం వాసుదేవం సతతం నతోఽస్మి ॥ 9
లేభేఽవతీర్యోగ్రనృసింహరూపీ యో దైత్యవక్షః కఠినం శిలావత్
విదార్య సంరక్షితావాన్స్వభక్తం ప్రహ్లాదమీశం తమజం నమామి ॥ 10
వ్యోమాదభిర్భూషితమాత్మ సంజ్ఞం నిరంజనం నిత్యమమేయతత్త్వమ్
జగద్విధాతారమకర్మకం చ పరం పురాణం పురుషం నతోఽస్మి ॥ 11
బ్రహ్మేన్ద్రరుద్రానిలవాయు మర్త్య గంధర్వ యక్షాసుర దేవసం ఘైః,
స్వమూర్తి భేదైస్థిత ఏక ఈశస్తమాదిమాత్మానమహం భజామి ॥ 12
యతో భిన్నమిదం సర్వం సముద్భూతం స్థితం చ వై,
యస్మిన్నేష్యతి పశ్చాచ్చ తమస్మి శరణం గతః ॥ 13
యః స్థితో విశ్వరూపేణ సంగీ వాత్ర ప్రతీయతే
అసంగీ పరిపూర్ణశ్చ తమస్మి శరణం గతః ॥ 14
హృదిస్థితోఽపి యో దేవో మాయయా మోహితాత్మనామ్
స జ్ఞాయతే పరిశ్శుద్ధస్తమస్మి శరణం గతః ॥ 15
సర్వసంగనివృత్తానాం శ్యానయోగరతాత్మనామ్
సర్వత్ర భాతి జ్ఞానాత్మా తమస్మి శరణం గతః ॥ 16
దధార మందరం పృష్టే క్షీరోదే ఽమృతమంథనే
దేవతానాం హితార్థాయ తం కూర్మం శరణం గతః ॥ 17
దంష్ట్రాంకురేణ యోఽనన్తస్సముద్ధృత్యార్ణవాద్ధరామ్
తస్థావిదం జగత్ కృత్స్నం వారాహం తం నతోఽస్మ్యహమ్ ॥ 18
ప్రహ్లాదం గోపయన్దైత్యం శిలాతికఠినోరసమ్;
విదార్య హతవాన్యో తం నృసింహం నతోస్మ్యహమ్ ॥ 19

లబ్ధ్వా వైరోచనేర్భూమిం ద్వాభ్యాం పద్భ్యామతీత్య యః,
ఆబ్రహ్మభవనం ప్రాదాత్సురేభ్యస్తం నతోఽజితమ్ ॥ 20
హైహయస్యాపరాధేన హ్యేకవింశతిసంఖ్యయా,
క్షత్రియాన్వయభేత్తా యో జామదగ్న్యం నతోస్మి తమ్ ॥ 21
ఆవిర్భూతశ్చతుర్ధా యః కపిభిః పరివారితః
హతవాన్రాక్షసానీకం రామచంద్రం నతో ఽస్మ్యహమ్ ॥ 22
మూర్తిద్వయం సమాశ్రిత్య భూభారమపహృత్య చ,
సంజహార కులం స్వం యస్తం శ్రీకృష్ణమహం భజే ॥ 23
భూమ్యాదిలోకత్రితయం సంహృత్యాత్మానమాత్మని,
పశ్యన్తి నిర్మలం శుద్ధం తమీశానం భజామ్యహమ్ ॥ 24
యుగాన్తే పాపినోఽశుద్ధాన్ భిత్త్వా తీక్ష్ణాపిధారయా,
స్థాపయామాస యో ధర్మం కృతాదౌ తం నమామ్యహమ్ ॥ 25
ఏవమాదీన్యనేకాని యస్య రూపాణ్యస్య మహాత్మనః,
న శక్యంతే చ సంఖ్యాతుం కోట్యబ్దైర పి తం భజే ॥ 26
మహిమానం తు యన్నామ్నః పరం గంతుం మునీశ్వరాః
దేవాసురాశ్చ మనవః కథం తం క్షుల్లకో భజే ॥ 27
యన్నామశ్రవణేనాపి మహాపాతకినో నరాః
పవిత్రతాం ప్రపద్యన్తే తం కథం స్తౌమి చాల్పధీః ॥ 28
యథాకథం చిద్యన్నామ్ని కీర్తితే నా శ్రుతేఽపి, వా,
పాపినస్తు విశుద్ధాస్స్యుః శుద్ధా మోక్షమవాప్నుయుః ॥ 29
ఆత్మన్యాత్మా నమాధాయ యోగినో గత కల్మషాః,
పశ్యన్తి యం జ్ఞానరూపం తమస్మి శరణం గతః ॥ 30
సాంఖ్యాః పర్వేషు పశ్యన్తి పరిపూర్ణాత్మకం హరిమ్,
తమాదిదేవమజరం జ్ఞానరూపం భజామ్యహమ్ ॥ 31
సర్వసత్వమయం శాన్తం సర్వద్రష్టారమీశ్వరమ్,
సహస్రశీర్షకం దేవం వన్దే భావాత్మకం హరిమ్ ॥ 32

యద్భూతం యచ్చ వై భావ్యం స్థావరం జంగమం జగత్,
దశాంగులం యోఽత్యతిష్ఠత్తమీశమజరం భజే ॥ 33
అణోరణీయాంసమజం మహతశ్చ మహత్తరమ్,
గుహ్యాద్గుహ్యతమం దేవం ప్రణమామి పునః పునః ॥ 34
ధ్యాతః స్మృతః పూజితో వా శ్రుతః ప్రణమితోఽపి వా,
స్వపదం యో దదాతీశస్తం వన్దే పురుషోత్తమమ్ ॥ 35
ఇతి స్తువన్తం పరమం పరేశం హర్షాంబుసంరుద్ధవిలోచనాస్తే,
మునీశ్వరా నారదసంయుతాస్తు సనన్దనాద్యాఃప్రముదం ప్రజగ్ముః ॥ 36
య ఇదం ప్రాతరుత్థాయ పఠేద్వై పౌరుషం స్తవమ్,
సర్వపాప విశుద్ధాత్మా విష్ణులోకం స గచ్ఛతి ॥

*(శ్లో॥21-57,అధ్యా-2,పూ.భా)*

ఈవిధంగా నారదమహర్షి చేసిన శ్రీమహావిష్ణువు స్తుతిని విని సనకాది మహర్షులందరూ ఎంతో ఆనందాన్ని పొందారు. పరమపవిత్రమైన ఈ పురుషోత్తమ స్తుతిని ఉదయాన్నే శ్రద్ధగా పఠించేవారికి, అన్ని పాపాలూ నశించి విష్ణులోకాన్ని చేరుకుంటారు.

## మార్కండేయ చరిత్ర

పూర్వం మహాతపస్వి అయిన మృకండువు అనే మహర్షి ఉండేవాడు. ఆయన సత్యసంధుడు, జితేంద్రియుడు, గొప్ప సహనం కలిగినవాడు. సకల జీవుల్నీ ప్రేమిస్తూ విషయభోగాల మీద ఎలాంటి ఆసక్తీ లేకుండా సంచరించేవాడు. అలాంటి మహితాత్ముడైన మృకండుమహర్షి శాలగ్రామం అనే దివ్య తీర్థంలో పదివేల సంవత్సరాలు కఠోర దీక్షతో తపస్సు చేయసాగాడు. సగుణ పరబ్రహ్మాని గురించి నిరాహారుడై ఆ ముని చేసే తపస్సుచూసి ఇంద్రాదిదేవతలు శంకించి శ్రీమన్నారాయణుణ్ణి శరణువేడారు. దివ్య నామాలతో శ్రీహరిని ఇలా ఘనంగా స్తుతించారు.

నారాయణాక్షరానన్త! శరణాగత పాలక!
మృకండు తపసా త్రస్తాన్పాహి నశ్శరణాగతాన్ ॥ 1
జయ దేవాధిదేవేశ జయ శంఖగదాధర!
జయో లోకస్వరూపాయ జయో బ్రహ్మాండహేతవే ॥ 2
నమస్తే దేవదేవేశ! నమస్తే లోకపావన!
నమస్తే లోకనాథాయ నమస్తే లోకసాక్షిణే ॥ 3
నమస్తే ధ్యానగమ్యాయ నమస్తే ధ్యానహేతవే
నమస్తే ధ్యానరూపాయ నమస్తే ధ్యానసాక్షిణే ॥ 4
కేశిహన్త్రే నమస్తుభ్యం మధుహన్త్రే పరాత్మనే
నమో భూమ్యాదిరూపాయ నమశ్చైతన్యరూపిణే ॥ 5
నమో జ్యేష్ఠాయ శుద్ధాయ నిర్గుణాయ గుణాత్మనే
ఆరూపాయ స్వరూపాయ బహురూపాయ తే నమః॥ 6
నమో బ్రహ్మణ్య దేవాయ గోబ్రాహ్మణహితాయ చ
జగద్దితాయ కృష్ణాయ గోవిందాయ నమో నమః ॥ 7
నమో హిరణ్యగర్భాయ నమో బ్రహ్మాదిరూపిణే
నమస్సూర్యాదిరూపాయ హవ్యకవ్యభుజే నమః ॥ 8
నమో నిత్యాయ వన్ద్యాయ సదానన్దైకరూపిణే
నమస్స్మృతార్తినాశాయ భూయో భూయో నమో నమః॥ 9

*(శ్లో॥55-63,అధ్యా-4,పూ.భా)*

ఈ విధంగా దేవతలు చేసిన స్తోత్రం విని ఎంతో సంతోషించిన శ్రీహరి శంఖచక్రాలని ధరించి వారికి ప్రత్యక్షమయ్యాడు. ఆయన్ని చూసి అందరూ ఒక్కసారిగా సాష్టాంగ దండప్రణామం చేసారు. ఆయనతో "స్వామీ! మృకండు మహర్షి ఘోరమైన తపస్సు చేస్తున్నాడు. ఎందుకోసమో మాకు తెలియటం లేదు. మాకు భయంగా ఉంది. అందుకే నిన్ను శరణువేడుతున్నాం" అన్నారు.

దేవతల అనుమానం విన్న శ్రీహరి చిరునవ్వుతో "దేవతలారా! మీరేమీ శంకలు పెట్టుకోకండి. మృకండు మహర్షి గొప్ప సజ్జనుడు. ఆయనవల్ల, ఆయన

చేసే తపస్సు వల్ల మీకు ఎలాంటి ప్రమాదం జరగదు. మీరాయన్ని ఏమాత్రం అనుమానించకండి. ఎప్పుడూ లోకానికి మంచి చేస్తూ, ఎలాంటి మాత్సర్యం లేని మానవుణ్ణి నిశ్శంకుడు అంటారు. సశంకుడైన వాడు ఎప్పుడూ దుఃఖాన్ని పొందుతాడు. కనుక మీరు ఎలాంటి శంకా లేకుండా మీమీ లోకాలకి వెళ్ళండి" అని ప్రబోధించాడు. శ్రీహరి ధైర్య వచనాలు విని దేవతలంతా సంతోషంగా తిరిగి తమ తమ లోకాలకి తరలిపోయారు.

మృకండు మహర్షి తన తపస్సుని అలాగే శాలగ్రామ క్షేత్రంలో కొనసాగిస్తున్నాడు. ఒకనాడు శ్రీహరి ఆయనకి ప్రత్యక్షమయ్యాడు. పీతాంబరధారి అయిన శ్రీహరిని చూసి ఆనందబాష్పాలు నిండిన కళ్ళతో మృకండుడు ఆయన పాదాల మీద పడిపోయాడు. ఎంతో మధురంగా శ్రీహరి దివ్యరూపాన్ని, ఆయన గుణగణాల్ని ఇలా కీర్తించాడు.

నమః పరేశాయ పరాత్మరూపిణే పరాత్పరస్మాత్ పరతః పరాయ,
అపారపారాయ పరానుకర్త్రే నమః పరపారణాయ ॥ 1

యో నామజాత్యాదివికల్పహీనః శబ్దాదిదోషవ్యతిరేకరూపః
బహుస్వరూపోఽపి నిరంజనో యస్తమీశమీడ్యం పరమం భజామి ॥ 2

వేదాన్తవేద్యం పురుషం పురాణం హిరణ్యగర్భాదిజగత్స్వరూపమ్
అనూపమం భక్తజనానుకంపినం భజామి సర్వేశ్వరమాదిమీడ్యమ్ ॥ 3

పశ్యన్తి యం వీతసమస్తదోషా ధ్యానైకనిష్ఠా విగతస్పృహాశ్చ
నివృత్తమోహాః పరమం పవిత్రం నతోఽస్మి సంసారనివర్తకం తమ్ ॥ 4

స్మృతార్తినాశనం విష్ణుం శరణాగతపాలకమ్,
జగత్సేవ్యం జగద్ధామ పరేశం కరుణాకరమ్ ॥ 5

ఏవం స్తుతస్స భగవాన్విష్ణుస్తేన మహర్షిణా,
అవాప పరమాం తుష్టిం శంఖచక్రగదాధరః ॥ 6

అథాలింగ్య మునిం దేవశ్చతుర్భిర్దీర్ఘబాహుభిః,
ఉవాచ పరమప్రీత్యా వరం వరయ సువ్రత ॥ 7

ప్రీతో౽స్మి తపసా తేన స్తోత్రేణ చ తవానఘ
మనసా యదభిప్రేతం వరం వరయ సువ్రత ॥ 8
దేవ దేవ జగన్నాథ కృతార్థో౽స్మి సంశయః
త్వద్దర్శనమపుణ్యానాం దుర్లభం చ యతః స్మృతమ్ ॥ 9
బ్రహ్మాద్యా యం న పశ్యన్తి యోగినః సంశ్రితవ్రతాః
ధర్మిష్ఠా దీక్షితాశ్చాపి వీతరాగా విమత్సరాః ॥ 10
తం పశ్యామి పరంధామ కిమతో ౽న్యం వరం
వృణే ఏతేనైవ కృతార్థో ౽స్మి జనార్ధన జగద్గురో ॥ 11
యన్నామస్మృతిమాత్రేణ మహాపాతకినో౽పి యే,
తత్పదం పరమం యాన్తి తే దృష్ట్వా కిముతాచ్యుత ॥ 12

*(శ్లో॥85-94,అధ్యా-4,పూ.భా)*

నమః పరేశాయ....

శంఖచక్ర గదాధరుడైన శ్రీహరి మృకండు మహర్షి చేసిన స్తుతికి ఎంతో ఆనందించి, ప్రేమగా ఆయన్ని కౌగిలించుకున్నాడు. ఆయనతో "మహర్షీ! నీ తపస్సుకి, నీ స్తుతికి నేనెంతో ఆనందించాను. వరం కోరుకో" అని అడిగాడు.

మృకండుడు స్వామికి నమస్కరించి "దేవదేవా! పరంధామా! పరమయోగులకి కూడా దుర్లభమైన నీ దివ్య దర్శనాన్ని నాకు ప్రసాదించావు. నా జన్మ చరితార్థమైంది. పరంధాముడవైన నిన్ను చూడటం కన్నా గొప్పవరం ఇంకేముంటుంది" అని వినయంగా అన్నాడు. మృకుండుడి వినయం భక్తి ప్రపత్తులు శ్రీహరికి మరింత ఆనందాన్ని కలిగించాయి. నిర్వ్యాజమైన అతడి తపస్సుకి మెచ్చిన ఆయన "మృకండా! నీవే వరాన్ని కోరనప్పటికీ నిన్ను అనుగ్రహించాలనుకుంటున్నాను. త్వరలో నేను నీకు పుత్రుడిగా జన్మిస్తాను. నేను ఏ కులంలో జన్మిస్తానో ఆ కులం వారంతా తరిస్తారు." అని చెప్పి అదృశ్యమయ్యాడు శ్రీహరి.

**మార్కండేయుడి జననం :** శ్రీహరి ఇచ్చిన వరంతో ఎంతో ఆనందించిన మృకండుడు తన తపస్సుని చాలించి ఇంటికి వచ్చాడు. ఒక శుభముహూర్తంలో

ఉత్తమమైన కన్యని వివాహం చేసుకుని గృహస్థాశ్రమంలోకి ప్రవేశించాడు. మృకండుడి భార్య మహాపతివ్రత. భర్త మనసెరిగిన ఇల్లాలు. త్రికరణశుద్ధిగా ఆయన్ని సేవిస్తోంది. కొన్నాళ్ళు గడిచాక మృకండుడి భార్య గర్భాన్ని ధరించింది. పదినెలలు నిండాక పండంటి పుత్రుణ్ణి ప్రసవించింది. సకల శుభలక్షణాలతో వెలుగొందుతున్న ఆ బాలుడికి మృకండు మహర్షి యథావిధిగా జాతకర్మ జరిపించాడు.

క్రమంగా మృకండుడి పుత్రుడైన మార్కండేయుడు పెరిగి పెద్దై వేదాధ్యయనం, శాస్త్రాధ్యయనం పూర్తి చేసాడు. తండ్రిలాగానే తాను కూడా శ్రీహరిని ధ్యానిస్తూ అన్ని ప్రాణులమీదా దయని చూపిస్తూ ధర్మబద్ధంగా జీవించసాగాడు. ఇంద్రియనిగ్రహం కలిగిన మార్కండేయమహర్షి నారాయణ ప్రీతికోసం గొప్ప తపస్సుచేసాడు. మార్కండేయుడి తపస్సుకి మెచ్చిన శ్రీహరి ప్రత్యక్షమై పురాణ సంహితని రచించే వరాన్ని ప్రసాదించాడు. అంతేకాదు ఆయనకి చిరంజీవిగా ఉండే వరాన్నికూడా అనుగ్రహించాడు. దేవదేవుడైన శ్రీహరి మార్కండేయుడికి తన ప్రభావాన్ని చూపాలనుకుని ప్రళయకాలంలో అందర్నీ నశింపచేసినా ఒక్క మార్కండేయుణ్ణి మాత్రం నశింపచేయకుండా ఉంచాడు.

**దైవకాలమానం :** దేవతల కాలమానం ప్రకారం 12000 సంవత్సరాలు ఒక దైవతయుగం. రెండు వేల దేవయుగాలు ఒక బ్రహ్మాయుగం. అలాంటివే రెండు మానవ కల్పాలు 71 దివ్య యుగాలు ఒక మన్వంతరం. పద్నాలుగు మన్వంతరాలు బ్రహ్మకి ఒక పగలు. అదేవిధంగా మరో పద్నాలుగు మన్వంతరాలు గడిస్తే ఆయనకి ఒకరాత్రి. ఈ విధంగా 28 మన్వంతరాలు గడిచాక ప్రళయం సంభవించి ముల్లోకాలూ నశిస్తాయి.

**మానవకాలమానం :** నాలుగువేల యుగాలు బ్రహ్మదేవుడికి ఒకరోజు. రెండు పరార్థాల కాలం విష్ణువుకి ఒక పగలు. అంతే కాలం ఆయనకి ఒకరాత్రి.

మృకండుడి పుత్రుడైన మార్కండేయుడు శ్రీవిష్ణువు అనుగ్రహంతో, భయంకరమైన ఆ జల ప్రళయంలో ఎండుటాకులా ఇంతకాలం వున్నాడు.

అలా కాలం గడిచాక యోగనిద్రనుంచి మేల్కొన్న శ్రీహరి చుట్టూ వున్న జలాన్ని ఉపసంహరించి, తిరిగి సృష్టిచేయటం ప్రారంభించాడు. ఆ దివ్య దృశ్యాన్ని చూసిన మార్కండేయ మహర్షి ఎంతో ఆశ్చర్యపోయి శ్రీహరిని చేరి పరమభక్తితో ఆయన్నిలా స్తుతించాడు.

## మార్కండేయ మహర్షి చేసిన శ్రీహరి స్తుతి

సహస్రశిరసం దేవం నారాయణమనామయమ్
వాసుదేవమనాధారం ప్రణతోఽస్మి జనార్దనమ్ ॥ 1
పురాణం పరుషం సిద్ధం సర్వజ్ఞానైకభాజనమ్,
పరాత్పరతరం రూపం ప్రణతోఽస్మి జనార్దనమ్ ॥ 2
పరం జ్యోతిః పరంధామ పవిత్రం పరమం పదమ్,
సర్వైకరూపం పరమం ప్రణతోఽస్మి జనార్దనమ్ ॥ 3
అమేయమజరం నిత్యం సదానన్దైకవిగ్రహమ్
అప్రతర్క్యమనిర్దేశ్యం ప్రణతోఽస్మి జనార్దనమ్ ॥ 4
అక్షరం పరమం నిత్యం విశ్వాక్షం విశ్వసంభవమ్
సర్వతత్త్వ మయం శాన్తం ప్రణతోఽస్మి జనార్దనమ్ ॥ 5
తం సదానన్ద చిన్మాత్రం పరాణాం పరమం పదమ్
సర్వం సనాతనం శ్రేష్ఠం ప్రణతోఽస్మి జనార్దనమ్ ॥ 6
సగుణం నిర్గుణం శాన్తం మాయాతీతం సుమాయినమ్
అరూపం బహురూపం తం ప్రణతోఽస్మి జనార్దనమ్ ॥ 7
యత్ర తద్భగవాన్విశ్వం సృజత్యవతి హన్తి చ
తమాదిదేవమీశానాం ప్రణతోఽస్మి జనార్దనమ్ ॥ 8
పరేశ పరమానన్ద శరణాగతవత్సల !
త్రాహి మాం కరుణాసింధో! నమోఽ మనోతీతఽ స్తుతే ॥ 9

*(శ్లో॥36-44,అధ్యా-5,పూ.భా)*

ఓ పరమానందస్వరూపా! శరణాగతవత్సలా! నన్ను కాపాడు. నీకు నమస్కరిస్తున్నాను అని ఎంతో భక్తి ప్రపత్తులతో తనని స్తుతిస్తున్న మార్కండేయుడితో శ్రీహరి.

"బ్రాహ్మణోత్తమా! ఈ లోకంలో భగవంతుడి మీద మనసుని నిలిపిన వారే పరమభాగవతోత్తములు. అలాంటి వారిని నేనెప్పుడూ కాపాడుతూ వుంటాను. నేను నీ నిజస్వరూపాన్ని మరుగుపరిచి భగవద్భక్తుల రూపంలో ఈ లోకాల్ని కాపాడుతూ వుంటాను" అన్నాడు. అప్పుడు మార్కండేయుడు శ్రీహరితో "స్వామీ! భగవద్భక్తులు ఎలా ఉంటారు? ఏ పనులు చేస్తే సామాన్యులు భాగవతులవుతారు? దయచేసి చెప్పండి" అని ప్రార్థించాడు.

**భాగవతులు :** ఓ మార్కండేయా! నిజం చెప్పాలంటే పరమ భాగవతోత్తముల ప్రభావం గురించి వందకోట్ల సంవత్సరాలలో కూడా చెప్పలేము. అన్ని ప్రాణుల హితాన్ని కోరుకునేవారు, అసూయలేనివారు, ఇంద్రియ నిగ్రహం కలిగినవారు, ఇతరుల్ని బాధపెట్టని వారు, దురాశ లేనివారు, పరమశాంత స్వభావులు, ఇతరుల నుంచి దేన్నీ గ్రహించని వారు భాగవతులు అని పిలువబడతారు.

**భాగవతోత్తములు :** సత్కథల్ని శ్రద్ధగా వినేవారు, శ్రీహరి పాదాలమీద భక్తి ప్రపత్తులు కలిగినవారు, తల్లి తండ్రుల్ని గంగా పరమేశ్వర భావంతో ఆరాధించే వారు, నిత్యం భగవంతుణ్ణి అర్చించేవారు, యతుల్ని సన్యాసుల్ని సేవించటంలో ఆసక్తి కలిగినవారు, పరుల్ని నిందించని వారు, అందరికీ హితాన్ని బోధించేవారు, తనలాగానే అన్ని ప్రాణుల్నీ చూసేవారు, శత్రువుల్ని, మిత్రుల్ని సమానంగా ప్రేమించేవారు, ధర్మశాస్త్రాలని బోధించేవారు, సత్యాన్నే పలికేవారు, భాగవతోత్తములు.

పురాణాల్ని వ్యాఖ్యానించేవారు, పురాణాల్ని బోధించేవారు, వాటిని వినేవారు, గోబ్రాహ్మణుల్ని సేవించేవారు, తీర్థయాత్రలు చేసేవారు, హరినామ సంకీర్తన చేసేవారు, ఉద్యానవనాలు, తటాకాలు నిర్మించేవారు, దేవాలయ నిర్మాణం చేసేవారు, గాయత్రీ మంత్రజపాన్ని చేసేవారు, తులసీ వనానికి నమస్కరించేవారు, తులసీ దళాల్ని చెవిలో ఉంచుకునే వారు, అతిథుల్ని పూజించేవారు, వేదార్థాన్ని చెప్పేవారు కూడా భాగవతోత్తములే.

శివప్రియా శివాసక్తా శివపాదార్చనే రతాః ।
త్రిపుండ్రధారిణో యే చ తేవై భాగవతోత్తమాః ॥

వ్యాహరన్తిచ నామాని హరే శ్శంభోర్మహాత్మనః ।
రుద్రాక్షాలం కృతాయే చ తేవై భాగవతోత్తమాః ॥

శివే చ పరమేశేచ విష్ణౌ చ పరమాత్మని ।
సమబుద్ధ్యా ప్రవర్తన్తే తేవై భాగవతాః స్మృతాః ॥

శివాగ్ని కార్య నిరతాః పంచాక్షర జపే రతాః ।
శివధ్యాన శితాయే తేవై భాగవతోత్తమాః ॥

*(శ్లో॥68-71,అధ్యా 5,పూ.భా)*

శివుడి మీద ప్రీతి కలిగినవారు, శివుడి మీద తమ మనస్సుని లగ్నం చేసినవారు, నిత్యం శివపాదార్చనలో తరించేవారు, త్రిపుండ్రాలని ధరించేవారు, పరమపురుషులైన శ్రీహరి, శంకరుల నామాలని కీర్తించేవారు. రుద్రాక్షల్ని అలంకరించుకునేవారు, దక్షిణలు సమర్పించి యాగాలు చేసి రుద్రుణ్ణి ఆరాధించేవారు, పరమేశ్వరుడి గురించి అగ్ని కార్యాలు చేసేవారు, పంచాక్షరీ జపాన్ని చేయటంలో ఆసక్తిని చూపించేవారు, నిత్యం శివుణ్ణి ధ్యానించేవారు, మంచినీళ్ళని, అన్నదానాన్ని, గోదానాన్ని చేసేవారు, ఏకాదశి వ్రతాన్ని ఆచరించేవారు పరమభాగవతోత్తములు.

మార్కండేయా! నేను కూడా కొందరు భాగవతోత్తముల గురించే చెప్పగలిగాను. పూర్తిగా వారి గురించి చెప్పటం నాకు కూడా శక్యం కాదు. ఓ విప్రోత్తమా! నీవు కూడా పరమభాగవతోత్తముడివికా! ఇంద్రియనిగ్రహంతో అందరినీ ప్రేమిస్తూ, అందరిమీదా మైత్రీ భావాన్ని పెంపొందించుకుంటూ నిత్యం ధర్మం మీదే నీ మనసు నిలుపు. తిరిగి మళ్ళీ వచ్చే ప్రళయం వరకూ సకల ధర్మాలనీ ఆచరించి నన్నే సదా ధ్యానించి చివరికి నా పరమపదాన్ని చేరుకుంటావు" అని వరమిచ్చి శ్రీహరి అంతర్ధానమయ్యాడు.

ఈవిధంగా మహాతపస్సంపన్నుడైన మార్కండేయ మహర్షి శ్రీహరిని తన తపస్సుద్వారా మెప్పించి, ఆయన ద్వారా భాగవతోత్తముల లక్షణాల్ని

తెలుసుకుని, వాటిని తాను కూడా శ్రద్ధగా ఆచరించాడు. శ్రీహరి చెప్పిన విధంగా పరమ పవిత్రమైన శాలగ్రామ క్షేత్రానికి వెళ్ళి తపస్సుద్వారా శ్రీహరిని ధ్యానిస్తూ తన కర్మలన్నిటినీ క్షీణింపచేసుకుని చివరికి పరమపదానికి చేరుకున్నాడు. కనుక శ్రీహరిని నమ్మి పూజించేవారు మనసులో వున్న కోరికలన్నిటినీ పొందగలరు.

## గంగా మాహాత్మ్యం

క్షేత్రాలన్నిటిలోకీ ఉత్తమక్షేత్రం, తీర్థాలన్నిటిలోకీ ఉత్తమ తీర్థం, గంగాయమునా నదుల సంగమస్థలం ప్రయాగ. తెలుపు నలుపు నీళ్ళతో పవిత్రమైన ఈ దివ్యతీర్థాన్ని ముక్కోటి దేవతలు సేవిస్తారు. విష్ణుపాదం నుంచి పుట్టింది గంగ కాగా, సూర్యుడి కుమార్తెగా జన్మించింది యమున. ఈ రెండు నదుల సంగమస్థానంలో చేసిన స్నానం సకల పాపాలనీ హరిస్తుంది. ఈ భూమండలం మీద వ్యాపించిన అన్ని క్షేత్రాలకన్నా ప్రయాగ క్షేత్రం ఎంతో గొప్పది. ఈ దివ్య క్షేత్రంలోనే పూర్వం బ్రహ్మదేవుడు శ్రీమన్నారాయణుడి గురించి యజ్ఞం చేసాడు. అలాగే ఎంతో మంది మునులు, ఋషులు కూడా ఇక్కడ యజ్ఞ యాగాలు నిర్వహించారు.

వంద యోజనాల దూరంలో (800మైళ్ళు) ఉన్నవాడు కూడా గంగా! అని ఒక్కసారి స్మరిస్తే చాలు పాపాల నుంచి విముక్తి పొందుతాడు. విష్ణుపాదాల నుంచి జన్మించి శివుడి తలమీద నిల్చిన గంగానదిని దేవతలు కూడా సేవిస్తారు. గంగలోని ఇసుకని నుదుట ధరించినా ఎంతో పుణ్యం వస్తుంది. ఇక స్నానంచేస్తే వచ్చే ఫలితం గురించి చెప్పాలంటే ఎవరికీ సాధ్యంకాదు. గంగా స్నానం విష్ణుసారూప్య ఫలాన్ని ప్రసాదిస్తుంది. గంగని స్మరించినవాడికి అన్ని తీర్థాలలో స్నానంచేసిన ఫలం లభిస్తుంది. గంగలో స్నానం చేసిన పాపులు కూడా పుణ్యలోకాల్ని పొందుతారు. గంగా స్నానం చేసిన వాడిని చూసినా చాలు పాపాలన్నీ నశిస్తాయి.

తులసీమూల సంభూతాద్విజపాదోద్భవా తథా ।
గంగోద్భవాతు మృల్లోకాన్నయత్య చ్యుత రూపతాం ॥ *(శ్లో॥20,అధ్యా-6)*

తులసిచెట్టు దగ్గరున్న మట్టి, ఉత్తమమైన బ్రాహ్మణుడి పాదాల దగ్గరున్న మట్టి, గంగానదిలో ఉన్న మట్టి మానవులకి శ్రీహరి సారూప్యాన్ని ప్రసాదిస్తుంది.

గంగానది, తులసి, విష్ణుభక్తి, మానవులకి ఎంతో దుర్లభమైనవి. సద్ధర్మాన్ని బోధించేవాడి పాదధూళి, గంగలోని మట్టి, తులసిచెట్టు దగ్గరున్న మట్టి – వీటిని భక్తితో తలమీద ధరించిన వాడు విష్ణులోకానికి చేరుకుంటాడు. గంగా అనే రెండక్షరాలు ఒక్కసారి పలికినా అన్ని పాపాలూ తొలగిపోయి విష్ణులోకం ప్రాప్తిస్తుంది. గంగానదిలో మూడు యోజనాలు ప్రయాణించినవాడు అన్ని పాపాలనీ పోగొట్టుకుని సూర్యలోకానికి చేరుకుంటాడు.

సేయంగంగా మహాపుణ్యా నదీ భక్త్యానిషేవితా ।
మేషతులా మృగార్కేషు పాపయత్యఖిలం జగత్ ॥
గోదావరీ భీమరథీకృష్ణారేవా సరస్వతీ ।
తుంగభద్రాచ కావేరీ కాళిందీ బాహుదాతథా ॥
వేత్రవతీ తామ్రపర్ణీ సరయూశ్చ ద్విజోత్తమ ।
ఏవమాదిషు తీర్థేషు గంగాముఖ్యతమా స్మృతా ॥

*(శ్లో॥29-31,అధ్యా-6)*

పరమపావనమైన ఈ గంగానదిని మేష–తులా–మకర రాశుల్లో సూర్యుడున్నప్పుడు సేవిస్తే వారి పాపాలన్నీ నశించి పుణ్యలోకాలు లభిస్తాయి. గోదావరీ, భీమరథీ, కృష్ణా, రేవా, సరస్వతీ, తుంగభద్రా, కావేరీ, కాళిందీ, బాహుదా, వేత్రవతీ, తామ్రపర్ణీ, సరయూ లాంటి పుణ్య తీర్థాలకన్నా గొప్పది, ప్రధానమైనది గంగానది.

**గంగా–కాశీ :** గంగానది ప్రవహించే అన్ని క్షేత్రాలలోకీ ఉత్తమమైనది కాశీక్షేత్రం. ఇది దేవతలందరి చేతా నిత్యం సేవించబడే దివ్య క్షేత్రం. 'కాశీ' అన్న పేరుని నిశ్చలంగా స్మరించేవారు అన్ని పాపాలనుంచీ విముక్తులై

శివలోకాన్ని చేరుకుంటారు. ఎన్ని పాపాలు చేసిన వాడైనా సరే కాశీనామాన్ని జపిస్తే చాలు పాపాలన్నిటినీ నశింపచేసుకుంటాడు. ఇలా 'కాశీ' నామస్మరణవల్ల లభించిన పుణ్యంతో స్వర్గానికి వెళ్ళి అక్కడ సుఖాలనుభవించి, తరువాత మహారాజుగా జన్మించి కాశీనగరానికి చేరి ముక్తిని పొందుతాడు.

మకర సంక్రమణ కాలంలో గంగానదిలో స్నానంచేస్తే శుభఫలితాలు కలుగుతాయి. కేవలం గంగా జలాన్ని తాగినా చాలు ఉత్తమలోకాలు ప్రాప్తిస్తాయి. ఎప్పుడూ గంగని ధరిస్తాడు కనుకనే శంకరుడు లోకాలన్నిటికీ శుభాలు ప్రసాదించగలుగుతున్నాడు. ఆయనే లింగరూపాన్ని ధరించి గంగతో అభిషేకించబడుతున్నాడు.

## హరిహర అభేదం

హరిరూపధరంలింగం లింగరూపధరోహరిః ।
ఈషదప్యన్తరం నాస్తి భేదకృచ్ఛానయోః కుధీః ॥ 1
అనాది నిధనే దేవే హరిశంకర సంజ్ఞితే ।
అజ్ఞానసాగరే మగ్నాభేదం కుర్వంతి పాపినః ॥ 2
యోదేవో జగతామీశః కారణానాం చ కారణం ।
యుగాంతే జగదత్యేతద్రుద్రరూపధరో విభుః ॥ 3
రుద్రోవై విష్ణురూపేణ పాలయత్యఖిలం జగత్ ।
బ్రహ్మరూపేణ సృజతి తదత్త్యైవ స్వయం హరః ॥ 4
హరి శంకరయోర్మధ్యే బ్రహ్మణ శ్చాపియో నరః ।
భేదం కరోతిసోఽ భ్యేతి నరకం భృశదారుణమ్ ॥ 5
హరి హరం విధాతారం యః పశ్యత్యేకరూపిణమ్ ।
సయాతి పరమానందం శాస్త్రాణా మేష నిశ్చయః ॥ 6
యోఽ సావనాదిస్సర్వజ్ఞో జగతామాదికృద్విభుః ।
నిత్యం సన్నిహితస్త్రలింగరూపీజనార్ధనః ॥ 7

*(శ్లో॥44-50, అధ్యా-6.పూ.భా)*

శివలింగమే హరి రూపాన్ని ధరిస్తుంది. ఆ శ్రీహరే లింగరూపాన్ని ధరిస్తాడు. ఈ రెండు రూపాలకీ ఎలాంటి భేదం లేదు. అలా వారిద్దరి మధ్యా భేదభావాన్ని చూపేవాడు దుష్టుడే అవుతాడు. శ్రీహరి-శంకరుడు ఇద్దరూ ఆద్యంతాలు లేని దేవుళ్ళే. అజ్ఞాన సముద్రంలో మునిగిన పాపాత్ములు మాత్రమే వాళ్ళిద్దరూ వేరువేరని చెబుతారు.

జగదీశ్వరుడు సకల కారణాలకీ కారణభూతుడైన ఆదిదేవుడే యుగాంత కాలంలో రుద్రుడిరూపంతో సృష్టిని సంహరిస్తాడు. ఆ రుద్రుడే తిరిగి శ్రీహరి రూపంలో జగత్తునంతా కాపాడుతుంటాడు. తిరిగి ఆయనే బ్రహ్మగా అవతరించి ప్రపంచాన్ని సృష్టిస్తుంటాడు.

హరిహరుల్లో భేదాన్ని చూసేవాడు చెప్పేవాడు, నరకానికి పోతాడు. హరిని, హరుణ్ణి, బ్రహ్మదేవుణ్ణి ఒకే స్వరూపంగా భావించేవాడు పరమానందాన్ని పొందుతాడని శాస్త్రాలు చెబుతాయి. ఆద్యంతాలు లేనివాడు, సర్వజ్ఞుడు, జగత్తుని సృష్టించేవాడు అయిన పరమాత్మలో లింగరూపాన్ని ధరించిన జనార్ధనుడు అంతర్లీనంగా వుంటాడు.

**కాశీమహిమ :** కాశీ విశ్వేశ్వర లింగం ద్వాదశజ్యోతిర్లింగాలలో ఒకటి. ఆ జ్యోతిర్లింగాన్ని దర్శించిన వారు పరంజ్యోతిని చేరుకుంటారు. సకల లోకాలనీ పవిత్రం చేసే కాశీనగరానికి ప్రదక్షిణ చేసినవాడు సప్తద్వీపాలతో, సప్త సముద్రాలతో కూడిన భూమండలాన్నంతా ప్రదక్షిణ చేసిన ఫలితం లభిస్తుంది.

## దానం - ధర్మం

దానాలు స్వీకరించేవారిలో బ్రాహ్మణ వర్ణంవారు ఉత్తములు. తాముచేసే దానం అక్షయంగా ఉండాలని భావించేవారు, తమ దానాన్ని విప్రులకే ఇవ్వాలి.

బ్రాహ్మణుడు ఎలాంటి భయంలేకుండా అందరినుంచీ దానాల్ని స్వీకరించవచ్చు. క్షత్రియులు, వైశ్యులు ఎప్పుడూ దానం తీసుకోకూడదు. తీవ్రస్వభావంతో ఉండేవాడికి, పుత్ర సంతానం లేనివాడికి, డాంబికాచారాలు పాటించేవాడికి, పరుల భార్యల్ని కోరుకునేవాడికి, పరుల ద్రవ్యాన్ని ఆశించేవాడికి,

జ్యోతిష్యం చెప్పేవాడికి, అసూయతో ఉండేవాడికి, కృతఘ్నుడికి, ఎప్పుడూ యాచించేవాడికి, హింసాత్మకుడికి, ఖలుడికి, రసాలు అమ్మేవాడికి, వేదాల్ని, స్మృతుల్ని అమ్ముకునేవాడికి ఇచ్చిన దానం నిష్ఫలమైపోతుంది.

**దానం ఇవ్వకూడని వారు :** పాటలు పాడి జీవించేవాడికి, వ్యభిచరించే స్త్రీ భార్యగా కలిగినవాడికి, ఇతరుల్ని పీడించేవాడికి, ఖడ్గంతో జీవించేవాడికి, సిరాతో జీవించేవాడికి, గ్రామపురోహితుడికి, గ్రామాధికారికి ఇచ్చిన దానం నిష్ఫలమవుతుంది. అదేవిధంగా సిరాతో జీవించేవాడికి (రచయితకి), దేవాలయంలో ధనం తీసుకుని విలాసాలకి ఖర్చుచేసేవాడికి, ఇతరులకి వంట చేసేవాడికి, వైద్యుడికి, శూద్రుల అన్నం తిన్నవాడికి, శూద్రుల శవాల్ని దహనం చేసేవాడికి, వ్యభిచారిణుల అన్నం తినేవాడికి, ఇచ్చిన దానం కూడా నిష్ఫలమైపోతుంది.

విష్ణుసహస్రనామం అమ్మేవాడికి, సంధ్యావందనం చేయనివాడికి, పగలు నిద్రపోయేవాడికి, సంభోగం చేసేవాడికి, దుష్టదానాలు స్వీకరించేవాడికి, సంధ్యాసమయంలో తినే వాడికి, బంధువులందరూ విడిచిపెట్టిన వాడికి, తనకన్నా ముందు పెళ్ళి చేసుకున్న తమ్ముడికి, స్త్రీల వశంలో ఉన్నవాడికి, మద్యమాంసాలు స్వీకరించే వాడికి, విటులకి, దొంగకి దానం ఇవ్వకూడదు. వారి నుంచి తీసుకోకూడదు.

శ్రద్ధగా ఇచ్చింది, శ్రీహరికి సమర్పించింది, యోగ్యుడైనవాడు అడిగినప్పుడు ఇచ్చింది ఉత్తమదానం అనబడుతుంది. పరలోక ఫలాన్ని కోరుకుని ఇహలోకంలో ప్రతిఫలాపేక్షతో చేసిన దానం మధ్యమం, డాంబికం కోసం ఇతరులకి అశ్రద్ధగా ఇచ్చేదానం అధమం.

ధనానికి దానం, అనుభవం, వినాశనం అనే మూడురకాల గతులుంటాయి. దానం చేయని, అనుభవించని ధనం నాశనమవుతుంది. ధనం అనేది ధర్మానికి ఉపయోగించాలి. ఆ ధర్మాన్ని శ్రీహరి ప్రీతి కోసం ఆచరించాలి. సాటి ప్రజలకోసం జీవించని మనుషులు మరణించిన వారితో సమానం. శరీరంతో, మనసుతో, మాటతో పరోపకారం చేయని మానవులు మహాపాపులు.

# భగీరథ - యమధర్మరాజ సంవాదం

పూర్వం భగీరథుడనే చక్రవర్తి సమస్త భూమండలానికీ అధిపతిగా వున్నాడు. ఆయన ఎంతో ధర్మబద్ధంగా తన రాజ్యాన్ని పాలిస్తున్నాడు. సత్యవాది, ధర్మాత్ముడు అయిన భగీరథుడు మహాపరాక్రమవంతుడు కూడా. ఎంతో సౌందర్య వంతుడైన ఆ మహారాజు అన్ని శాస్త్రాల్నీ అభ్యసించి, నిత్యం తన రాజ్యంలో యజ్ఞ యాగాది ధార్మిక క్రతువుల్ని జరిపించేవాడు. నిత్యం అతిథిసేవలో తరించే ఆ పరమధర్మాత్ముణ్ణి దర్శించాలని, యమలోకాధినేత యమధర్మరాజు ఒకనాడు భగీరథుడి దగ్గరకి వచ్చాడు.

భగీరథుడు తన అతిథిగా వచ్చిన యమధర్మరాజుని స్వాగతించి అతిథి సత్కారాలు ఘనంగా జరిపాడు. అతడి సేవలకి సంతోషించిన యమధర్మరాజు "ఓ భగీరథా! నీవెంతో ధర్మాత్ముడివి. ముల్లోకాల్లో నీ కీర్తి విస్తరించింది. అదివినే నేను నిన్ను చూడటానికి వచ్చాను. నీ జీవితం అందరికీ ఆదర్శప్రాయం" అని అన్నాడు.

యమధర్మరాజు మాటలు విన్న భగీరథచక్రవర్తి ఆయనకి వినయంగా నమస్కరించి "ఓ సమదర్శీ! నామీద నీకు దయ ఉంటే! నాకు కొన్ని సందేహాలున్నాయి. అవి ఏమిటంటే? ధర్మాలు ఎలాంటివి? ధర్మాచరణచేసే వారికి ఎలాంటి లోకాలు ప్రాప్తిస్తాయి? నీవు ఎవర్ని ప్రేమగా ఆదరిస్తావు? ఎవర్ని నీవు కఠినంగా శాసిస్తావు? దయచేసి నాకు చెప్పు" అని ప్రార్థించాడు.

భగీరథా! ధర్మం అనేది వివిధ రకాలుగా వుంటుంది. ధర్మం గురించి పూర్తిగా చెప్పాలంటే లక్షసంవత్సరాలు కూడా సరిపోవు. అయినా నీవు అడిగావు కనుక సంగ్రహంగా చెబుతాను విను-

లోకంలో బ్రాహ్మణులకి బ్రతుకు తెరువు కల్పించటం మహాపుణ్య కార్యక్రమంగా చెప్పబడింది. అదే విధంగా ఆధ్యాత్మ వేత్తకి దానం చేస్తే దాని ఫలితం ఎప్పటికీ తగ్గదు. బ్రాహ్మణుడికి తగిన ఉపాధి కల్పించిన వాడి పుణ్యఫలం బ్రహ్మకూడా లెక్కపెట్టలేడు. బ్రాహ్మణులకి హితాన్ని చేకూర్చినవాడు అన్ని యజ్ఞాలూ చేసినవాడితో సమానం.

స్వయంగా చెఱువుని త్రవ్వించినా, ఇతరులచేత త్రవ్వింపచేసినా అతడికి వచ్చే పుణ్యఫలాన్ని వర్ణించటానికి వందసంవత్సరాలు కూడా చాలవు. కనీసం ఒక్క బాటసారి అయినా చెఱువులో నీళ్ళని త్రాగితే ఆ చెఱువు నిర్మించిన వాడి పాపాలన్నీ నశిస్తాయి. చెఱువులు త్రవ్వించటానికి శక్తి కొద్దీ సాయం చేసేవాడు, ఆ త్రవ్వటాన్ని చూసి ఆనందించేవాడు, చెఱువు త్రవ్వమని ప్రోత్సాహించేవాడు సమానమైన ఫలితాల్ని పొందుతారు. చెఱువు త్రవ్వేడప్పుడు దానికి సాయంగా ఆ చెఱువులోని ఆవగింజంత మట్టిని తీసి బైటికి పడేసినా సకల పాపాలనుంచీ విముక్తుడై వందసంవత్సరాలు స్వర్గంలో నివసిస్తాడు.

**వీరభద్రుడి కథ :** భగీరథా! పూర్వం గౌడదేశంలో వీరభద్రుడనే సుప్రసిద్ధమైన రాజుండేవాడు. ఆ ప్రభువు ఎంతో పరాక్రమవంతుడు. దయాధర్మ గుణాలు కలిగినవాడు. ఎప్పుడూ బ్రాహ్మణుల్ని పూజిస్తూ, వేద శాస్త్రాల్ని గౌరవించేవాడు. అతడి భార్యపేరు చంపక మంజరి. వీరభద్రుడి మంత్రులు కూడా సకల శాస్త్రాలు, సకల విషయాలు తెలిసినవారు. ధర్మాధర్మ పరిజ్ఞానం కలిగినవారు. వీరభద్రుడి రాజ్యంలో అధర్మంగా ప్రవర్తించేవాడు ఒక్కడు కూడా లేడు. అలా వీరభద్రుడి రాజ్యం భూలోక స్వర్గంగా ప్రసిద్ధి పొందింది.

ఒకనాడు వీరభద్రుడు తన మంత్రులతో సైన్యంతో సహా వేటకి వెళ్ళాడు. మధ్యాహ్నం వరకూ వేటాడిన రాజు బాగా అలసిపోయాడు. ఆయనకి ఆయన పరివారానికి విపరీతమైన దాహం వేసింది. అందరూ కలిసి సమీపంలో ఉన్న ఒక చెఱువు దగ్గరకెళ్ళారు. అయితే ఆ చెఱువులో నీళ్ళు లేక ఎండి పోయి కనిపిస్తోంది. రాజు అదిచూసి ఇంత ఎత్తు ప్రాంతంలో ఈ సరోవరాన్ని ఎవరు నిర్మించారు? ఇందులో నీళ్ళు ఎందుకు లేవు? ఇప్పుడు అందరికీ దాహం తీరేదెలా? అని ఆలోచించాడు. అంతలో వీరభద్రుడి మంత్రి నీళ్ళు లేని ఆ సరస్సులోకి దిగి ఒక మూలగా కొంచెం త్రవ్వించాడు. ఆశ్చర్యకరంగా వెంటనే ఆ త్రవ్విన ప్రదేశం నుంచి నీళ్ళు బైటికి వచ్చాయి. రాజు, అతడి మంత్రి బుద్ధిసాగరుడు మిగిలిన పరివారం ఆ నీళ్ళని త్రాగి సేదతీరారు. అప్పుడు బుద్ధి సాగరుడు వీరభద్రుడితో ఇలా అన్నాడు.

మహారాజా! ఈ సరస్సు కేవలం వర్షం వచ్చినప్పుడు మాత్రమే నిండుతుంది. వర్షాలు లేకపోతే ఇదిగో ఇలా ఎండిపోయి వుంటుంది. కనుక దీన్ని బాగా లోతుగా త్రవ్వితే ఎప్పుడూ ఇందులో నీళ్ళు వుండే అవకాశం వుంది. దానివల్ల ఈ ప్రాంతానికి వచ్చిన వారికి ఎంతో ఉపయోగ కరంగా వుంటుంది. దయచేసి ఈ సరస్సుని లోతుగా త్రవ్వేందుకు అనుమతించండి" అని కోరాడు. వీరభద్రుడికి కూడా మంత్రి ఆలోచన నచ్చింది. వెంటనే సరస్సుని త్రవ్వటానికి అనుమతించాడు.

రాజాజ్ఞతో బుద్ధిసాగరుడు పనివాళ్ళని పిలిపించి ఆ సరస్సులోపల 300 అడుగుల లోతు త్రవ్వించాడు. అంతేకాదు దానిచుట్టూ పటిష్ఠంగా ఒకరాతి గోడని కూడా నిర్మింపచేసాడు. ఆ విధంగా బుద్ధిసాగరుడు నిర్మించిన ఆ సరస్సు నీళ్ళతో నిండి ఆ ప్రాంతంలో సంచరించే బాటసారులకి దాహం తీరుస్తోంది. భగీరథా! కొంతకాలానికి ఆయుష్షుతీరిన ఆ బుద్ధి సాగరుడు మరణించి నా సామ్రాజ్యమైన యమలోకానికి వచ్చాడు. జీవుల పాప పుణ్యాల్ని లిఖించే చిత్రగుప్తుణ్ణి పిలిచి ఈ బుద్ధిసాగరుడు గురించి అడిగాను. అప్పుడు చిత్ర గుప్తుడు బుద్ధిసాగరుడు చేసిన గొప్ప పనిని (సరోవరాన్ని త్రవ్వించటం) గురించి నాకు చెప్పాడు.

ఒక ధర్మకార్యం చేయటానికి ప్రేరేపించి తాను స్వయంగా ఆ ధర్మకార్య నిర్వహణలో పాలుపంచుకున్న బుద్ధిసాగరుడు ఎంతో గొప్పపుణ్యం చేసాడు. కనుక ఇతడు ధర్మవిమానాన్ని అధిరోహించటానికి అర్హుడని గ్రహించి అతణ్ణి విమానం ఎక్కించాను. మరికొంత కాలానికి వీరభద్రమహారాజు కూడా మరణించి నా లోకానికి వచ్చాడు. అతని విషయం గురించి కూడా నేను చిత్రగుప్తుణ్ణి అడిగాను. వీరభద్రుడు మంచినీటి సరస్సు త్రవ్వించిన విషయం గురించి ఆయన నాకు చెప్పాడు. రాజుని మంత్రినీ నేను అభినందించి వారితో ఆ సరస్సు పూర్వచరిత్ర గురించి ఇలా చెప్పాను.

పూర్వం సైకతపర్వత శిఖరం మీద ఉన్న ఈ సరస్సుని ఒక లకుముకి పిట్ట తన ముక్కుతో రెండంగుళాలు త్రవ్వింది. తరువాత కొంత కాలానికి

ఒక వరాహం వచ్చి తన కోరలతో ఒక మూరలోతు త్రవ్వింది. మరికొంత కాలానికి అదే వరాహం మరో రెండు మూరలు త్రవ్వింది. దానితో అందులోకి నీరు వచ్చింది. చుట్టుపక్కలున్న చిన్న చిన్న జంతువులు ఆ నీటిని త్రాగాయి. అలా మూడు సంవత్సరాలు గడిచాక పెద్ద ఏనుగుల గుంపు అక్కడికి వచ్చి మరో మూడు మూరల లోతుగా త్రవ్వాయి. అప్పుడా చెఱువులోకి వచ్చిన నీరు మూడు నెలలు వుంది. అది జరిగిన కొద్ది కాలానికి ఎండాకాలం రావటంతో చెఱువులో నీరంతా ఎండిపోయింది. సరిగ్గా అప్పుడే మీరక్కడికి వచ్చారు. మీరు ఒక మూర త్రవ్వగానే లోపలున్న నీరు తిరిగి బైటికి వచ్చింది. దాన్ని త్రాగి మీరు దాహం తీర్చుకున్నారు.

వీరభద్రా! నీ మంత్రి ఉపదేశంతో నీవు మూడువందల అడుగుల లోతుగా ఆ చెఱువుని త్రవ్వించావు. దానివల్ల ఆ చెఱువునిండా నీరు వచ్చింది. దానిచుట్టూ అందంగా రాతిప్రాకారం నిర్మించటంతో ఆ నీరంతా స్థిరంగా అందులోనే ఉంది. దాని చుట్టూ చక్కటి చెట్లు నాటించి నీవెంతో పుణ్యం చేసావు. ఈ కారణంగానే పూర్వం చెఱువుని త్రవ్విన ప్రాణులతో పాటూ మీ ఇద్దరికీ ధర్మవిమానాన్ని అధిరోహించే యోగ్యత లభించింది" అని అన్నాడు. యమధర్మరాజు మాట విని వీరభద్రమహారాజు కూడా ధర్మవిమానాన్ని అధిరోహించాడు.

భగీరథా! ఒక సరోవరం నిర్మించటం వల్ల ఎంతో గొప్ప పుణ్యఫలం లభిస్తుందో నీకు తెలియచేయటానికే ఈ వృత్తాంతాన్ని చెప్పాను. పవిత్రమైన ఈ కథని విన్నవారు, పఠించినవారు సకలపాపాలనుంచీ విముక్తులై ఒక గొప్ప సరోవరాన్ని (చెఱువుని) నిర్మించిన పుణ్య ఫలితాన్ని పొందుతారు.

## దేవాలయ నిర్మాణ ఫలం

ఎవరైనా శివాలయం లేక వైష్ణవాలయాన్ని నిర్మించినా, నిర్మించటానికి ప్రోత్సహించినా, సహకరించినా, వారి మాతృవంశం, పితృవంశం మూడు కల్పాలు విష్ణులోకంలో నివసిస్తారు. మట్టితో దేవాలయాన్ని నిర్మించిన వాళ్ళు

దివ్య శరీరాన్ని ధరించి ఉత్తమ విమానంలో విష్ణులోకాన్ని చేరి అక్కడ మూడు కల్పాలు నివసించి ఆ తరువాత సరాసరి అక్కణ్ణుంచి బ్రహ్మలోకానికి వెళతారు. ఆ బ్రహ్మలోకంలో రెండు కల్పాలు నివసించి, స్వర్గాన్ని చేరి అక్కడ ఒక కల్పం సుఖాలనుభవించి, తిరిగి యోగులకులంలో జన్మిస్తారు. అలా జన్మించిన వారు వైష్ణవయాగాన్ని అవలంబించి శాశ్వతమైన మోక్షాన్ని పొందుతారు.

చెక్కతో దేవాలయాన్ని నిర్మించినవారు ఇంతకన్నా రెట్టింపు ఫలితాన్ని పొందుతారు. అలాగే ఇటుకలతో ఆలయం నిర్మించినవాడికి మూడు రెట్ల ఫలితం, శిలలతో నిర్మించిన వాడికి నాలుగురెట్ల ఫలితం, స్ఫటికశిలతో ఆలయం నిర్మిస్తే పదిరెట్లు అధికఫలం లభిస్తుంది. అదే ఆలయాన్ని రాగితో నిర్మిస్తే వందరెట్లు, బంగారంతో నిర్మిస్తే కోటిరెట్లు అధిక ఫలితం కలుగుతుంది.

దేవాలయాన్ని, తటాకాన్ని, గ్రామాన్ని ధర్మబద్ధంగా పాలించేవారికి వాటిని నిర్మించిన వారికన్నా వందరెట్లు అధిక ఫలితం లభిస్తుంది. దేవాలయంలో నీళ్ళు చల్లి అలికి ముగ్గువేసి పరిశుభ్రంగా ఉంచేవారు శాశ్వతమైన విష్ణులోకాన్ని పొందుతారు. సరస్సు, తటాకం, కూపం, దిగుడుబావి, పద్మసరస్సు వీటిని నిర్మించిన వారికి అనంతమైన పుణ్యఫలాలు లభిస్తాయి. ధనవంతుడు రాళ్ళతో నిర్మించినా, ధనహీనుడు మట్టితో నిర్మించినా ఇద్దరికీ సమానంగానే పుణ్యఫలం లభిస్తుంది.

## తులసీ సేవా ఫలం

నారాయణుడికి అత్యంత ప్రీతిపాత్రమైనది తులసి చెట్టు. అలాంటి తులసీ వృక్షాన్ని నాటినవారు తమ మాతృ, పితృవంశాలవారు వందకల్పాలు నారాయణలోకంలో నివసిస్తారు. తులసి చెట్టుదగ్గరున్న మట్టితో ఊర్ధ్వ పుండ్రాలు (నామాలు) పెట్టుకున్నవారు విష్ణు మందిరాన్ని చేరుకుంటారు. ఒక్క చుళుకం నీళ్ళని తులసి చెట్టు మొదట్లో పోసినా సూర్యచంద్రులున్నంత వరకూ శ్రీమహావిష్ణువు లోకంలో నివసిస్తారు.

బ్రాహ్మణులకి తులసీదళాన్ని ఇచ్చినవాడు మూడు తరాల వరకు బ్రహ్మలోకంలో నివసిస్తారు. తులసీదళాలతో శాలగ్రామాన్ని అర్చించినవారు

ప్రళయకాలం వరకూ విష్ణు భవనంలో నివసిస్తారు. తులసీ వృక్షానికి లేదా వనానికి చుట్టూ ముళ్ళ తీగతో రక్షణగా ప్రాకారాన్ని నిర్మించినవారు ఇరవై ఒక్క తరాలు విష్ణు లోకంలో ఆనందాలనుభవిస్తారు. తులసీదళంతో శ్రీహరి పాదాల్ని పూజించినవారు శాశ్వతమైన విష్ణు పదాన్ని చేరుకుని తిరిగి జన్మనెత్తరు.

## శ్రీహరి స్నానఫలం

జగన్నాథుడైన నారాయణుడికి ద్వాదశీతిథిలోకానీ,పూర్ణిమా తిథినాడు గానీ పాలతో స్నానం చేయిస్తే పదివేల తరాలు విష్ణులోక నివాసాన్ని పొందుతారు. ద్వాదశినాడు ఒక్క గరిట నెయ్యితో (ఆవునెయ్యి) శ్రీహరి ప్రతిమని అభిషేకిస్తే కోటి తరాలవారు శ్రీహరి సాయుజ్యాన్ని పొందుతారు. ఏకాదశీతిథినాడు పంచామృతాలతో శ్రీహరికి స్నానం చేయిస్తే పది లక్షల తరాల వారికి శ్రీహరి సాయుజ్యం లభిస్తుంది.

ఏకాదశి, ద్వాదశి, పూర్ణిమా తిథుల్లో కొబ్బరినీళ్ళతో శ్రీహరి ప్రతిమకి స్నానం చేయిస్తే పదిజన్మల్లో చేసిన పాపం తొలగిపోయి రెండు వందల తరాల వారు శ్రీహరితో కలిసి ఆనందిస్తారు. చెఱుకు రసంతో మహావిష్ణువుని అభిషేకిస్తే లక్షతరాలు విష్ణులోక నివాసం దొరుకుతుంది. పుష్పోదకం లేక గంధోదకంలో స్నానం చేయించినా అదే ఫలితం లభిస్తుంది.

సూర్య సంక్రమణం వున్న రోజు పాలతో శ్రీహరి ప్రతిమని అభిషేకిస్తే ఇరవై ఒక్క తరాల వారు విష్ణులోకంలో నివసిస్తారు. శుద్ధ చతుర్దశి, అష్టమి, పూర్ణిమ, ఏకాదశి, ద్వాదశి, పంచమి తిథులలో గానీ, ఆదివారం, సోమవారం, సూర్యగ్రహణం, మన్వంతరాల ప్రారంభ సమయాలలోగానీ, సూర్యుడు పుష్యమీ నక్షత్రంలో ఉన్నప్పుడు గానీ, బుధుడు రోహిణీ నక్షత్రంలో ఉన్నప్పుడు గానీ,అలాగే శని–రోహిణీలో కుజుడు–అశ్వినిలో, శుక్రుడు–మృగశిరలో, బుధుడు–రేవతిలో, సూర్యుడు–శ్రవణంలో, చంద్రుడు–శ్రవణంలో, బృహస్పతి–హస్తలో ఉన్నప్పుడు అదే విధంగా బుధాష్టమిలో బుధాషాఢలో ఇతర పుణ్యదినాలలో శ్రీహరిని పాలతో లేదా పంచామృతాలతో (పాలు, తేనె, నెయ్యి, పెరుగు, పంచదార)

స్నానం చేయించటం అత్యంత పుణ్యప్రదం. ఆవిధంగా చేసినవారు సకలపాపాలనుంచీ విముక్తులై ఇరవై ఒక్క తరాలు విష్ణులోకంలో నివసించి, తరువాత యోగులకు కూడా దుర్లభమైన మోక్షాన్ని పొందుతారు.

## శివస్నాన ఫలం

కృష్ణపక్ష చతుర్దశీ తిథి మహాశివుడికి అత్యంత ప్రీతిపాత్రమైనది. ఆ రోజు శివుణ్ణి పాలతో అభిషేకిస్తే శివసాయుజ్యం లభిస్తుంది. అష్టమినాడు కానీ, సోమవారం నాడు కానీ కొబ్బరినీళ్ళతో శివలింగానికి లేదా ప్రతిమకి అభిషేకం చేస్తే వారికి శివలోక ప్రాప్తి కలుగుతుంది. శుక్లపక్ష చతుర్దశి, లేక అష్టమినాడు తేనె లేక నేయితో శివాభిషేకం చేస్తే శివసారూప్యం లభిస్తుంది. నువ్వుల నూనెతో శివుణ్ణి లేక శ్రీహరిని అభిషేకిస్తే ఏడు తరాలపాటు శివవిష్ణు సారూప్యం కలుగుతుంది.

చెఱకురసంలో శివుణ్ణి అభిషేకిస్తే ఏడుతరాల వారు ఒక కల్పం పాటు శివలోకంలో నివసిస్తారు. ఉత్థానద్వాదశినాడు పాలతోకానీ, నేయితోకానీ శివాభిషేకం చేసినవాడు కోటి జన్మల్లో చేసిన పాపం నుంచి విముక్తుడై శివలోకాన్ని చేరుకుంటాడు.

## శివ - కేశవ పూజాఫలం

పవిత్రమైన ఏకాదశి తిథినాడు గంధపుష్పాలతో శ్రీహరిని ఆరాధించినవాడు పాపాలనుంచి విముక్తుడై శ్రీవిష్ణు పదాన్ని చేరుకుంటాడు. పద్మాలతో శివుణ్ణి కానీ, శ్రీహరిని కానీ పూజిస్తే కోటి తరాల వారితో విష్ణులోకంలో నివసిస్తారు. శ్రీహరిని మొగలి పూలతో, శంకరుణ్ణి ఉమ్మెత్త పూలతో రాత్రిపూట పూజిస్తే పాపాలు నశించి విష్ణులోకంలో ఒకయుగం నివసిస్తారు. అలాగే సంపెంగపూలతో విష్ణువుని, జిల్లేడు పూలతో శివుణ్ణి పూజించినవాడు శివలోకాన్ని పొందుతాడు. శ్రీహరికి గానీ, శంకరుడికి గానీ, నేతితో సాంబ్రాణీ ధూపంవేస్తే సకల పాపాలూ నశిస్తాయి.

శ్రీమహావిష్ణువుకి లేక మహేశ్వరుడికి నువ్వుల నూనెతో దీపం వెలిగిస్తే సకల కోరికలూ తీరుతాయి. అదే నేతితో దీపం వెలిగిస్తే పాప విమోచనం జరిగి గంగాస్నాన ఫలం లభిస్తుంది. ఏరకమైన నూనెలతో దీపం వెలిగించినా శివకేశవుల అనుగ్రహం లభిస్తుంది. మంచి భోజన పదార్థాలని శివకేశవులలో ఎవరికి నైవేద్యంగా సమర్పించినా వారికి విష్ణులోక, శివలోక ప్రాప్తి కలుగుతుంది.

శివకేశవుల ప్రీత్యర్థం అని సంకల్పించి అత్యంత ప్రీతిపాత్రమైన వస్తువుని యోగ్యుడైన విప్రుడికి దానం చేస్తే పునరావృత్తి రహితమైన వైకుంఠపదం లభిస్తుంది.

## అన్నదానం - జలదానం

అన్నతోయ సమందానం నభూతం నభవిష్యతి ।
అన్నదః ప్రాణదః ప్రోక్తః ప్రాణదశ్చాపి సర్వదః ॥ 1

సర్వదాన ఫలం యస్మాదన్న దస్య నృపోత్తమ ।
అన్నదో బ్రహ్మ సదనం యాతి వంశాయుతాన్వితః ॥ 2

నతస్య పునరావృత్తిరితి శాస్త్రేషు నిశ్చితమ్ ।
సద్యస్తుష్టికరం జ్ఞేయం జలదానంయతోఽధికమ్ ॥ 3

అన్నదానాన్నృపశ్రేష్ఠ నిర్దిష్టం బ్రహ్మ వాదిభిః ।
మహాపాతక యుక్తో వాయుక్తోవా పృపపాతకైః ॥ 4

*(శ్లో॥69-72,అధ్యా-13)*

లోకంలో అన్నదానంతో – జలదానంతో సమానమైన దానం వేరొకటి లేదు. ఇకముందు ఉండబోదు. అన్నదానం ప్రాణదానంతో సమానం కాబట్టి అన్నదానం చేసినవాడు కూడా సకలదానాలనీ చేసిన ఫలితం పొందుతాడు. పరిశుద్ధమైన మనసుతో అన్నదానం చేసినవాడు తన పదివేల తరాలవారితో కలిసి బ్రహ్మలోకానికి చేరుకుంటారు.

జలదానం అన్నదానంకన్నా గొప్పది. ఎందుకంటే అది వెంటనే తృప్తిని కలిగిస్తుంది. జలదానం చేసినవాడు మహాపాతకాలు, ఉపపాతకాలు చేసినప్పటికీ

వాటి నుంచి విముక్తి పొందుతాడు. ఈ విషయాన్ని గురించి సాక్షాత్తు బ్రహ్మ దేవుడే చెప్పాడు.

అన్నదానం జలదానం రెండూ ఎంతో ప్రాధాన్యత కలిగినవే. వీటిలో ఏదానం చేసినా అనంతమైన పుణ్యం లభిస్తుంది. అన్నదాత వంశంలో జన్మించిన వారు వేయి తరాలవరకూ నరకాన్ని చూడరు. కాబట్టి అన్నదానం సర్వ శ్రేష్ఠమైనదిగా గుర్తించాలి.

## వివిధరకాల దానాలు - ఫలితాలు

- ఇంటికి వచ్చిన అతిథికి పాదప్రక్షాళన చేసినవాడు గంగానదితో పాటు అన్ని పుణ్యాతీర్థాలలో స్నానంచేసిన ఫలితం పొందుతాడు.
- బ్రాహ్మణులకి తైలంతో అభ్యంగనం చేయించినవాడు గంగలో నూటెనిమిది సార్లు స్నానం చేసిన ఫలితం పొందుతాడు.
- వ్యాధిగ్రస్తుడైన బ్రాహ్మణుణ్ణి ప్రేమతో కాపాడేవాడికి శ్రీహరి ప్రత్యక్షమై కోరిన కోర్కెలు తీరుస్తాడు.
- రోగంతో బాధపడేవారిని మనసా, వాచా, కర్మణా త్రికరణ శుద్ధిగా రక్షించేవాడు, సేవించేవాడు అన్ని పాపాలనుంచీ విముక్తుడై సుఖజీవితాన్ని అనుభవిస్తాడు.
- యోగ్యుడైన విప్రుడికి గృహదానం చేసినవాడికి శ్రీహరి ప్రసన్నుడై తన దివ్యలోకంలో నివసించే యోగ్యత కల్పిస్తాడు.
- వేదాధ్యయనంచేసే విప్రుడికి పాలిచ్చే ఆవుని దానం చేస్తే దుర్లభమైన బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది.
- వేదాలు చదివిన పండితుడికి కపిల గోవుని దానం చేస్తే సకల పాపాలనుంచీ విముక్తుడై తానే స్వయంగా రుద్రుడవుతాడు.
- వేదపండితుడికి ప్రసవిస్తున్న ఆవుని దానం చేస్తే దాని వల్ల లభించే పుణ్యాన్ని వంద సంవత్సరాలకు కూడా ఎవరూ లెక్కించలేరు.

❖ భయంతో వణుకుతున్న బ్రాహ్మణుణ్ణి రక్షించిన వాడికి సర్వ తీర్థస్నానఫలం, సర్వయజ్ఞ దీక్షాఫలం లభిస్తాయి.

❖ యోగ్యులకి వస్త్రదానం చేసిన వాడికి రుద్రలోకం, కన్యాదానం చేసినవాడికి బ్రహ్మలోకం, బంగారం దానం చేసినవాడికి విష్ణులోకం ప్రాప్తిస్తాయి.

❖ కార్తీక పౌర్ణమినాడు శివుడి ప్రీతికోసం వృషభాన్ని విడిచి పెట్టినవాడు ఏడు జన్మల్లో చేసిన పాపాలనుంచి విముక్తి పొంది రుద్రరూపాన్ని ధరిస్తాడు.

❖ శివలింగం చిహ్నాన్ని వృషభం మీద ముద్రించి దాన్ని విడిచి పెట్టినవాడు యమలోకాన్ని చేరడు (నరకప్రాప్తి కలగదు).

❖ తాంబూలాన్ని దానం చేసిన వాడికి శ్రీహరి ఆయుష్యాన్ని ఆరోగ్యాన్ని ప్రసాదిస్తాడు.

❖ పాలు, పెరుగు, నెయ్యి, నూనెల్ని దానం చేసేవారు పదివేల దివ్య సంవత్సరాలు స్వర్గంలో నివసిస్తారు.

❖ చెఱుకుదానం చేసేవారు బ్రహ్మలోకాన్ని చేరతారు. అదేవిధంగా గంధం, పుణ్యఫలం దానం చేసేవారు కూడా బ్రహ్మలోకాన్ని చేరుకుంటారు.

❖ బెల్లం, చెఱకురసం దానం చేసేవారు క్షీరసముద్రాన్ని అనగా వైకుంఠాన్ని చేరుకుంటారు.

❖ రాజభటులకి నీళ్ళు ఇచ్చిన వారు సూర్యలోకాన్ని పొందుతారు.

❖ విద్యాదానం చేసినవారికి శ్రీహరి సాయుజ్యం లభిస్తుంది.

❖ విద్యాదానం, భూదానం, గోదానం చేసినవారికి విష్ణులోక ప్రాప్తి కలుగుతుంది.

❖ అన్నిదానాలకన్నా విద్యాదానం గొప్పది, విద్యాదానం చేసి శ్రీహరి సాయుజ్యాన్ని పొందవచ్చు.

❖ వంటచెఱుకుని దానం చేస్తే ఉపపాతకాలం నుంచి విముక్తి లభిస్తుంది.

❖ సాలగ్రామ శిలాదానం మహాదానంగా ప్రసిద్ధిచెందింది. ఆ దానాన్ని చేసిన వారు తప్పకుండా మోక్షాన్ని పొందుతారు.

- ❖ లింగదానం మహాపుణ్యప్రదమైనది. ఈ లింగదానం కోటి బ్రహ్మాండాల్ని దానం చేసిన దానికన్నా రెట్టింపు ఫలితాన్నిస్తుంది.
- ❖ సాలగ్రామ శిలారూపంలో ఉండేది శ్రీమహావిష్ణువే. కనుక సాలగ్రామ శిలాదానం గంగాస్నాన ఫలాన్ని కూడా కలిగిస్తుంది.
- ❖ రత్నాలతో కూడిన బంగారం లేదా ఆభరణం మహాదానంగా చెప్పబడింది. కనుక ఆ దానం చేసినవారు భోగమోక్షాల్ని రెండిటినీ పొందుతారు.
- ❖ మాణిక్యదానంతో మోక్షాన్ని, వజ్రాలదానంతో ధ్రువలోకాన్ని, పగడాల దానంతో స్వర్గాన్ని, వాహనాల దానంతో రుద్రలోకాన్ని, ముత్యాలదానంతో చంద్రలోకాన్ని, వైఢూర్యదానంతో రుద్రలోకాన్ని, పుష్యరాగదానంతో ఇహపరాల్లో సుఖాల్ని పొందుతారు.
- ❖ గేదెల్ని దానం చేసినవారు అపమృత్యువుని జయిస్తారు. గోవులకి గడ్డిపెట్టిన వారికి రుద్రలోక ప్రాప్తి కలుగుంది.
- ❖ ఉప్పుదానం చేస్తే వరుణలోక ప్రాప్తికలుగుతుంది.

ఎప్పుడూ సత్కర్మలు చేసేవారు, ఇతరులపై అపవాదులు వేయనివారు, గోవులకీ బ్రాహ్మణులకీ ఎప్పుడూ హితాన్నే చేసేవారు, పరస్త్రీ సంగమాన్ని ఎప్పుడూ కోరనివారు నరకాన్ని చూడరు. ఎప్పుడూ దైవార్చన చేసేవారు, హరినామసంకీర్తన చేసేవారు, దిక్కులేని అనాథబ్రాహ్మణశవానికి దహన సంస్కారాలు జరిపినవారు వేయి అశ్వమేథయాగాలు చేసిన ఫలితాన్ని పొందుతారు. పూజలులేని శివలింగాన్ని పుష్పాలతో పూజించినవాడికి లక్ష అశ్వమేధ యాగాలు చేసిన ఫలం లభిస్తుంది. విష్ణు ఆలయంలో కానీ శివాలయంలో కానీ అఖండదీపం ఉంచినవాడికి ప్రతిక్షణం అశ్వమేధయాగం చేసిన ఫలం లభిస్తుంది.

## ప్రాయశ్చిత్తాలు

★ భోజనంచేస్తూ అపవిత్రుణ్ణికానీ, ఛండాలుణ్ణి కానీ పొరపాటున తాకితే వరుసగా మూడు లేక ఆరురోజులు పంచగవ్యాలతో మూడు వేళల్లో

స్నానంచేస్తే శుద్ధి పొందుతారు. (పంచగవ్యాలు గోమూత్రం, గోమయం, గోక్షీరం, గోదధి(పెరుగు) గోఘృతం (నెయ్యి).

★ విప్రుడు భోజనం చేస్తుండగా మలం స్రవిస్తే ఆ అపవిత్రత తొలిగిపోవటానికి పాదాలు ప్రక్షాళన చేసుకుని, ఆచమనం చేసి, ఒకరోజు ఉపవాసముండి, పంచగవ్యాల్ని సేవించాలి.

★ భోజనం చేస్తున్నప్పుడు పొరపాటున మూత్రస్రావం జరిగినట్లైతే ఒకరోజు ఉపవాసం చేసి నేయితో హోమం చేయాలి.

★ భోజనం చేస్తున్నప్పుడు బ్రాహ్మణుడు అపవిత్రుడైతే చేతిలో ఉన్న ఆహారాన్ని భూమిమీద ఉంచి, స్నానంచేస్తే శుద్ధి పొందుతాడు.

★ భోజనం చేస్తుండగా వాంతి చేసుకున్నవాడు ఆ దోషం పోవటానికి అనారోగ్యంగా వున్నవాడు 300 సార్లు ఆరోగ్యంగా ఉన్నవాడు 3000 సార్లు గాయత్రీ మంత్రాన్ని జపించాలి.

★ రజస్వల అయిన స్త్రీని కానీ, ప్రసవించిన స్త్రీని కానీ చండాలుడు తాకితే మూడు రోజుల తరువాత వారు శుద్ధి పొందుతారు.

★ రజస్వల అయిన స్త్రీని కుక్కలు, కాకులు, లేక కిరాతులు తాకితే నిరాహారంగా ఉండి యథావిధిగా స్నానం చేయాలి. దానితో దోషం తొలగిపోతుంది.

★ రజస్వల అయిన ఇద్దరు స్త్రీలు ఒకర్నొకరు తాకినట్లైతే బ్రహ్మకూర్చం అనే వ్రతం ద్వారా శుద్ధిపొందుతారు.

★ ఋతుకాలం కానప్పుడు స్త్రీ సంగమం జరిపినవాడు పాద ప్రక్షాళన చేసుకుని ఆచమనం చేయాలి.

★ సంభోగం చేస్తున్న సమయంలో స్త్రీ పురుషులిద్దరూ అపవిత్రులవుతారు. ఆ మంచం మీద నుంచి స్త్రీ లేచి పక్కకి వస్తే ఆమె శుద్ధురాలవుతుంది. పురుషుడు మాత్రం అశుచిగానే ఉంటాడు.

★ ఎవరైనా ఉరి వేసుకుని బలవంతంగా మరణిస్తే ఆ మృత శరీరానికి పవిత్ర పదార్థాల్ని లేపనం చేయాలి.

★ ఆత్మహత్య మహాపాపం. ఆత్మహత్య చేసుకోవటానికి కారకులైనవారిని దండించాలి.

★ పొందరాని స్త్రీలని పొందినవారు మద్యపానం, మాంసభక్షణం చేసిన బ్రాహ్మణులు తప్త కృచ్ఛ్రవ్రతాన్ని ఆచరించి లేదా నూనెలోతడిపిన దారాలతో హోమం చేసినట్లైతే పరిశుద్ధులవుతారు.

★ రహస్యంగా పాపాలు చేసినవారు ఒక నెలరోజులు నీళ్ళలో నిలిచి అఘమర్షణ సూక్తం జపిస్తే శుద్ధులవుతారు.

★ రజకులు, చర్మకారులు, నటులు, బురుడులు, కైవర్తులు, మేదులు, భిల్లులు అనేవారు అన్త్యజులు. వీరి అన్నాన్ని తెలిసి తిన్నా తెలియక తిన్నా, వీరి స్త్రీలతో రమించినా, నీరు త్రాగినా వారినుంచి దానం స్వీకరించినా అర్ధకృచ్ఛ్రవ్రతాన్ని ప్రాయశ్చిత్తంగా ఆచరించాలి.

★ తల్లిని, పుత్రికని, చెల్లిని, కోడలిని సంగమిస్తే అగ్నిప్రవేశం తప్ప మరో ప్రాయశ్చిత్తం లేదు.

★ సమానగోత్రం కలిగిన స్త్రీతో సంగమించినవాడికి రెండు కృచ్ఛ్రవ్రతాలు ప్రాయశ్చిత్తంగా చెప్పబడ్డాయి.

★ వేశ్యాగమనం చేసిన బ్రాహ్మణుడు అర్ధకృచ్ఛ్రవ్రతం చేస్తే పరిశుద్ధుడవుతాడు.

## వివిధ రకాల నరకాలు

భూలోకంలో వివిధ రకాల పాపాలు చేసిన వారిని శిక్షించటానికి యమలోకంలో వివిధ రకాల నరకాలు ఏర్పర్చబడ్డాయి. అవి-తపన, వాలుకా, కుంభ, మహారౌరరవ, రౌరవ, కుంభీపాక, నిరుచ్ఛ్వాసస, కాలసూత్ర, ప్రమర్ధన, అసిపత్రవన, లాలాభక్షణి, హిమోత్కట, మూషావస్థ, వసామాపం, వైతరణీ నది, మూత్రాపాన, పురీషహ్రద, తప్తశూల, తప్తశూల, శాల్మలీద్రుమ, శోణితకూప, శోణిత భోజన, శ్వ మాంస భోజన, వహ్నిజ్వాలానివేశన, శిలావృష్టి, శస్త్రవృష్టి, క్షారోదకం, ఉష్ణతోయం, తప్త అయఃపిండభక్షణం, శిరశ్శోషణం, మరుత్ప్రపతనం అనేవి. అధే విధంగా-

పాషాణవర్షం, క్రిమిభోజనం, క్షారోదకపానం, భ్రమణం, క్రకచధారణం, పురీషలేపనం, రేతఃపానం, సర్వసంధి, ధూమపానం, పాశబంధం, నానాశూలాను లేపనం, అంగారశయనం, ముసలమర్ధనం, ఛేదనం, పతనోత్పతనం, గదాదండాదిపీడనం, గజదంత ప్రహరణం, నానా సర్పదంశనం, లవణభక్షణం, స్నాయుఛేదనం, అస్థిఛేదనం, మాంసభోజనం, పిత్తపానం, శ్లేష్మభోజనం, వృక్షాగ్రపతనం, జలాన్తర్మజ్జనం, పాషాణధారాశయనం, కంటక శయనం, పిపీలికాదంశనం, వృశ్చికపీడనం, వ్యాఘ్రపీడనం, మహిషపీడనం, కర్దమశయనం, అత్యుష్ణతైలపానం, మహాకటునిషేవనం, కషాయోదకపానం, అయోభారబంధనం, అత్యుష్ణశీతస్నానం, దుర్గంధ పరిపూరణంలాంటి నరకాలు ఎన్నో ఉన్నాయి.

## పాపాలు

బ్రహ్మ హత్య చేసినవారు, సురాపానం చేసేవారు, చౌర్యం చేసేవారు, గురుపత్నీ గమనంచేసేవారు – ఈ నలుగుర్నీ 'మహాపాతకులు' అని అంటారు. వీరందరితో సంబంధం కలిగిన వాణ్ణి అయిదో మహాపాతకి అంటారు.

భోజనం చేస్తున్న పంక్తిలో అందరికీ ఒకే విధంగా వడ్డించకుండా భేదం చూపేవారు, భగవంతుడికి నివేదనచేయకుండా భుజించేవారు, ఎప్పుడూ బ్రాహ్మణుల్ని దూషించేవారు, కఠినంగా ఆదేశాలిచ్చేవారు, వేదాల్ని విక్రయించేవారు – ఈ అయిదుగురినీ 'బ్రహ్మఘాతకులు' అంటారు. ఎక్కువ ధనాన్ని దక్షిణగా ఇస్తానని చెప్పి తీసుకెళ్ళి అతడికి తక్కువ ధనాన్ని ఇచ్చి పంపినవాడు, స్నానం చేయటానికి, పూజ చేయటానికి వెళ్ళే బ్రాహ్మణుడికి విఘ్నాలు కల్పించేవాడు, పరుల్ని నిందించి తనని పొగడుకునేవాడు, అసత్యాన్ని పలకటంలో ఆనందం పొందేవాడు, ఇతరుల్ని బాధించేవాడు, అధర్మాన్ని ఆమోదించేవాడు కూడా బ్రహ్మ ఘాతకుడే అని చెప్పబడతాడు.

**సురాపానంతో సమానమైన పాపాలు :** వేశ్యల దగ్గర ఆహారాన్ని భుజంచటం, వేశ్యల్ని సేవించటం, పతితుల అన్నాన్ని తినటం, చేస్తున్న ఉపాసన వదిలేయటం, స్త్రీలతో సంగమించటం, శూద్రుడి ఇంట్లో భోజనం చేయటం, శూద్రుడికి సేవలు చేయటం ఇవన్నీ సురాపానంతో సమానమైన పాపాలు.

**బంగారం చౌర్యంచేయటంతో సమానమైన పాపాలు :** కందమూల ఫలాల్ని కస్తూరివంటి సుగంధ ద్రవ్యాలని, రత్నాల్ని అపహరించటం, రాగి, ఇనుము, సీసం, ఇత్తడి, నెయ్యి, తేనె, సుగంధద్రవ్యాలు, పట్టువస్త్రాలు అపహరించటం, వక్కల్ని, నీళ్ళని, చందనాన్ని, ఆకులరసాల్ని దొంగిలించటం, పితృయజ్ఞాన్ని విడిచిపెట్టటం, ధర్మకార్యాల్ని లోపింపచేయటం, యతుల్ని నిందించటం, తినే పదార్థాలని, ధాన్యాలని, రుద్రాక్షల్ని దొంగిలించటం, తోబుట్టువుల్ని, కోడలిని సంగమించటం, అన్న భార్య, మిత్రుడి భార్యని కలవటం, విధవాగమనం ఇవన్నీ బంగారం చౌర్యం చేసిన పాపాలతో సమానమైన పాపాలు. అంతేకాదు ఇవి మహాపాపాలు కూడా.

## పాపాలు - శిక్షలు

★ చోరులకి సహకరించినవానితో నరకంలో వేయియుగాల పాటు బాగా కాల్చిన ఉక్కు ముద్దల్ని తినిపిస్తారు. బాగా కాల్చిన ఇనుప పట్టకారుతో నాలుకని పీకుతారు.

★ పరస్త్రీ గమనం చేసిన వారిని బాగా కాల్చబడ్డ రాగి శరీరం కల స్త్రీలు (లోహస్త్రీలు) ఇది వరకు వీరు సంగమించిన స్త్రీల రూపంలో వచ్చి పాపితో బలవంతంగా సంగమిస్తారు.

★ భర్తను వదిలి పరపురుషుడితో రమించిన స్త్రీలని నరకంలో బాగా కాల్చబడ్డ ఉక్కు శరీరం గల పురుషులు, బాగా కాల్చిన ఉక్కు మంచం మీద పడేసి చాలాకాలం ఆ పతితలతో రమిస్తారు.

★ బ్రాహ్మణుల ఆవుని, ఉత్తముడైన క్షత్రియుణ్ణి చంపినవారు అయిదు కల్పాల పాటు నరకంలో వివిధ రకాల శిక్షలను భవిస్తారు.

★ మహాత్ములపై చేసే నిందల్ని ఆదరించిన, విన్నవారి చెవుల్లో బాగా కాల్చిన ఇనుపరేకుల్ని నాటతారు. ఆ తరువాత ఆ కర్ణ రంధ్రాల్లో సలసలా కాగే నూనెని పోస్తారు.

★ శ్రీహరిమీద, శంకరుడి మీద భక్తిలేని నాస్తికులచేత కోటి సంవత్సరాల పాటు కేవలం ఉప్పునే తినిపిస్తారు. తరువాత బాగా కాలిన ఇసుక నరకంలో ఒక కల్పకాలం యమయాతనలకి గురిచేస్తారు.

★ బ్రాహ్మణుల్ని క్రోధంతో దండించిన వారిని కాల్చిన సూదుల్తో కళ్ళల్లో పొడుస్తారు. తరువాత కారం నీళ్ళ ధారల్లో తడుపుతారు.

★ విశ్వాస ఘాతకులు, మర్యాదని భంగపరిచేవారు, ఇతరుల అన్నాన్ని ఆశించేవారు నరకంలో తమ మాంసాన్ని తామే భుజిస్తూ, కుక్కలచేత భుజించబడుతూ ఒక్కో నరకంలో ఒక్కో సంవత్సరం యాతనలనుభవిస్తారు.

★ దేవ, పితృ, బ్రహ్మయజ్ఞాల్ని విడిచిపెట్టినవారు లాలాభక్షణం అనే నరకాన్ని పొందుతారు.

★ ఉపాసన వదిలివేసిన వారు రౌరవ నరకాన్ని పొందుతారు.

★ బ్రాహ్మణుల నుంచి బలవంతంగా పన్నులు వసూలు చేసినవారు సూర్య చంద్రులున్నంత వరకూ నరకంలో యమయాతనలనుభవిస్తారు.

★ శూద్రాది స్త్రీలతో సంగమించినవాడు మహాపాపి. వాడికి నరకంలో రేతో భోజనం పెడతారు.

★ అబద్ధపు సాక్ష్యాలు చెప్పేవారు ఒక కల్పంపాటు నరకయాతనలు అనుభవిస్తారు.

★ అతికాముకులు, అబద్ధాలు చెప్పేవారు నరకాన్ని చేరుకున్నా వారినోట్లో పాముల్లాంటి జలగల్ని నింపుతారు.

★ ఋతుకాలంలో భార్యతో సంగమించినవారు ఘోరమైన రౌరవ నరకంలో పడతారు. అంతేకాదు బ్రహ్మహత్యా పాపాన్ని కూడా పొందుతారు.

★ ఏదైనా ఒక వ్రతాన్ని ప్రారంభించి దాన్ని పూర్తి చేయకుండా వదిలిపెట్టిన వారు అసిపత్రమనే నరకంలో యమయాతనలనుభవిస్తారు. ఆ తరువాత వారు భూలోకంలో తిరిగి వికలాంగులుగా జన్మిస్తారు.

★ ఇతరులు చేసే పూజలకి, వ్రతాలకి విఘ్నాలు కలిగించేవారు భయంకరమైన శ్లేష్మ భోజనమనే నరకంలో పడతారు.

★ తినకూడని వాటిని తినేవారు మలభోజ్యం అనే నరకాన్ని పొంది తిరిగి చండాలుడిగా జన్మనెత్తుతారు.

★ యతుల్ని నిందించేవారు శిలామాత్రం అనే నరకాన్ని పొందుతారు

★ ఉద్యానవనాల్ని ధ్వంసంచేసేవారు ఇరవై ఒక్కయుగాలు శ్వ(కుక్క) భోజనం అనే నరకం శిక్షలనుభవిస్తారు.

★ పూలతోటల్ని ధ్వంసం చేసేవారు నరకంలో ఇరవై ఒక్క కల్పాలు వివిధరకాల యాతనలనుభవించి, మలంలో క్రిములుగా జన్మిస్తారు.

ఈ విధంగా ఎన్నో రకాల పాపాలకి ఎన్నో రకాల శిక్షలు నరకంలో విధించబడతాయి. ఈ పాపాలన్నిటికీ శాస్త్రంలో చెప్పిన విధంగా ప్రాయశ్చిత్తాన్ని చేసుకుంటే పాపం తొలగిపోతుంది. అయితే ఈ ప్రాయశ్చిత్తాల్ని సకల పాప వినాశకుడైన శ్రీహరి సన్నిధిలోనే ఆచరించాలి.

## భగీరథుడు - గంగానదిని తేవటం

పూర్వం భగీరథ చక్రవర్తి కపిలమహర్షిచేత దగ్ధం కాబడ్డ తన పూర్వీకులందరికీ మోక్షం కల్పించాలని నిర్ణయించుకున్నాడు. అందుకు తపస్సు ఒక్కటే మార్గమని గ్రహించి హిమాలయాలకి బయలుదేరాడు. దారిలో గోదావరీ తీరంలో మహాతపోధనుడైన భృగుమహర్షి ఆశ్రమం అతడికి కనిపించింది. భగీరథుడు ఆశ్రమం లోపలికి వెళ్ళి భృగుమహర్షి పాదాలకి భక్తిగా నమస్కరించాడు. ఆయనతో మహర్షీ! శ్రీవారి దివ్యానుగ్రహం ఎలా పొందాలి! నారాయణుడు సంతోషించే విధానం ఏది? దయచేసి నాకు తెలియచెప్పు అని ప్రార్థించాడు భగీరథుడు

భగీరథుడి ప్రార్థన విన్న భృగుమహర్షి ఎంతో ప్రేమతో "రాజా! నీ సంకల్పం చాలా గొప్పది. నీవు ఎంతో గొప్ప మనసున్న వాడివి కాబట్టే నీ పూర్వీకులందర్నీ ఉద్ధరించాలనుకున్నావు. నీవెప్పుడూ సత్యాన్నే పలుకు, ధర్మాన్నే ఆచరించు, నిరంతరం సనాతనుడైన శ్రీహరినే స్మరించు, ఆయన్ని పూజిస్తేనే నీకు పరమ శాంతి లభిస్తుంది. శ్రీమన్నారాయణుడి ద్వాదశాక్షర మహామంత్రాన్ని గానీ, అష్టాక్షరీ మహామంత్రాన్నిగానీ జపించు. నీకు శుభం కలుగుతుంది" అని ప్రబోధించాడు.

భృగుమహర్షి ద్వారా ప్రబోధించబడ్డ భగీరథుడు ఆనందంగా హిమవత్పర్వతానికి చేరుకున్నాడు. అక్కడ సుందరమైన నాదేశ్వరం అనే క్షేత్రం దగ్గర ఆశ్రమాన్ని నిర్మించుకుని, నిత్యం కందమూలాల్ని మాత్రమే భుజిస్తూ, మూడు కాలాల్లో శ్రీహరిని పూజిస్తూ దీక్షగా శ్రీహరి గురించి తపస్సు చేసాడు. పరమధార్మికుడైన భగీరథుడు క్రమక్రమంగా కఠిన నియమాల్ని పాటిస్తూ తన తపస్సుని తీవ్రతరం చేసాడు. భయంకరంగా కొనసాగుతున్న ఆయన తపస్సు వేడి ముల్లోకాల్నీ తపింపచేయటం ప్రారంభించింది. ఆ వేడిని తట్టుకోలేక దేవతలందరూ భయపడి వెంటనే క్షీరసముద్రంలో శయినించిన శ్రీహరి దగ్గరకి పరుగెత్తారు. దేవదేవుడైన శ్రీహరి శరణు వేడుకుంటూ ఇలా స్తుతించారు.

## దేవతలు చేసిన శ్రీహరి స్తుతి

నతాః స్మ విష్ణుం జగదేకనాథం స్మరత్సమస్తార్తి హరం పరేశమ్
స్వభావశుద్ధం పరిపూర్ణభావం వదన్తి యం జ్ఞానమనుం చ తద్‌జ్ఞాః ॥ 1
ధ్యేయస్సధా యోగినరైర్మహాత్మా స్వేచ్ఛాశరీరైః కృతదేవకార్యః
జగత్స్వరూపో జగదాదినాథస్త స్మైనతాస్స్మః పురుషోత్తమాయ ॥ 2
యన్నామ సంకీర్తనతో ఖలానాం సమస్తపాపాని లయం ప్రయాన్తి
తమీశమీడ్యం పురుషం పురాణం నతాస్స్మ విష్ణుం పురుషార్థ సిద్ధ్యై ॥ 3
యత్తేజసా భాన్తి దివాకరాద్యా నాతిక్రమన్త్యప్స కదాపి శిక్షాః
కాలాత్మకం తం త్రిదశాధినాథం నమామహే వై పురుషార్థరూపమ్ ॥ 4
జగత్కరోత్యబ్జభవోఽత్తి రుద్రః పునాతి లోకాన్ శ్రుతిభిశ్చ విప్రాః
తమాదిదేవం గుణసన్నిధానం సర్వోపదేష్టారమితాః శరణ్యమ్ ॥ 5
వరం వరేణ్యం మధుకైటభారిం సురాసురాభ్యర్చితపాద పీఠమ్
సద్భక్తి సంకల్పిత సిద్ధి హేతుం జ్ఞానైకవేద్యం ప్రణతాస్స్మ దేవమ్ ॥ 6
అనాది మధ్యాన్తమజం పరేశమనాద్యవిద్యాఖ్యతమోవినాశమ్
సచ్చిత్పరానన్దఘనస్వరూపం రూపాదిహీనం ప్రణతాస్స్మ దేవమ్ ॥ 7
నారాయణం విష్ణుమనన్తమీశం పీతామ్బరం పద్మభవాని సేవ్యం
యజ్ఞప్రియం యజ్ఞకరం విశుద్ధం నతాస్స్మ సర్వోత్తమమవ్యయం తమ్ ॥ 8

*(శ్లో॥54-61,అధ్యా-16,పూ.భా)*

జగదేకనాథుడు, పరేశుడు, స్మరించేవారి ఆర్తిని నాశనం చేసేవాడు, సహజంగానే పరిశుద్ధమైనవాడు అయిన శ్రీమహావిష్ణువుకి నమస్కరిస్తున్నాము. సర్వోత్తముడు, అవ్యయుడు, సర్వత్రా వ్యాపించినవాడు అయిన శ్రీమన్నారాయణుడికి నమస్కరిస్తున్నాము.

ఈవిధంగా ఇంద్రాది దేవతల చేత స్తుతించబడ్డ శ్రీహరి దేవతలకి అభయమిచ్చి అక్కణ్ణుంచి సరాసరి భగీరథుడు తపస్సు చేస్తున్న ప్రదేశానికి వెళ్ళాడు. శంఖచక్ర గదాయుధాల్ని ధరించి సచ్చిదానంద స్వరూపంతో భగీరథుడికి దర్శనమిచ్చాడు. జగన్మోహనుడైన శ్రీహరి దివ్య స్వరూపాన్ని చూడగానే భగీరథుడి శరీరం ఆనందంతో కంపించింది. రోమాలు నిక్కబొడుచుకున్నాయి. కళ్ళవెంట ఆనందబాష్పాలు ధారాపాతంగా కారిపోతున్నాయి. మాటలు తడబడుతుండగా శ్రీహరీ, కృష్ణా! కృష్ణా!కృష్ణా! శ్రీకృష్ణా! పాహిమాం! రక్షమాం అని ప్రార్థించాడు. వెంటనే తాను తపస్సుచేస్తున్న కారణాన్ని శ్రీహరికి చెప్పాడు.

భగీరథుడి సంకల్పాన్ని విన్న శ్రీహరి అతణ్ణి, అతడి తపోదీక్షని మెచ్చుకుని "భగీరథా! నీ కోరిక నెరవేరుతుంది. నీ పితామహులందరూ నీవల్ల తరించి నా దివ్యలోకానికి చేరుకుంటారు. అయితే నీ కోరిక నెరవేరాలంటే నాకు మరో రూపంగా వున్న శంకరుడి అనుగ్రహాన్ని కూడా నీవు పొందాలి. అందుకని వెంటనే భక్తి ప్రపత్తులతో ఆ దేవదేవుణ్ణి ప్రార్థించు. శరణుకోరిన వారి కోరికలు తీర్చే మహానుభావుడు శంకరుడు. నీకు మేలు జరుగుగాక! "అని పలికి అంతర్ధానమయ్యాడు" శ్రీహరి. భగీరథుడికి ఎంతో ఆనందం కలిగింది. తన కోరిక తీరబోతున్నందుకు, తన సంకల్పం నెరవేరుతున్నందుకు. వెంటనే శ్రీహరి చెప్పిన విధంగా నిశ్చలమైన భక్తితో త్రికరణ శుద్ధిగా భక్తవత్సలుడైన శంకరుణ్ణి ఇలా స్తుతించటం ప్రారంభించాడు.

## భగీరథుడు చేసిన శంకరస్తుతి

ప్రణమామి జగన్నాథం ప్రణతార్తి ప్రణాశనమ్
ప్రమాణాగోచరం దేవమీశానం ప్రణవాత్మకమ్ ॥ 1

జగద్రూపమజం నిత్యం సర్గస్థిత్యంతకారణమ్
విశ్వరూపం విరూపాక్షం ప్రణతోఽస్మ్యూర్ధ్వరేతసమ్ ॥ 2
ఆదిమధ్యాంతర హితమనన్తమజమవ్యయమ్
సమామనన్తి యోగీన్ద్రాస్తం వన్దే పుష్టివర్ధనమ్ ॥ 3
నమో లోకాధినాథాయ వంచతే పరివంచతే
నమోఽస్తు నీలగ్రీవాయ పశూనాం పతయే నమః ॥ 4
నమశ్చైతన్యరూపాయ పుష్టానాం పతయే నమః నమః
కల్పప్రకల్పాయ భూతానాం పతయే నమః ॥ 5
నమః పినాకహస్తాయ శూలహస్తాయ తే నమః
నమః కపాలహస్తాయ పాశముద్గరధారిణే ॥ 6
నమస్తే సర్వభూతాయ ఘంటహస్తాయ తే నమః
నమః పంచాస్యదేవాయ క్షేత్రాణాం పతయే నమః ॥ 7
నమస్సమస్త భూతానామాదిభూతాయ భూభృతే
అనేకరూపరూపాయ సద్గుణాయ పరాత్మనే ॥ 8
నమో గణాధిదేవాయ గణానాం పతయే నమః
నమో హిరణ్యగర్భాయ హిరణ్యపతయే నమః ॥ 9
హిరణ్య రేతసే తుభ్యం నమో హిరణ్యపతయే నమః
నమో ధ్యానస్వరూపాయ నమస్తే ధ్యానసాక్షిణే ॥ 10
నమస్తే ధ్యానసంస్థాయ ధ్యానగమ్యాయ తే నమః
యేనేదం విశ్వమఖిలం చరాచరవిరాజితమ్ ॥ 11
వర్షే వాభ్రేణ జనితం ప్రధానపురుషాత్మనా
స్వప్రకాశం మహాత్మానం పరంజ్యోతి స్సనాతనమ్ ॥ 12
యమామనన్తి తత్త్వజ్ఞా స్సవితారం నృచక్షుషామ్
ఉమాకాన్తం నందికేశం నీలకంఠం సదాశివమ్ ॥ 13
మృత్యుంజయం మహాదేవం పరాత్పరతరం విభుమ్
పరం శబ్ద బ్రహ్మరూపం తల వన్దేఽఖిలకారణమ్ ॥ 14

కపర్దినే నమస్తుభ్యం సద్యోజాతాయ వై నమః
భవోద్భవాయ శుద్ధాయ జ్యేష్ఠాయ చ కనీయ సే ॥ 15
మన్యవే త ఇషే త్రయ్యాః పతయే యజ్ఞతన్తవే
ఊర్జే దిశాం చ పతయే కాలాయ ఘోరరూపిణే ॥ 16
కృశానురేతసే తుభ్యం నమోஉస్తు సుమహాత్మనే యతస్స
ముద్రాస్సరితో உద్రయశ్చ గంధర్వయక్షాసుర సిద్ధసంఘాః
స్థాణుశ్చరిష్ణుర్మహదల్పకం చ ఆసచ్చ సజ్జీవమజీవమాస ॥ 17
నతో உస్మి తం యోగినతాంఘ్రిపద్మం సర్వాన్తరాత్మనమ
రూపమీశమ్ స్వతంత్రమేకం గుణినాం గుణం చ
నమామి భూయః ప్రణమామి భూయః ॥ 18

*(శ్లో॥78-96,అధ్యా-16,పూ.భా)*

జగన్నాథుడు, నమస్కరించిన వారి బాధల్ని నశింప చేసేవాడు, ప్రమాణాలకి కనిపించనివాడు, ప్రణవస్వరూపుడు అయిన ఈశ్వరుడికి నమస్కరిస్తున్నాను. సర్వాంతర్యామికి, రూపరహితుడికి, స్వతంత్రంగా వుండేవాడికి, గుణస్వరూపుడికి, ఈశ్వరుడికి మాటిమాటికీ నమస్కరిస్తున్నాను.

ఈ విధంగా భగీరథుడు చేసిన దివ్యస్తుతికి ఎంతో సంతోషించిన శంకరుడు వెంటనే అతడికి ప్రత్యక్షమయ్యాడు. పంచవక్త్రుడు, దశభుజుడు, త్రినేత్రుడు, నాగయజ్ఞోపవీతుడు, విశాలాక్షుడు, గజచర్మాంబరధారి అయిన శంకరుణ్ణి చూసి వెంటనే ఆయన పాదాల మీద పడ్డాడు భగీరథుడు. శంకరుడు చిరునవ్వులు చిందిస్తూ "భగీరథా! నీకేం కావాలో కోరుకో" అని ప్రసన్నంగా పలికాడు. భగీరథుడు వినయంగా" స్వామీ! దయామయా! మా పితామహులు మోక్షం పొందటానికి నాకు గంగని అనుగ్రహించు"అని కోరాడు.

"భగీరథా! నీ దీక్ష ఎంతో గొప్పది. నీవు కోరినట్టే నీకు గంగని అనుగ్రహిస్తున్నాను. అంతేకాదు నీ భక్తికి మెచ్చి మోక్షాన్ని కూడా ప్రసాదిస్తున్నాను" అని వరాలిచ్చి శంకరుడు అదృశ్యమయ్యాడు.

శివుడి వరాన్ని అనుసరించి ఆయన జటాజూటం నుంచి జారిన గంగ భగీరథుణ్ణి అనుసరిస్తూ వెళ్ళింది. ఆనాటి నుంచి లోకుల పాపాల్ని తొలగించే గంగ భగీరథుడి కారణంగా ఉద్భవించింది కాబట్టి 'భాగీరథీ' అని ప్రసిద్ధి చెందింది. భగీరథుడి వెంట ప్రవహించిన గంగ సగర పుత్రుల భస్మరాసుల్ని ముంచెత్తింది. దానితో వారంతా తమ తమ పాపాల్ని పోగొట్టుకుని నరకంనుంచి ఉద్ధరించబడ్డారు.

ఆ విధంగా యమయాతనల నుంచి విముక్తులైన సగరపుత్రులతో యమధర్మరాజు "రాజపుత్రులారా! గంగానది స్పర్శతో మీరు చేసిన పాపాలన్నీ నశించి పోయాయి. ఇక మీకికక్కడ ఉండాల్సిన పనిలేదు. ఇదిగో ఈ దివ్య విమానాన్ని అధిరోహించి విష్ణులోకానికి వెళ్ళండి" అని చెప్పి సాదరంగా వారిని సాగనంపాడు. పాపాలు తొలగిన సగరపుత్రులు దివ్యదేహాలు ధరించి దివ్యవిమానాలు అధిరోహించి ఆనందంగా వైకుంఠధామానికి చేరుకున్నారు.

విష్ణుపాదాల నుంచి పుట్టిన గంగ ఆనాటి నుంచి అన్ని లోకాలలో మహాపాతక నాశినిగా పేరుపొందింది. మహాపాపాల్ని నశింపచేసే ఈ దివ్య కథని చదివినా, విన్నా గంగాస్నానం చేసిన ఫలం లభిస్తుంది.

## ద్వాదశ (12) ద్వాదశీవ్రతాలు

జగన్నాథుడైన శ్రీమన్నారాయణుడికి అత్యంత ప్రీతిపాత్రమైన తిథి ద్వాదశి. ప్రతిమాసంలో వచ్చే శుక్లపక్షద్వాదశినాడు శ్రీహరి వ్రతాన్ని ఆచరిస్తే ఐహికాముష్మిక ఫలాలు లభిస్తాయి. శ్రీహరి పూజ, సేవ సకలశుభదాయకం.

**1.మార్గశీర్ష శుక్లద్వాదశి :** పవిత్రమైన ఈరోజు ఉపవాస దీక్షవహించాలి. ఉదయాన్నే కాల కృత్యాలు ముగించి స్నానసంధ్యలు ఆచరించి తెల్లటి వస్త్రాలు ధరించాలి. పూజామందిరంలో శ్రీహరి ప్రతిమని స్థాపించి, గంధపుష్పాక్షత ధూపదీపనైవేద్యాల్ని సమర్పించి షోడశోపచారపూజ చేయాలి. "ఓం కేశవాయ నమః, అంటూ శ్రీహరి పూజచేసిన తరువాత నారాయణ అష్టాక్షరి లేక ద్వాదశాక్షరీ మంత్రంతో స్వాహాకారాన్ని చేర్చి, నెయ్యి నువ్వులతో 108 సార్లు

హోమం చేయాలి. ఇక ఆరోజు రాత్రి సాలగ్రామం లేదా పూజచేసిన శ్రీహరి ప్రతిమ సన్నిధిలో రాత్రంతా జాగరణ చేయాలి.

ద్వాదశినాడు ఒక శేరు పాలతో నారాయణ ప్రతిమకి స్నానం చేయించాలి. మూడు పూటలా షోడశోపచార పూజచేసి నైవేద్యాలు యథాశక్తి సమర్పించాలి. పూజానంతరం నేతితో వండిన పాయసాన్ని కొబ్బరికాయ దక్షిణతో పాటు "కేశవః కేశిహా దేవస్సర్వ సంపత్ప్రదాయకః పరమాన్న ప్రదానేన మహస్యాదిష్టదాయకః" (సకల సంపదల్ని ప్రసాదించేవాడు కేశి అనే అసురుణ్ణి సంహరించినవాడు, కేశవుడు అని పిలువబడే వాడు నేను చేసే పరమాన్న దానంతో సంప్రీతుడై, నా ఇష్టాల్ని నెరవేర్చుగాక!) అని చెప్పి బ్రాహ్మణుడికి భక్తితో నమస్కరించాలి. ఆ తరువాత వచ్చిన బంధువులకి, బ్రాహ్మణులకి సమృద్ధిగా భోజనం పెట్టించి, వారి ఆశీర్వచనాల్ని స్వీకరించాలి. అందరూ తిన్న తరువాత నియమంగా తాను భోజనం చేయాలి. ఈ విధంగా ఉత్తమమైన కేశవార్చన చేసినవాడు పౌండరీక యజ్ఞం చేసినదాని కన్నా ఎనిమిది రెట్లు అధికమైన ఫలాన్ని పొందుతాడు.

**2. పుష్యశుద్ధ ద్వాదశి :** పరమపవిత్రమైన ఈ రోజు చక్కగా ఉపవాస దీక్ష వహించాలి. మనోనిగ్రహంతో నారాయణ మంత్రాన్ని 'ఓం నమో నారాయణాయ' పఠిస్తూ శ్రీహరిని పూజించాలి. స్వామి ప్రతిమకి పాలతో అభిషేకంచేసి పాయసాన్ని నైవేద్యంగా సమర్పించాలి. మూడుకాలాల్లో స్వామిని యథావిధిగా అర్చించి ఆ రోజు రాత్రి జాగరణ చేయాలి. పూజచేసేడప్పుడు గీత వాద్యాలతో స్తోత్రాలతో శ్రీహరికి ఆనందాన్ని కలిగించాలి.

వ్రతంలో భాగంగా నేతితో నువ్వులతో చేసిన పొంగలిని దక్షిణతో సహా బ్రాహ్మణుడికి దానం ఇస్తూ "సర్వాత్మా సర్వలోకేశః, సర్వవ్యాపీ సనాతనః, నారాయణః ప్రసన్నస్యాత్ కృతశరాన్న ప్రదానతః" అనే మంత్రాన్ని పఠించాలి. ఆ తరువాత వ్రతానికి విచ్చేసిన బ్రాహ్మణులకి, బంధువులకీ భోజనం పెట్టి ఆ తరువాత నియమంగా తాను భుజించాలి. ఈ విధంగా శ్రీమన్నారాయణుణ్ణి పూజించినవాడు ఎనిమిది అగ్నిష్టోమయజ్ఞాలు చేసిన ఫలాన్ని పొందుతాడు.

**3. మాఘశుద్ధ ద్వాదశి :** ఈ తిథినాడు ఉపవాసం ఉండి, "నమస్తే మాధవాయ స్వాహా" అనే మంత్రాన్ని పఠిస్తూ ఎనిమిదిసార్లు నేతిలో అగ్నికి ఆహుతులివ్వాలి. తరువాత ఒక శేరు పాలతో శ్రీహరి ప్రతిమని అభిషేకించాలి. త్రికరణశుద్ధిగా శ్రీహరిని షోడశోపచారాలతో అర్చించి ఆ రాత్రంతా జాగరణ చేయాలి. మర్నాడు ఉదయం తిరిగి మాధవుణ్ణి యథావిధిగా పూజించి ఒక శేరు నువ్వుల్ని దక్షిణతో సహా తీసుకుని "మాధవస్సర్వ భూతాత్మా సర్వ కర్మ ఫలప్రదః తిలదానేన మహతాసర్వాన్ మామాన్ ప్రయచ్ఛతు" (సకల ప్రాణస్వరూపుడు, సర్వకర్మల ఫలితాలనిచ్చేవాడు అయిన మాధవుడు నేను చేసిన ఈ తిలదానంతో సంతృప్తుడైనా కోరికల్ని తీర్చుగాక.) అని చెప్పి యోగ్యుడైన విప్రుడికి దానం చెయ్యాలి. నువ్వులతో పాటు నూతన వస్త్రాల్ని కూడా ఇవ్వాలి.

ఈ విధంగా దానంచేసిన తరువాత మాధవుణ్ణి స్మరిస్తూ ముందుగా విప్రులకి భోజనం పెట్టించి, ఆ తరువాత బంధువులతో కలిసి తాను నియమంగా భోజనం చేయాలి. ఇలా తిలదాన వ్రతాన్ని శ్రద్ధాభక్తులతో ఆచరించినవారు వంద వాజపేయయాగాలు చేసిన ఫలాన్ని పొందుతారు.

**4. ఫాల్గుణశుద్ధ ద్వాదశి :** పరమ పవిత్రమైన ఈ రోజు ఉపవాసదీక్షని వహించి "గోవిందాయ నమస్తుభ్యం" అనే మంత్రాన్ని పఠిస్తూ, నేతిలో కలిపిన నువ్వులతో 108 ఆహుతుల్ని శ్రీహరికి సమర్పించాలి. ఆ తరువాత ఒక శేరు పాలతో నారాయణ ప్రతిమకి స్నానం చేయించి మూడు కాలాల్లో స్వామిని షోడశోపచారాలతో పూజించాలి. ఆ రాత్రి మొత్తం శ్రీహరి సన్నిధిలో జాగరణచేసి మర్నాడు ఉదయం కూడా యథావిధిగా గోవిందుడికి షోడశోపచార పూజ చేయాలి. తరువాత నూతన వస్త్రాలు దక్షిణతోపాటు నాలుగు శేర్ల ధాన్యాన్ని యోగ్యుడైన విప్రుడికి దానమివ్వాలి. దానం ఇచ్చేడప్పుడు "నమో గోవింద సర్వేశ గోపికాజన వల్లభ అనేన ధాన్యదానేన ప్రీతోభవ జగద్గురో" (ఓ గోవిందా! గోపీజన వల్లభా! ఓ జగద్గురూ! నీకు నమస్కారం. నేను చేసిన ఈ ధాన్య దానం వల్ల నీవు సంప్రీతుడవై నా అభీష్టాల్ని నెరవేర్చు) అనే మంత్రాన్ని పఠించాలి. ఈ విధంగా శ్రద్ధా భక్తులతో శ్రీహరిని సేవించినవాడు సంపూర్ణంగా గోమేధ యాగాల్ని చేసిన ఫలితాన్ని పొందుతాడు.

**5. చైత్రశుద్ధ ద్వాదశి :** ఇది నారాయణుడికి ప్రీతికరమైన రోజు. ఈ తిథినాడు ఉపవాస దీక్ష వహించాలి". నమోస్తు విష్ణవేతుభ్యం" అని శ్రీహరికి 108 ఆహుతుల్ని నేయితో సమర్పించాలి. ఆ తరువాత ఒక శేరు పాలతో స్వామివారి ప్రతిమకి అభిషేకం చేయాలి. మూడు పూటలా షోడశోపచారాలతో శ్రీహరిని అర్చించి, ఆ రాత్రి స్వామి సన్నిధిలో జాగరణ చేయాలి. మర్నాడు యథావిధిగా కాలకృత్యాలు ముగించుకుని తేనె నెయ్యి, నువ్వులతో 108 అహుతుల్ని నారాయణుడికి సమర్పించాలి. ఆ తరువాత నాలుగు శేర్లబియ్యాన్ని దక్షిణతో సహా తీసుకుని "ప్రాణరూపీ మహావిష్ణుః ప్రాణదస్సర్వ వల్లభః। తండులోదక దానేన ప్రీయతాంమే జనార్దన" (ప్రాణ స్వరూపుడు, ప్రాణాల్ని ప్రసాదించేవాడు అయిన జనార్ధనుడు నేను చేసే నాలుగుశేర్ల బియ్యం దానంతో సంప్రీతుడై నా కోరికల్ని తీర్చుగాక) అని చెప్పి దానమివ్వాలి. ఈవిధంగా నియమపూరితంగా వ్రతాన్ని ఆచరించిన వాడు, అత్యగ్ని ష్టోమ యాగంకన్నా ఎనిమిది రెట్లు అధికంగా పుణ్యఫలాల్ని పొందుతాడు.

**6. వైశాఖ శుద్ధద్వాదశి :** ఈ దివ్యతిథినాడు ఉపవాసముండాలి. ఆ రోజు మధుసూదనుడికి ముప్పైరెండు శేర్లపాలతో అభిషేకం చేసి, మూడు కాలాల్లో షోడశోపచార పూజచేయాలి. ఆ రోజు ఉదయం "నమస్తే మధుహంత్రే" అనే మంత్రాన్ని పఠిస్తూ 108 సార్లు నేతితో హోమాన్ని చేయాలి. ఆ రోజు రాత్రి మొత్తం స్వామిసన్నిధిలో జాగరణచేయాలి. ఈ విధంగా నియమంతో వ్రతాన్ని ఆచరించిన వాడు అన్ని పాపాలూ పోగొట్టుకుని అశ్వమేధయాగం చేసిన ఫలితాన్ని పొందుతాడు. ఈ వ్రతం ఆచరించిన రోజు యథాశక్తి విప్రులకి దానం చేయాలి. వస్త్రభోజనాలతో అందర్నీ సంతృప్తి పరచాలి.

**7. జ్యేష్ఠ శుద్ధద్వాదశి :** ఈ రోజు ఉపవాసదీక్ష వహించి ముందుగా నాలురు శేర్ల పాలతో త్రివిక్రముడికి అభిషేకంచేయాలి. తరువాత 'నమః త్రివిక్రమాయ' అనే మంత్రాన్ని పఠించి పాయసంలో 108 సార్లు హోమం చేయాలి. శ్రీహరి ప్రతిమని స్థాపించి త్రికాలాల్లో షోడశోపచార పూజచేయాలి. ఆ రోజు రాత్రి స్వామి సన్నిధిలో జాగరణ చేసి, ఆ మర్నాడు యథావిధిగా శ్రీహరిని పూజించాలి.

ఆ తరువాత దక్షిణతో సహా ఇరవై అపూపాలని తీసుకుని "దేవదేవ జగన్నాథ! ప్రసీదపరమేశ్వర! ఉపాయనంచ (సంగృహ్య మమాభీష్టప్రదో" భవ ఓ దేవదేవుడా! జగన్నాథుడా! పరమేశ్వరా నన్ను కరుణించు. నా మీద ప్రసన్నత చూపు. నేను దానం చేసే అపూపాల్ని స్వీకరించి నా కోరికల్ని ఫలప్రదంచేయి) అని చెప్పి బ్రాహ్మణుడికి దానం ఇవ్వాలి.

ఆ విధంగా దానం చేసిన తరువాత శక్తి కొద్దీ విప్రులకి భోజనం పెట్టి వారు తృప్తిచెందిన తరువాత తాను బంధువులతో కలిసి భోజనం చేయాలి. ఈవిధంగా ఎంతో దివ్యమైన త్రివిక్రమ వ్రతాన్ని ఆచరించినవాడు అన్నిరకాల పాపాల్నీ పోగొట్టుకొని ఎనిమిది నరమేధ యాగాలు చేసిన ఫలితాన్ని పొందుతాడు.

**8. ఆషాడ శుద్ధద్వాదశి :** ఇంద్రియనిగ్రహాన్ని కలిగి ఈ పుణ్యతిథినాడు ఉపవసించాలి. ముందుగా నాలుగు శేర్ల పాలతో వామన మూర్తికి అభిషేకం చేయాలి. ఆ తరువాత "నమస్తే వామనాయ" అనే మంత్రాన్ని పఠించి నేయి గరికతో 108సార్లు హోమం చేయాలి. ఈ విధంగా హోమం చేసిన తరువాత త్రికాలాలలో వామనమూర్తిని షోడశోపచారాలతో పూజించాలి. ఆ తరువాత కొబ్బరికాయ దక్షిణలతో పాటు పెరుగన్నాన్ని తీసుకుని" వామనో వృద్ధిదోహోతా ద్రవ్యస్థోవామనస్సదా! వామనస్తారకోஉస్మా చ్ఛవామనాయ నమోనమః" (సిద్ధినిచ్చేవాడు, హోత అయినవాడు వామనుడే. వామనుడెప్పుడూ ద్రవ్యంలో స్థిరంగా వుంటాడు. వామనుడు అందర్నీ తరింపచేస్తాడు. అలాంటి వామనుడికి నమస్కారం) అని చెప్పి యోగ్యుడైన బ్రాహ్మణుడికి దానమివ్వాలి.

ఈ విధంగా దానం చేసిన తరువాత యథాశక్తి విప్రులకి భోజన దక్షిణ తాంబూలాల్ని సమర్పించి ఆ తరువాత నియమంగా తన బంధువులతో కలిసి భుజించాలి. ఇలా శ్రద్ధాభక్తులతో వామనుడైన శ్రీహరి వ్రతాన్ని ఆచరించినవాడు వంద అగ్నిష్టోమయాగాలు చేసిన ఫలాన్ని పొందుతాడు.

**9. శ్రావణ శుద్ధద్వాదశి :** ఈ పుణ్యతిథినాడు ఉపవసించాలి. ముందుగా శ్రీధరుడిప్రతిమని స్థాపించి తేనె కలిపిన పాలతో శ్రీధరుడికి అభిషేకం చేయాలి.

తరువాత నేయి కలిపిన పెరుగుతో "నమోఽస్తు శ్రీధరాయ" అని పఠిస్తూ 108 సార్లు హోమం చేయాలి. హోమానంతరం త్రికాలాలలో శ్రీధరుడికి షోడశోపచార పూజని చేయాలి. ఆ రాత్రి మొత్తం స్వామిసన్నిధిలో జాగరణ చేసి మర్నాడు యథావిధిగా శ్రీధరుణ్ణి షోడశోపచారాలతో అర్చించాలి.

వస్త్రాలు, బంగారు కుండలాలు, దక్షిణతో సహా నాలుగుశేర్ల పాలను తీసుకుని "క్షీరాబ్ధిశాయిన్। దేవేశ రమాకాంత జగత్పతే। క్షీరదానేన సుప్రీతో భవ సర్వ సుఖప్రదః" (పాలసముద్రంలో శయనించే ఓ దేవేశా! రమావల్లభుడా! నేను చేసే ఈ క్షీరదానం వల్ల నీవు సంప్రీతుడివికా!) అని చెప్పి యోగ్యుడైన విప్రుడికి దానమివ్వాలి. ఈ విధంగా శ్రద్ధాభక్తులతో దానంచేసి యథాశక్తి బ్రాహ్మణుల్ని భోజనాదులతో సంతృప్తి పరచాలి. ఇలా శ్రీహరివ్రతాన్ని చేసినవాడు వేయి అశ్వమేధయాగాలు చేసిన ఫలితాన్ని పొందుతాడు.

**10. భాద్రపద శుద్ధద్వాదశి :** పరమపవిత్రమైన ఈ తిథినాడు ఉపవసించి జగన్నాథుడైన హృషీకేశుణ్ణి ముప్పైరెండు శేర్లపాలతో అభిషేకించాలి. "హృషీకేశ నమస్తుభ్యం" అనే మంత్రాన్ని స్వాహాకారంతో పఠిస్తూ తేనె కలిపిన పొంగలితో 108సార్లు హోమం చేయాలి. తరువాత పొంగలితో 108సార్లు హోమం చేయాలి. తరువాత త్రికాలాలలో హృషీకేశుడికి షోడశోపచారపూజ చేయాలి. ఆ రాత్రంతా స్వామి సన్నిధిలో జాగరణచేసి మర్నాడు యథావిధిగా స్వామిని అర్చించాలి.

ఆత్మజ్ఞాని అయిన విప్రుడికి "హృషీకేశ నమస్తుభ్యం సర్వలోకైకహేతవే! మహ్యం సర్వసుఖం దేహి గోధూమస్యప్రదానతః" (ఓ హృషీకేశా! నీకు నమస్కారం. నీవు అన్ని లోకాలకీ కారణ భూతుడివి. నేను ఇచ్చే గోధుమల దానంతో నీవు ప్రీతిచెంది నాకు సకల సుఖాల్నీ ప్రసాదించు)అని చెప్పి ఆరుశేర్ల గోధుమల్ని శక్తికొద్దీ బంగారం దక్షిణతో సహా దానంచేయాలి. తరువాత బ్రాహ్మణుల్ని భోజన దక్షిణాదులతో సంతృప్తి పరిచి తాను బంధువులతో కలిసి భోజనం చేయాలి. ఈ విధంగా శ్రద్ధాభక్తులతో హృషీకేశవ్రతాన్ని ఆచరించినవాడు అన్ని పాపాల్నీ పోగొట్టుకుని బ్రహ్మమేథ యాగం చేసిన ఫలితాన్ని పొందుతాడు.

**11. ఆశ్వియుజ శుద్ధద్వాదశి :** ఇది శ్రీహరికి ప్రీతికరమైన పుణ్యతిథి. ఈనాడు ఉపవాసదీక్షతో పద్మనాభుడికి పాలతో అభిషేకం చేయాలి. "నమస్తే పద్మనాభాయ" అనే మంత్రానికి 'స్వాహా' చేర్చి తిలలు, యవలు, నేయితో 108 సార్లు హోమం చేయాలి. హోమానంతరం పద్మనాభుణ్ణి త్రికాలాలలో షోడశోపచారాలతో పూజించాలి. ఆ రాత్రి స్వామి సన్నిధిలోనే జాగారం చేసి మర్నాడు ఉదయం యథావిధిగా స్వామిని అర్చించాలి.

యోగ్యుడైన బ్రాహ్మణుడికి భక్తిగా నమస్కరించి, పూజించి "పద్మనాభ నమస్తుభ్యం సర్వలోక పితామహః మధుదానేన సుప్రీతో భవ సర్వసుఖప్రదః (అందరికీ పితామహుడవైన ఓ పద్మనాభా! నీకు నమస్కారం. నేను దానం చేసే తేనెని స్వీకరించి సంప్రీతుడవై నన్ను కరుణించు) అని చెప్పి పావుశేరు తేనెని, దక్షిణతో సహా సమర్పించాలి. ఈ విధంగా పద్మనాభవ్రతాన్ని శ్రద్ధగా ఆచరించినవాడు వేయి బ్రహ్మమేధయాగాలు చేసిన ఫలాన్ని పొందుతాడు.

**12. కార్తీకశుక్ల ద్వాదశి :** ఈ తిథినాడు ఇంద్రియనిగ్రహాన్ని పాటిస్తే ఉపవాసదీక్షని ఆచరించాలి. ముందుగా నాలుగు శేర్లపాలు లేక పెరుగుతో లేదా నేయితో 'నమో దామోదరాయ' అని చెప్తూ దామోదరుడికి అభిషేకం చేయాలి. తరువాత అదే మంత్రానికి 'స్వాహా' చేర్చి తేనె నెయ్యి కలిపిన నువ్వులతో 108 సార్లు హోమం చేయాలి.

తరువాత త్రికాలాలలో దామోదరుణ్ణి షోడశోపచారాలతో శ్రద్ధగా పూజించాలి. ఆ రాత్రి స్వామి సన్నిధిలో జాగారం చేసి మర్నాడు ఉదయం అందమైన పద్మాలతో దామోదరుణ్ణి పూజించాలి. తిరిగి నేయి కలిపిన నువ్వులతో 108సార్లు హోమం చేసి యోగ్యుడైన విప్రుణ్ణి పిలిచి "దామోదర!జగన్నాథ! సర్వకారణ కారణ–త్రాహిమాం కృపయాదేవ శరణాగత పాలక" (సకల కారణాలకీ కారణ భూతుడవైన ఓ జగన్నాథా! దామోదరా! శరణాగత రక్షకా! నన్ను దయతో రక్షించు)అని చెప్పి పంచభక్ష్యాలతో కూడిన అన్నాన్ని సమర్పించాలి.

ఈ విధంగా అన్నదానం చేసిన తరువాత యథాశక్తి వ్రతానికి విచ్చేసిన విప్రులకి భోజన దక్షిణ తాంబూలాల్ని సమర్పించి, తన బంధువులతో కలిసి

తాను భుజించాలి. ఇలా నియమంగా శ్రద్ధాభక్తులతో వ్రతాన్ని ఆచరించిన వాడు వెయ్యి అశ్వమేధయాగాల కన్నా అధికమైన ఫలాన్ని పొందుతాడు. ఒక సంవత్సరం పాటు క్రమం తప్పకుండా ద్వాదశీ వ్రతాన్ని ఆచరించినవారు శ్రీహరి దివ్యనివాసమైన వైకుంఠధామానికి చేరుకుంటారు.

## ద్వాదశ-ద్వాదశీవ్రత ఉద్యాపన

నియమపూరితంగా పన్నెండు నెలలపాటు ద్వాదశీవ్రతాన్ని శ్రద్ధగా ఆచరించిన వారు, సంవత్సరం పూర్తికాగానే తిరిగి మార్గశీర్ష శుక్ల ద్వాదశినాడు వ్రతఉద్యాపన చేయాలి. ఉదయాన్నే నిద్రలేచి యథావిధిగా కాలకృత్యాలు తీర్చుకుని, తెల్లని వస్త్రాలు, పూలమాల ధరించి, గంధం పూసుకుని తయారవ్వాలి. స్వగృహంలో అందంగా పూజామండపాన్ని నిర్మించాలి. ఆ మండపం మధ్యభాగంలో సర్వతో భద్రముద్రని చిత్రించి దాని మీద నీటితో నింపిన 12కలశాలు ఉంచాలి. తెల్లటి వస్త్రంతో కలశాలని కప్పాలి. ఆ కలశాలలో యథాశక్తి పంచరత్నాల్ని ఉంచాలి.

బంగారం, వెండి లేక రాగితోనైనా శ్రీలక్ష్మీ నారాయణుల ప్రతిమని తయారుచేయించి దాన్ని కలశం మీద ఉంచాలి. వ్రతాన్ని ఆచరించేవాడు ధనవ్యయం విషయంలో లోభించకూడదు. ప్రతిష్ఠించిన లక్ష్మీనారాయణ ప్రతిమని పంచామృతాలతో అభిషేకించాలి. కేశవాది నామాలు చదువుతూ షోడశోపచార పూజ చేయాలి. ఈ విధంగా త్రికాలాలలో శ్రీహరిని ఆరాధించాలి. ఆ రోజు రాత్రి స్వామి సన్నిధిలో జాగారంచేసి మర్నాడు ఉదయం యథావిధిగా స్వామిని అర్చించాలి.

శ్రీమన్నారాయణుడి ప్రతిమ ముందు కూర్చుని పురాణశ్రవణం చేయాలి. దీనికి ముందు బ్రాహ్మణులచేత నారాయణ మంత్రాన్ని పఠిస్తూ నువ్వులతో వేయి ఆహుతుల్ని స్వామికి సమర్పించాలి. శ్రీమన్నారాయణుడి ప్రీత్యర్థం షోడశోపచార పూజచేసి 12మంది బ్రాహ్మణుల్ని పిలిచి నెయ్యితో కలిపిన పది అపూపాల్ని పాయసం, పెరుగన్నం దక్షిణతో సహా ఒక్కొక్కరికీ

దానంచేయాలి. దానం చేసేడప్పుడు ముందుగా – దేవదేవజగన్నాథ! భక్తానుగ్రహ విగ్రహా! గృహాణోపాయనం కృష్ణ సర్వాభీష్ట ప్రదోభవ" (జగన్నాథుడవైన ఓ దేవదేవుడా! భక్తానుగ్రహ విగ్రహా! నేను చేస్తున్న ఈ దానాన్ని స్వీకరించి నాకోరికలన్నిటినీ తీర్చు) అనే మంత్రాన్ని పఠించాలి.

భూమిమీద మోకాళ్ళతో కూర్చుని వినయంగా స్వామికి నమస్కరించి

నమో నమస్తే సురరాజ నమోఽస్తుతే దేవజగన్నివాస!
కురుష్వసంపూర్ణ ఫలం మమాద్య నమోఽస్తు
తుభ్యం పురుషోత్తమాయ ॥

"ఓ సురరాజా! జగన్నివాసా! నారాయణా! పరంధామా! నీకు నమస్కారం. నేను చేసిన ఈ వ్రతాన్ని సంపూర్ణంగా ఫలవంతంచేయి" అని భక్తి పూర్వకంగా పురుషోత్తముణ్ణి వేడుకోవాలి.

తరువాత శ్రీలక్ష్మీనారాయణులకి నమస్కరించి

లక్ష్మీపతే నమస్తుభ్యం క్షీరార్ణవనివాసినే ।
అర్ఘ్యం గృహాణ దేవేశ లక్ష్మ్యా చ సహితః ప్రభో ॥

క్షీరసాగరనివాసుడవైన ఓ లక్ష్మీపతీ! నీకు నమస్కారం. నేను సమర్పించే అర్ఘ్యాన్ని స్వీకరించి నన్ను కృతార్థుణ్ణిచేయి అని ప్రార్థించి లక్ష్మీ నారాయణులకి అర్ఘ్యాన్ని సమర్పించాలి. తరువాత

యస్యస్మృత్యాచ నామోక్త్యా తపోయజ్ఞక్రియాదిషు ।
న్యూనం సంపూర్ణతాంయాతి సద్యోవందే తమచ్యుతమ్ ॥

అని విజ్ఞాపన చేసి దక్షిణాసహితంగా శ్రీలక్ష్మీ నారాయణ ప్రతిమని ఆచార్యుడికి దానం చేయాలి. తరువాత యథాశక్తి విప్రుల్ని దక్షిణ భోజన తాంబూలాలతో సత్కరించి, బంధుజనాలతో సహా తాను భుజించాలి. విద్వాంసులతో భక్తులతో కలిసి ఆ రోజు సాయంత్రం వరకూ హరికథల్ని శ్రద్ధగా శ్రవణం చేయాలి.

ఈ విధంగా నియమనిష్ఠలతో శ్రద్ధాభక్తులతో ద్వాదశ ద్వాదశీవ్రతాల్ని చేసినవాడు ఇహపరాలలో అన్ని కోరికల్నీ సంపూర్ణంగా పొందుతాడు. సకల పాపాలనుంచీ విముక్తుడై శాశ్వతంగా విష్ణుపదానికి చేరుకుంటాడు. పరమపవిత్రమైన ఈ ద్వాదశీ వ్రతాన్ని విన్నవారు, చెప్పినవారు వాజపేయ యాగాన్ని చేసిన ఫలాన్ని పొందుతారు.

## పంచరాత్రి వ్రతం

హరిపంచకం అనేపేరుతో అన్నిలోకాల్లో ఎంతో ప్రసిద్ధిపొందిన వ్రతం ఈ పంచరాత్రి వ్రతం. ఇదిమానవుల దుఃఖాలన్నిటినీ నాశనం చేస్తుంది. ధర్మార్థ కామమోక్షాల్ని ప్రసాదిస్తుంది. సకల కోరికల్నీ తీరుస్తుంది. ఈ దివ్యవ్రతాన్ని మార్గశీర్ష శుక్లదశమినాడు సంకల్పించాలి. మార్గశిర శుద్ధఏకాదశినాడు ప్రాతఃకాలంలోనే నిద్రలేచి నిత్యకర్మల్ని నిర్వర్తించి, భక్తి శ్రద్ధలతో శ్రీహరిని అర్చించాలి. ముందుగా పంచామృతాలతో శ్రీహరి ప్రతిమకి అభిషేకం చేయాలి. ఆ తరువాత యథాక్రమంగా గంధపుష్పాలతో శ్రీహరికి షోడశోపచార పూజచేయాలి.

నమస్తే జ్ఞానరూపాయ జ్ఞానదాయనమోఽస్తుతే ।
నమస్తే సర్వరూపాయ సర్వసిద్ధిప్రదాయినే ॥

జ్ఞానస్వరూపుడికి, జ్ఞానాన్ని ప్రసాదించేవాడికి, సర్వస్వరూపుడికి, సర్వసిద్ధుల్నీ ప్రసాదించేవాడికి నమస్కారం. ఈవిధంగా చెప్పి శ్రీహరికి నమస్కరించాలి.

పంచరాత్రం నిరాహారో హ్యద్యప్రభృతికేశవ ।
త్వదాజ్ఞయా జగత్స్వామిన్మహాభీష్ట ప్రదోభవ ॥

(ఓ కేశవా! నీ ఆజ్ఞతో ఈ రోజునుంచీ వరుసగా అయిదురోజులు నిరాహారంగా ఉంటాను. నా అభీష్టాలన్నీ నెరవేర్చు)అని శ్రీహరిముందు సంకల్పం చెప్పుకుని వరుసగా అయిదురాత్రులు ఇంద్రియ నిగ్రహంతో జాగరణచేయాలి. ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, చతుర్దశి, పూర్ణిమాతిథుల్లో రాత్రిపూట ఈ జాగరణ దీక్షగా చేయాలి. ఈ అయిదురోజులూ ఉదయంపూట మొదటిరోజు చేసిన విధంగానే పంచామృతస్నానం శ్రీహరికి షోడశోపచార పూజ నిర్వహించాలి.

అయిదోరోజైన పౌర్ణమి నాడు శక్తిననుసరించి పాలతో శ్రీహరి ప్రతిమని అభిషేకించాలి. అదేవిధంగా శ్రీమన్నారాయణుడి అష్టాక్షరి లేక, ద్వాదశాక్షరీ మహామంత్రాన్ని స్వాహాకారంతో పఠిస్తూ 108సార్లు తిలలతో హోమం చేయాలి. హోమానంతరం దక్షిణతో సహా నువ్వుల్ని దానం చేయాలి.

ఆరోరోజు తమ నిత్యపూజని ముగించుకుని, పంచగవ్యాల్ని ప్రాశనచేసి యథావిధిగా శ్రీహరిని పూజించాలి. పూజానంతరం విప్రులకి భోజన దక్షిణతాంబూలాల్ని శక్తివుంటే సమర్పించి, తరువాత మౌనంగా తన బంధువులతో కలిసి భోజనం చేయాలి. ఇదేవిధంగా పుష్యమాసం నుంచి కార్తీకమాసం వరకు శుక్లపక్షంలో పూర్వోక్తవిధితో వ్రతాన్ని ఆచరించాలి. ఇలా ఒక సంవత్సరంచేసి తిరిగి మార్గశీర్షమాసంలో ఉద్యాపనచేయాలి.

వ్రతానంతరం నేయి తేనె కలిపిన పాయసం, పండ్లు, సుగంధజలం, దక్షిణ, పంచరత్నాలతోకూడిన జలకుంభాన్ని ఒక వస్త్రంతో కప్పి యోగ్యుడైన విప్రుడికి దానంచేయాలి. తరువాత

సర్వాత్మస్సర్వభూతేశ సర్వవ్యాపిస్సనాతన ।
పరమాన్నప్రదానేన సుప్రీతోభవమాధవ ॥

అనే మంత్రాన్ని చదివి బ్రాహ్మణుడికి పాయసాన్ని దానం చేయాలి. ఆ తరువాత యథాశక్తి విప్రులకి భోజన దక్షిణ తాంబూలాల్ని సమర్పించి, మౌనంగా తాను బంధువులతో సహా భోజనం చేయాలి.

**వ్రతఫలం :** హరిపంచకం అనేపేరుతో ప్రసిద్ధిచెందిన ఈ పంచరాత్రి వ్రతాన్ని ఆచరించినవారు శాశ్వతంగా విష్ణులోకాల్ని చేరుకుంటారు. ఈ వ్రతాన్ని మోక్షం కోరేవారు తప్పకుండా ఆచరించాలి. ఉపవాసదీక్షతో నియమబద్ధంగా ఈ పంచరాత్రి వ్రతాన్ని ఆచరించిన వారికి వేయికోట్ల గోవుల్ని దానంచేసిన ఫలం లభిస్తుంది. నారాయణుడి మీద అచంచలమైన భక్తి విశ్వాసాలతో ఈ వ్రతవిధానం గురించి విన్నవారికి కూడా ఘోరమైన పాపాలు నశిస్తాయి.

# హరిభక్తి లక్షణం

ముక్తికావాలని కోరుకునేవారు సచ్చిదానంద స్వరూపుడైన శ్రీహరిని అన్నివిధాలా సేకరించాలి. శ్రీహరిని సేవించే మానవుల్ని ఎవరూ హింసించలేరు. ఎలాంటి గ్రహాలూ వారిని బాధించలేవు. దేవదేవుడైన శ్రీహరిమీద దృఢమైన భక్తి కలిగినవారికి సకల శ్రేయస్సులూ కలుగుతాయి.

పాదౌతేసఫలే పుంసాంయౌవిష్ణుగృహగామినే ।
తౌకరౌసఫలే జ్ఞేయౌ విష్ణుపూజాజాపరేతుయౌ ॥
తేనేత్రే సుఫలే పుంసాం పశ్యతోయేజనార్దనమ్ ।
సాజిహ్వా ప్రోచ్యతే షడ్భిర్హరినామ పరాతుయా ॥ *(శ్లో॥7-8,అధ్యా34)*

శ్రీహరి ఆలయాన్ని దర్శించటానికి వెళ్ళే పాదాలే సఫలమైనవి. శ్రీహరిని పూజించే చేతులే సఫలమైనవి, శ్రీహరిని దర్శించే నేత్రాలు సఫలాలు. అలాగే హరినామాన్ని కీర్తించే జిహ్వే జిహ్వ ఇది సత్యం.

విష్ణువుమీద లగ్నమైనదే మనస్సు. విష్ణునామ సంకీర్తనా పరాయణమైనదే వాక్కు. విష్ణు కథల్ని విన్నవే చెవులు. పరమదైవమైన శ్రీహరిని సర్వకాలాలలో సేవించాలి. ఆత్మజ్ఞానం లేనివాడు శ్రీహరి దివ్యస్వరూపాన్ని చూడలేడు. అహింస, అస్తేయం, బ్రహ్మచర్యం కలిగినవాడిని శ్రీహరి అనుగ్రహిస్తాడు. సత్కథల్ని విని సంతోషించేవాడు, సత్కథల్ని చెప్పేవాడు, సత్సంగం చేసేవాడు, అహంకార రహితుడు, శ్రీహరికి అత్యంత ప్రీతి పాత్రుడు. ఆకలి దప్పికలలో, ప్రమాదాలలో, సర్వకాల సర్వావస్థల్లో శ్రీహరి నామసంకీర్తన చేసేవారిని చూస్తే శ్రీహరి ఎంతో సంతోషిస్తాడు.

మానంత్యక్త్వాతథాలోభం కామక్రోధవివర్జితః ।
భజస్వసతతం విష్ణుం మానుష్యమతి దుర్లభం ॥
కోటిజన్మ సహస్రేషు స్థావరాదిషు సత్తమ ।
సంభ్రాంతస్యతు మానుష్యం కథంచిత్పరిలభ్యతే ॥

*(శ్లో॥35-36,అధ్యా-34)*

దేహాభిమానాన్ని, కామక్రోధలోభాల్ని విడిచి శ్రీహరిని భజించాలి. మానవజన్మ ఎంతో దుర్లభమైనది. కొన్ని వేల కోట్ల జన్మలు ధరించిన తరువాత అతికష్టంమీద మానవజన్మ లభిస్తుంది. ఇంతగొప్పదైన మానవజన్మలో దైవకార్యాల పట్ల ఆసక్తి కలగటం పూర్వజన్మ సుకృత ఫలమే. పవిత్రమైన మానవ జన్మఎత్తి కూడా శ్రీహరిని సేవించనివాడు పరమ అజ్ఞాని, మందభాగ్యుడు, మూర్ఖుడు.

విష్ణు భక్తికలిగినవాడు ఛండాలుడైనప్పటికీ బ్రాహ్మణుడి కన్నా గొప్పవాడు. అలాగే విష్ణుభక్తిలేని విప్రుడు ఛండాలుడికన్నా హీనుడే. శ్రీహరి సర్వగతుడు, సర్వాంతర్యామి. ఆయన సంతోషిస్తే ఈ జగత్తంతా సంతోషించినట్టే. పరమపావనుడైన శ్రీహరిని స్మరించినా, ధ్యానించినా, సేవించినా, పూజించినా, నమస్కరించినా సంసారపాశం ఛేదించబడుతుంది. కనుక హరిభక్తి కలవారందరూ శ్రేష్ఠులుగా కీర్తించబడతారు.

## ఉత్తంకోపాఖ్యానం

పూర్వం కృతయుగంలో 'గులికుడు' అనే ఒక వేటగాడుండేవాడు. అతడు పరమ దుర్మార్గుడు. ఎప్పుడూ ఇతరుల భార్యల్ని, ఇతరుల ధనాల్ని దోచుకుంటుండేవాడు. నిత్యం జంతువుల్ని హింసిస్తూ గోవుల్ని, బ్రాహ్మణుల్ని అకారణంగా వధించేవాడు. వేటగాళ్ళందరికీ రాజైన ఆ గులికుడు నిత్యం దైవధనాన్ని, పరులధనాన్ని కొల్లగొట్టటం మీదే ఆసక్తి కలిగివుండేవాడు. అలా ఆ గులికుడు చేసిన పాపాలు చెప్పటానికి కోటి సంవత్సరాలు కూడా చాలవు. అడవిలో జంతువుల పాలిట యముడిలా ఆ గులికుడు కీర్తిపొందాడు.

ఒకనాడు గులికుడు సకలైశ్వర్య సంపన్నమైన సౌవీరరాజ నగరానికి వెళ్ళాడు. ఆ నగరంలో సుందరంగా బంగారు కలశాలతో ప్రకాశిస్తున్న శ్రీహరి మందిరాన్ని చూసాడు. బంగారు కలశాలతో ఉన్న ఆ గుడి గులికుణ్ణి ఎంతో ఆకర్షించింది. ఆ గుళ్ళో ఎంతో బంగారం ఉంటుందని తెలుసుకుని నెమ్మదిగా ఆ ఆలయంలోకి ప్రవేశించాడు గులికుడు. అతడి దృష్టంతా చౌర్యం మీదే ఉంది.

దేవాలయంలోకి వెళ్ళిన గులికుడికి అక్కడ మహాతత్త్వకోవిదుడు, పరమశాంతుడు, శ్రీహరి పరిచర్యల్ని చేస్తున్న మహాతపోనిధి ఉత్తంకుడు దర్శనమిచ్చాడు. ఉత్తంకుడు ఏకాకి, నిరంతర ధ్యానరతుడు, దయామయుడు, అయిన ఉత్తంకమహర్షి కనిపించాడు.

ఎలాగైనా దైవద్రవ్యాన్ని దోచుకోవాలని ఆలోచన చేస్తున్న 'గులికుడు' తనకి అడ్డుగా వున్న ఉత్తంక మహర్షిని వధించాలనుకున్నాడు. వెంటనే తన కరవాలాన్నెత్తి ఉత్తంకుడిని చంపబోయాడు. తనని అకారణంగా చంపబోతున్న గులికుణ్ణి చూసి ఉత్తంకుడు అతనితో ఇలా అన్నాడు.

ఓ సాధు! పురుషుడా! నీవు నన్ను అకారణంగా వధిస్తున్నావు. నేను నీకు ఏ అపకారం చేశానో చెప్పు. నిజంగా సమర్థులైనవారు అపరాధం చేసిన వారిని శిక్షిస్తారు గానీ నిరపరాధుల్ని ఏమాత్రంకాదు.

- ఎంతగా బాధించినా ఎదుటివారిని క్షమించేవాడే ఉత్తమమానవుడు. వాడే శ్రీహరికి ప్రీతిపాత్రుడు.
- పరులహితాన్ని కోరుకునే సజ్జనుడు తనకి వినాశకాలం వచ్చినప్పటికీ ఎవరిమీదా ద్వేషం చూపడు.
- చందన వృక్షం తనని నరికే గొడ్డలికి కూడా సుగంధాన్నిస్తుంది.
- సర్వసంగపరిత్యాగులు కూడా దుర్జనులచేత బాధించబడుతున్నారు. దుర్జనులు కూడా సాధువుల్నే బాధిస్తున్నారు. కానీ వారంతా తమతో సమానమైన వారినెవరినీ బాధించటంలేదు.
- ఈ జగత్తునంతా మోహింపచేసేమాయ ఎంతో బలీయమైనది.
- ఓ బోయవాడా! నీవు పరులద్రవ్యం అపహరించి నీభార్యా బిడ్డల్ని పోషించుకున్నావు. అయితే నీ అవసానకాలంలో అందర్నీ విడిచి ఒంటరిగానే వెళతావు.
- ద్రవ్యాన్ని (ధనాన్ని) సంపాదించేవరకే బంధువులు వెంటఉంటారు. అయితే ఇహపరాలు రెండింటిలో వెంట తోడుగా వెళ్ళేవి ధర్మాధర్మాలు మాత్రమేకానీ పుత్రులు, బంధువులు సంపదలు కావు.

- పాపకర్మలు చేసేవారికి కోరికలు పెరుగుతుంటాయి. అదే పుణ్యకర్మలు ఆచరించేవారికి కోరికలు నశిస్తాయి.
- లోకంలో అందరూ ధనాన్ని అమితంగా సంపాదించాలని ఎన్నో వ్యర్ధప్రయత్నాలు చేస్తారు. అయితే జరగాల్సిందే జరుగుతుందికానీ, జరగకూడనిది ఎప్పటికీ జరగదు.
- స్థావరజంగమాత్మకమైన ఈ జగత్తంతా దైవాధీనం. కనుక జననం మరణం అనే రెండూ దైవానికే తెలుసు. ఈవిషయం గ్రహించక లోకులు ఎన్నో కష్టాలు పడి పాపాలు చేసి ధనాన్ని కూడబెడతారు. అయితే కూడబెట్టినవాడు పాపఫలితాన్ని అనుభవిస్తాడు. అతడి బంధువులు, పుత్రులు సుఖాల్ని అనుభవిస్తారు.

ఈవిధంగా ఉత్తంకమహర్షి పలికిన మాటలు వినగానే గులికుడికి జ్ఞానోదయమైంది. భయంతో చేతులు వణికాయి. ఆయన్ని చంపుదామని ఎత్తిన చేతిని దించి ఒక్కసారిగా ఉత్తంకుడి పాదాల మీద పడి క్షమించమని ప్రార్థించాడు. పశ్చాత్తాపం నిండిన హృదయంతో ఆ ఉత్తంకమహర్షికి నమస్కరించి విప్రోత్తమా! నేనింత వరకూ ఎన్నో పాపాలు చేసాను. నేడు మీలాంటి వారి దర్శనంతో అవన్నీ నశించి పోయాయి. నేను పాడుబుద్ధితో ఎన్నో ఘోరాలు, నేరాలు చేసాను. ఇక నాకు నిష్కృతి ఎలా లభిస్తుంది? నేను ఎవర్ని శరణు వేడుకోవాలి? పూర్వజన్మలో నేనేదో భయంకరమైన పాపం చేసి ఉంటాను. అందుకే ఈ జన్మలో బోయవాడిగా పుట్టాను. ఈ జన్మలో కూడా ఎన్నో పాపాలు చేసాను. ఇకపై నాకే గతిపడుతుందో! ఈవిధంగా 'ఉత్తంకుడితో పలికిన గులికుడు అదే వేదనతో గుండె ఆగి మరణించాడు.

పశ్చాత్తాపంచెంది మరణించిన గులికుణ్ణి చూసి ఉత్తంకుడు జాలిపడ్డాడు. పరమదయాళువైన ఆ మహర్షి తన కమండలంలో ఉన్న విష్ణుపాదోదకాన్ని గులికుడి కళేబరం మీద చల్లాడు. హరిపాదోదక స్పర్శ తగలగానే గులికుడి పాపాలన్నీ నశించాయి. అతడికి ప్రేత శరీరం పోయి దివ్య శరీరం వచ్చింది. విష్ణులోకం నుంచి వచ్చిన విమానాన్ని ఎక్కి, తనకి ఉత్తమ గతిని కల్పించిన ఉత్తంకుడితో ఇలా అన్నాడు.

"ఓ మహర్షీ! తమరు నాకు గురువులు. మీ దివ్యానుగ్రహంతో మహాపాతకాల నుంచి విముక్తి పొందాను. మీరు చేసిన ఉపదేశం వల్ల నాకు జ్ఞానోదయమైంది. నా బాధలన్నీ తొలగిపోయాయి. మీరు నాపై చల్లిన శ్రీహరి పాదోదకం వల్ల నేడు హరిపదానికి చేరుకోగలుగుతున్నాను. దయచేసి నా అపరాధాల్ని క్షమించి నన్ను మనసారా ఆశీర్వదించండి" అని ప్రార్థించాడు. వెంటనే దివ్య విమానం అతన్ని విష్ణులోకానికి తీసుకుపోయింది.

తపోనిధి అయిన ఉత్తంకమహర్షి ఈ దివ్యదృశ్యాన్ని చూసి ఎంతో ఆశ్చర్యపోయి ఆనందంగా శ్రీహరిని స్తుతించాడు.

## ఉత్తంకుడు చేసిన మహావిష్ణుస్తుతి

నతోఽస్మి నారాయణమాది దేవం జగన్నివాసం జగదేకబంధమ్
చక్రాబ్జశార్ఙ్గాసిధరం మహాంతం స్మృతార్తినిఘ్నం శరణం ప్రపద్యే ॥ 1
యన్నాభిజాబ్జప్రభవో విధాతా సృజత్యముం లోకసముచ్చయం చ,
యత్క్రోధజో హన్తి జగచ్చ రుద్రస్తమాది దేవం ప్రణతో ఽస్మి విష్ణుమ్ ॥ 2
పద్మాపతిం పద్మదళాయతాక్షం విచిత్రవీర్యం నిఖిలైకహేతుమ్
వేదాంత వేద్యం పురుషం పురాణం తేజోనిధిం విష్ణుమహం ప్రపన్నః ॥ 3
ఆత్మాక్షర స్సర్వగతోఽచ్యుతాఖ్యో జ్ఞానాత్మకో జ్ఞానవిదాం శరణ్యః
జ్ఞానైకవేద్యో భగవాననాదిః ప్రసీదతాం వ్యష్టి సమిష్టిరూపః ॥ 4
అనన్త వీర్యో గుణజాతి హీనో గుణాత్మకో జ్ఞానవిదాం వరిష్ఠః
నిత్యః ప్రపన్నార్తిహరః పరాత్మా దయాంబుధిర్మే వరదస్తు భూయాత్ ॥ 5
యస్థూలసూక్ష్మాదివిశేషభేదైర్జగద్యథా వత్స్వ కృతం ప్రవిష్టః
నిత్యః ప్రపన్నార్తిహరః పరాత్మా దయాంబుధిర్మే వరదస్తు భూయాత్ ॥ 6
అగోచరం యత్తవ శుద్ధరూపం మాయావిహీనం గుణజాతి హీనమ్
నిరంజనం నిర్మలమప్రమేయం పశ్యన్తి సన్తః పరమార్థసంజ్ఞమ్ 7
ఏకేన హేమ్నైవ విభూషణాని యాతాని భేదత్వముపాధిభేదాత్
తథైవ సర్వేశ్వర ఏక ఏవ ప్రదృశ్యతే భిన్న ఇవాఖిలాత్మా ॥ 8

యన్మాయయా మోహితచేతసస్తం పశ్యన్తి నాత్మానమపి ప్రసిద్ధమ్
త ఏవ మాయారహితాస్తదేవ పశ్యన్తి సర్వాత్మకమాత్మ రూపమ్ ॥ 9
విభుం జ్యోతిరనౌపమ్యం విష్ణుసంజ్ఞం నమామ్యహమ్
సమస్త మేతదద్భూతం యతో యత్ర ప్రతిష్ఠితమ్ ॥ 10
యతశ్చైతన్యమాయాతం యద్రూపం తస్య వై నమః
అప్రమేయమనాధారమాధారాధేయరూపకమ్ ॥ 11
పరమానన్దచిన్మాత్రం వాసుదేవం నతోఽస్మ్యహమ్
హృద్గుహానిలయం దేవం యోగిభిః పరిసేవితమ్ ॥ 12
యోగానామాదిభూతం తం నమామి ప్రణవస్థితమ్
నాదాత్మకం నాదబీజం ప్రణవాత్మకమవ్యయమ్ ॥ 13
సద్భావం సచ్చిదానన్దం తం వందే తిగ్మచక్రిణమ్
అజరం సాక్షిణం త్వస్య హ్యవాఙ్మానసగోచరమ్ ॥ 14
నిరంజనమనంతాఖ్యం విష్ణురూపం నతో ఽస్మ్యహమ్
ఇంద్రియాణి మనోబుద్ధిస్సత్త్వం తేజో బలం ధృతి ॥ 15
వాసుదేవాత్మకాన్యాహుః క్షేత్రం క్షేత్రంజ్ఞమేవ చ
విద్యావిద్యాత్మకం ప్రాహుః పరాత్పరతం తథా ॥ 16
అనాదినిధనం శాంతం సర్వ ధాతారమచ్యుతమ్
యే ప్రపన్నా మహాత్మానస్తేషాం ముక్తిర్హి శాశ్వతీ ॥ 17
పరం వరేణ్యం వరదం పురాణం సనాతనం సర్వగతం సమస్తమ్ నతోఽస్మి
భూయో ఽపి నతోఽస్మి భూయో నతో ఽస్మి భూయో ఽపి నతోస్మి భూయః ॥ 18
యత్పాదతోయం భవరోగవైద్యో యత్పాదపాంశుర్విమలత్వ సిద్ధ్యై
యన్నామ దుష్కర్మనివారణాయ తమప్రమేయం పురుషం భజామి ॥ 19
సద్రూపం తమసద్రూపం సదసద్రూపమవ్యయమ్
తత్తద్వి లక్షణం శ్రేష్ఠం శ్రేష్ఠాచ్ఛ్రేష్ఠతరం భజే ॥ 20
నిరంజనం నిరాకారం పూర్ణమాకాశమధ్యగమ్
పరం చ విద్యావిద్యాభ్యాం హృదంబుజనివాసినమ్ ॥ 21

స్వప్రకాశమనిర్దేశ్యం మహతాం చ మహత్తరమ్
అణోరణీయాంసమజం సర్వోపాధివివర్జితమ్ ॥ 22
యన్నిత్యం పరమానందం పరంబ్రహ్మ సనాతనమ్
విష్ణుసంజ్ఞం జగద్ధామ తమస్మి శరణం గతః ॥ 23
యం భజన్తి క్రియానిష్ఠా యం పశ్యన్తి చ యోగినః
పూజ్యాత్పూజ్యతరం శాంతం గతోఽస్మి శరణం ప్రభుమ్ ॥ 24
యం న పశ్యన్తి విద్వాంసో య ఏతద్వ్యాప్య తిష్ఠతి
సర్వస్మాదధికం నిత్యం నతో ఽస్మి విభుమవ్యయమ్ ॥ 25
అంతఃకరణసంయోగాత్ జీవ ఇత్యుచ్యతే చ యః,
అవిద్యాకార్యరహితః పరమాత్మే తిగేయతే ॥ 26
సర్వాత్మకం సర్వహేతుం సర్వకర్మఫలప్రదమ్
వరం వరేణ్యమజనం ప్రణతో ఽస్మి పరాత్పరమ్ ॥ 27
సర్వజ్ఞం సర్వగం శాంతం సర్వాంతర్యామినం హరిమ్
జ్ఞానాత్మకం జ్ఞాననిధిం జ్ఞానసంస్థం విభుమ్ భజే ॥ 28
నమామ్యహం వేదనిధిం మురారిం వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థమ్
సూర్యేందువత్ప్రోజ్జ్వల నేత్రమింద్రం ఖగస్వరూపం వపతి స్వరూపమ్ ॥ 29
సర్వేశ్వరం సర్వగతం మహాంతం వేదాత్మకం వేదవిదాం వరిష్ఠమ్ ।
తం వాఙ్మనోఽచిన్త్య మనస్తశక్తిం జ్ఞానైక వేద్యం పురుషం భజామి ॥ 30
ఇంద్రాగ్నికాలాసురపాశి వాయుసోమేశమార్తాండపురందరాద్యైః
యఃపాతి లోకాన్ పరిపూర్ణభావస్తమప్రమేయం శరణం ప్రపద్యే ॥ 31
సహస్రశీర్షం చ సహస్రపాదం సహస్రబాహుం చ సహస్రనేత్రమ్
సమస్తయజ్ఞైః పరిజుష్టమాద్యం నతోఽస్మి తుష్టిప్రదముగ్రవీర్యమ్ ॥ 32
కాలాత్మకం కాలవిభాగ హేతుం గుణత్రయాతీతమహం గుణజ్ఞమ్
గుణప్రియం కామదమస్తసంగం అతీన్ద్రియం విశ్వభుజం వితృష్ణమ్ ॥ 33
నిరీహమగ్ర్యం మనసాప్యగమ్యం మనోమయం చాన్నమయం నిరూఢమ్
విజ్ఞానభేదం ప్రతిపన్నకల్పం న వాఙ్మయం ప్రాణమయం భజామి ॥ 34

న యస్య రూపం న బలప్రభావో న యస్య కర్మాణి న యత్ప్రమాణమ్
జానన్తి దేవాః కమలోద్భవాద్యా స్తోష్యామ్యహం తం కథమాత్మరూపమ్ ॥ 35
సంసారసింధౌ పతితం కదర్యం మోహాకులం కామశతేన బద్ధమ్
అకీర్తి భాజం పి శునం కృతఘ్నుం సదాశుచిం పాపరతం ప్రమన్యుమ్ ॥ 36
దయాంబుధే పాహి భయాకులం మాం పునః పునస్త్వాం శరణం ప్రపద్యే ॥ 37
ఇతి ప్రసాదితస్తేన దయాలుః కమలాపతిః
ప్రత్యక్షతామగాత్తస్య భగనాం స్తేజసాం నిధిః ॥38 (శ్లో॥3-40,అధ్యా-38)

ఈవిధంగా ఉత్తంకుడి చేత ప్రార్ధించబడ్డ శ్రీహరి దివ్యతేజస్సుతో ప్రత్యక్షమయ్యాడు. గరుడధ్వజుడైన శ్రీహరిని చూసి ఆనంద బాష్పాలతో ఆయనకి దండప్రణామాలర్పించాడు ఉత్తంకుడు. నారాయిణా! పరంధామా! పరాత్పరా! మురారి! శరణు శరణు అని ప్రార్ధిస్తున్న ఉత్తంకుణ్ణి లేవనెత్తిన శ్రీహరి వత్సా! ఏం కావాలో కోరుకోవయ్యా అని అడిగాడు. స్వామీ! నన్నెందుకు మోహంలో పడేస్తున్నావు. నాకు వేరే వరాలతో అవసరమేలేదు. ఎన్ని జన్మలెత్తినా నీ దివ్య పాదారవిందాల మీద అనన్యమైన భక్తి స్థిరంగా ఉండేలా చేయి. నాకది చాలు అని ప్రార్ధించాడు.

ఉత్తంకుడి నిర్మలమైన మనసుని గ్రహించిన శ్రీహరి సరేనని పలికి తన దివ్యశంఖంతో ఉత్తంకుణ్ణి స్పృశించి పరమయోగులకు కూడా సాధ్యంకాని దివ్యజ్ఞానాన్ని ప్రసాదించాడు. అంతేకాదు ఉత్తంకుణ్ణి ఆశీర్వదించి ఓ ఉత్తంక మహర్షీ! నీవు చాలా ధన్యుడివి. నరనారాయణులు తపస్సుచేసిన బదరికాశ్రమానికి వెళ్ళు. అక్కడ క్రియాయోగంతో నన్ను ఆరాధించు. నీకు మోక్షం లభిస్తుంది. నీవు చేసిన ఈ దివ్యస్తోత్రంతో ఎవరైతే నన్ను త్రికాలాలలో స్తుతిస్తారో వారు కూడా అన్ని కోరికలూ పొంది చివరికి నా పరమపదాన్ని చేరుకుంటారు". ఈవిధంగా పలికిన శ్రీహరి అక్కణ్ణుంచి అంతర్ధానమయ్యాడు.

పరమపావనమైన ఈ ఉత్తంకోపాఖ్యానాన్ని చదివినా, విన్నా అలాగే ఉత్తంకుడు చేసిన శ్రీమహావిష్ణువు దివ్య స్తోత్రాన్ని పఠించినా సకల పాపాల నుంచీ విముక్తులై శ్రీహరివాసాన్ని చేరుకుంటారు.

# కలియుగంలో నామమహిమ

నాలుగు యుగాల్లో ఒకటైన కలియుగం ఎన్నో పాపాలతో కూడుకుని ఉంటుంది. ఈ యుగంలో ధర్మం అనేది కేవలం ఒక్కపాదం మీదే నడుస్తుంది. మానవులంతా కలిపురుషుడి ప్రభావానికి లోనై ఎన్నో అధర్మకార్యాలు చేస్తారు. అయితే హరి భక్తిపరాయణుల్ని మాత్రం కలిపురుషుడు ఎలాంటి ప్రలోభాలకీ గురిచేయలేడు.

కృతయుగంలో తపస్సు, త్రేతాయుగంలో ధ్యానం, ద్వాపరయుగంలో యజ్ఞం, కలియుగంలో దానం అనేవి ఉత్తమమైనవి. కృతయుగంలో పది సంవత్సరాలలో త్రేతాయుగంలో ఒక సంవత్సరంలో, ద్వాపరయుగంలో ఒకమాసంలో చేసేదాన్ని కలియుగంలో ఒకరోజులో చేయవచ్చు. అలాగే కృతయుగంలో ధ్యానంచేస్తూ, త్రేతాయుగంలో యజ్ఞాలు చేస్తూ ద్వాపరయుగంలో అర్చనలు చేస్తూ పొందే పుణ్యఫలాల్ని కలియుగంలో కేవలం హరినామ సంకీర్తనతోనే పొందవచ్చు.

రాత్రింబవళ్ళు శ్రీహరి నామాన్ని కీర్తించే మానవుల్ని, శ్రీహరిని పూజించే వారిని కలి బాధించడు. మహాఘోరమైన ఈ కలియుగంలో హరినామస్మరణే గమ్యం. అన్ని ధర్మాలూ నశించిన కలియుగంలో ఒక్కసారి నారాయణుణ్ణి అర్చించినవాడు ధన్యుడు. శ్రీహరి నామ స్మరణ ఒక్కటే కలియుగంలో పరిపూర్ణత్వాన్ని కలిగిస్తుంది.

హరేకేశవగోవింద వాసుదేవజగన్మయ ।
ఇతరయంతి యేనిత్యం నహితాన్బాధతే కలిః ॥
శివశంకర రుద్రేశ నీలకంఠ త్రిలోచన ।
ఇతిజల్పంతియేవాపి కలిస్తాన్నాపి బాధతే ॥
మహాదేవవిరూపాక్ష గంగాధర మృడావ్యయ ।
ఇత్థం వదంతియే విప్రాః తే కృతార్థా న సంశయః ॥
జనార్ధన జగన్నాథపీతాంబరధరాచ్యుత ।
ఇతివాప్యుచ్ఛరన్తీహన చ తేషాం కలేర్భయమ్ ॥ *(శ్లో॥100-104,అధ్యా-41)*

హరే! కేశవా! గోవిందా! వాసుదేవా! జగన్మయా! అని నిత్యం శ్రీహరిని స్మరించినవారిని కలిపురుషుడు బాధించలేడు. అదేవిధంగా శివా! శంకరా! రుద్రా! ఈశా! నీలకంఠా! త్రిలోచనా! అని శంకరుణ్ణి స్తుతించేవాణ్ణి కూడా కలి ఏమీ చేయలేదు. మహాదేవ! విరూపాక్ష! గంగాధరా! మృడా! అవ్యయా! అని శంకరుణ్ణి కీర్తించేవారు, జనార్ధనా! జగన్నాథా! పీతాంబరధరా! అచ్యుతా! అని శ్రీహరిని స్తుతించేవారు ఈ కలియుగంలో కృతార్థులు. పరమభయంకరమైన ఈ కలియుగంలో సంసారులకి పుత్రులు, ధనం లాంటివన్నీ సులభంగా లభిస్తాయి కానీ, హరిభక్తిమాత్రం అంత సులభంగా లభించదు.

వేదమార్గాన్ని వదిలినవారు, పాపకర్మలు చేసినవారు, మనశ్శుద్ధి లేనివారు అయిన మానవులకి హరినామస్మరణ ఒక్కటే నిష్కృతి. శ్రీహరి అనుగ్రహాన్ని పొందాలనుకునేవారు ఈ కలియుగంలో వేదవిహితమైన కర్మల్ని ఆచరించి వాటి ఫలితాల్ని శ్రీమన్నారాయణుడికి భక్తిగా సమర్పించాలి. హరి స్మరణచేసే వారికి, శివనామాన్ని జపించేవారికి సమస్తకార్యాలూ సిద్ధిస్తాయి. హరిభక్తులు ఎంతో భాగ్యవంతులు. ఎందుకంటే వారిని దేవతలు కూడా పూజిస్తారు. కనుక కలియుగంలో శ్రీహరి నామస్మరణ తప్ప వేరే గతిలేదు.

## జ్యోతిష విజ్ఞానం

తల, ముఖం, చేతులు, గుండె, క్రోడం, గోళ్ళు, జానువులు, జంఘలు, అంఘ్రియుగళాలు ఇవన్నీ కాలపురుషుడికి అంగాలుగా జోతిష్యశాస్త్రంలో చెప్పబడ్డాయి. రాశులు మొత్తం పన్నెండు. వీటిలో మేషవృశ్చిక రాశులకి కుజుడు అధిపతి. వృషభ, తులారాశులకి శుక్రుడు అధిపతి. మిథున-కన్యారాశులకి బుధుడు అధిపతి. కర్కాటక రాశికి చంద్రుడు అధిపతి. అలాగే సింహరాశికి సూర్యుడధిపతి. ధనుస్సు-మీన రాశులకి బృహస్పతి అధిపతి. మరక-కుంభ రాశులకి శని అధిపతి. మేషాది రాశుల్లో తుల కర్కాటకాది రాశులు నవాంశలుగా తెలుసుకోవాలి. మేషాదిరాశులు తూర్పుదిశలో ఉంటాయి. అవి తమతమ స్థానాల్లో తిరుగుతుంటాయి. సూర్యాదిగ్రహాలకి మేషాది రాశులు - ఉచ్చరాశులు ఈ విధంగా చెప్పబడ్డాయి.

రవికి–మేషం, చంద్రుడికి–వృషభం, కుజుడికి–మకరం, బుధుడికి–కన్య, గురుడికి–కర్కాటకం, శుక్రుడికి–మీనం, శనికి–తుల ఇవి ఉచ్చరాశులు. ప్రతి గ్రహానికీ తన ఉచ్చరాశికి ఏడోరాశి నీచరాశిగా తెలుసుకోవాలి. దీనిప్రకారం మొదటి గ్రహమైన రవికి ఏడోదైన తులారాశి. అదేవిధంగా చంద్రుడికి–వృశ్చికం, కుజుడికి–కటకం, బుధుడికి–మీనం, గురువుకి–మకరం, శుక్రుడికి–కన్య, శనికి–మేషం అనేవి నీచరాశులు.

రవికి – సింహం, చంద్రుడికి – వృషభం, కుజుడికి – మేషం, బుధుడికి – కన్య, గురువుకి – ధనస్సు, శుక్రుడికి – తుల, శనికి – కుంభం వీటిని మూల త్రికోణాలంటారు.

రాశికి–రాశినుంచి నాలుగు, ఏడు, పది రాశులకి కేంద్రాలని పేరు. రాశికి–రాశి నుంచి అయిదు తొమ్మిది రాశులకి కోణాలని పేరు. ఈ కేంద్ర, కోణాలలో ఉన్న గ్రహాలు ప్రబలంగా ఉంటాయి.

ఎరుపు, తెలుపు, ఆకుపచ్చ, పాటలవర్ణం, ధూమ్రవర్ణం, పాండురవర్ణం, చిత్రవర్ణం, కృష్ణవర్ణం, పసుపు పచ్చ, పింగళవర్ణం, బభ్రువర్ణం, స్వచ్ఛవర్ణం అనేవి గ్రహాలన్నిటికీ ప్రభావక్రియవల్ల ఏర్పడతాయి.

సూర్యుడు కాలస్వరూపుడు. చంద్రుడు మనస్సుకి కారకుడు. అదేవిధంగా కుజుడు–సత్త్వానికి, బుధుడు–వాక్కుకి, గురువు–జ్ఞానానికి, శుక్రుడు–సుఖానికి, కామానికీ, శని–దుఃఖానికి కారకులుగా ఉంటారు.

గ్రహాలలో సూర్యచంద్రులిద్దరూ రాజులుకాగా, కుజుడు అధికారి, బుధుడు యువరాజు, గురుశుక్రులిద్దరూ మంత్రులు, శని, అనుచరుడు అని పండితులు చెబుతారు. సూర్యుడికి ఆయారాశుల్లో సంచరించే విధానాన్ని అనుసరించి 1.తామ్ర 2.శుక్ల 3.రక్త 4.హరిత 5.పీత 6.చిత్ర 7.కృష్ణ అనే వర్ణాలు కలుగుతుంటాయి.

రవి, శుక్ర, కుజ,రాహు, శని, చంద్ర, బుధ, గురువులు వరుసగా ఎనిమిది దిక్కులకీ అధిపతులు. క్షీణ చంద్రుడు, రవి, కుజుడు, శని

ఈ నాలుగూ పాపగ్రహాలు. ఈ పాప గ్రహాలతో కలిస్తే బుధుడు కూడా పాపగ్రహమే అవుతాడు. బుధుడు, శని ఇద్దరూ నపుంసకగ్రహాలు. శుక్రుడు, చంద్రుడు ఇద్దరూ స్త్రీ గ్రహాలు మిగిలిన గ్రహాలన్నీ పురుషగ్రహాలు అని తెలుసుకోవాలి.

గ్రహాలలో, గురు-శుక్రులిద్దరూ బ్రాహ్మణవర్ణానికి చెందినవారు కాగా, రవి, చంద్ర, గురులు సాత్వికులు. అలాగే బుధ-శుక్రులిద్దరూ రాజసులు. ఇక మిగిలిన కుజ, శని, రాహు కేతువులు తామసులు.

రవికి - అగ్ని, చంద్రుడికి - జలం, కుజుడికి - కుమారస్వామి, బుధుడికి - శ్రీమహావిష్ణువు, గురువుకి - దేవేంద్రుడు, శుక్రుడికి - శచీదేవి, శనికి - బ్రహ్మ, రాహుకేతువులిద్దరికీ శివుడు అధిదేవతలు.

స్త్రీలకి ప్రతిమాసంలో కలిగే ఋతుధర్మం కూడా కుజ-చంద్రుల ప్రభావంతోనే జరుగుతుంది. చంద్రుడు స్త్రీరాశికి ఇష్టరాశిలో ఉండనప్పుడు, బృహస్పతి చేత చూడబడినప్పుడు ఆ స్త్రీకి పురుషసంయోగం లభిస్తుంది. సప్తమభావంతో పాప గ్రహ యోగం ఉంటే రోషపూర్వకంగా భార్యాభర్తల సంయోగం జరుగుతుంది. అదే సప్తమభావంలో శుభగ్రహ యోగం వుంటే భార్యాభర్తలకి ప్రీతిపూర్వక సంయోగం ఏర్పడుతుంది.

సంయోగకాలంలో పురుషుడికి శుక్రుడు, చంద్రుడు, కుజుడు నవమాంశలో ఉండి, బృహస్పతి కేంద్రంలోకానీ, త్రికోణస్థానంలో కానీ ఉన్నట్లైతే రోగం సంభవిస్తుంది. అలాగే చంద్రుడి నుంచి సప్తమస్థానంలో పై తెలిపిన గ్రహాలు ఉంటే స్త్రీకి రోగం కలుగుతుంది. ఇదేవిధంగా పగలు గర్భాదానం జరిగితే శుక్రుడు సూర్యుడు మాతాపితృగ్రహాలవుతారు. రాత్రిపూట, గర్భాదానం జరిగితే చంద్రుడు - శని మాతృపితృగ్రహాలవుతారు.

పితృగ్రహం విషమరాశిలో ఉంటే తండ్రికి శుభం జరుగుతుంది. అదే మాతృగ్రహం సమరాశిలో ఉంటే తల్లికి క్షేమం కలుగుతుంది.

## గ్రహయోగాలు

* సూర్యుడికి దగ్గర్లో అన్ని గ్రహాలు ఉంటే దాన్ని వర్గదం అంటారు
* లగ్నంలో ఉన్న గ్రహం అస్తంగతుడైతే 'సకటయోగం' అంటారు
* రాజ్య-బంధుస్థానాల్లో గ్రహాలుంటే దాన్ని 'విహగయోగం' అంటారు
* అయిదోస్థానం-ఎనిమిదోస్థానంలో గ్రహాలుంటే అది శృంగాటక యోగం
* లగ్నంకన్నా ఇతర స్థానాల్లో గ్రహాలుంటే అది వర్జయోగం.
* గ్రహాలన్నీ జాతకంలో కలగాపులగంగావుంటే అది కమలయోగం.
* లగ్నంలో నాలుగు గ్రహాలుంటే అది యూపయోగం.
* నాలుగోస్థానంలో నాలుగు గ్రహాలుంటే శరయోగం అంటారు.
* లగ్నాత్ 7-4-2 స్థానాల్లో గ్రహాలుంటే అది శక్తియోగం.
* లగ్నం నుంచి వరుసగా ఏడుస్థానాల్లో గ్రహాలుంటే అది నౌకాయోగం.
* లగ్నంలో మాత్రమే గ్రహాలుంటే అది కూటయోగమవుతుంది.
* స్వస్థానంలో ఉన్నగ్రహం అస్తంగతుడైతే దాన్ని ఛత్రయోగం అంటారు.
* ఇతర స్థానాల్లో గ్రహం అస్తంగతుడైతే దాన్ని అర్ధేందుయోగం అంటారు.
* లగ్నం నుంచి ఒకటి విడిచి తరువాత రాశిలో గ్రహం ఉంటే దాన్ని చక్రయోగం అంటారు.
* సమసప్తరాశుల్లో గ్రహాలుంటే అది వీణాయోగం.
* స్థిరరాశుల్లో అన్ని గ్రహాలూ ఉంటే అది ముసలయోగం.
* కేంద్రంలో సౌమ్యగ్రహాలుంటే దాన్ని బాలయోగం అంటారు.
* కేంద్రంలో పాపగ్రహాలుంటే దాన్ని సర్పయోగం అంటారు.

## యోగాలు - ఫలితాలు

1. **రజుయోగం:** ఇందులో పుట్టినవాడు ఈర్ష్యతో కూడివుంటాడు. ఎక్కువ ప్రయాణాలు చేసే ఆసక్తి కలిగివుంటాడు.
2. **ముసలయోగం :** ఇందులో పుట్టినవాడు ధనం, గౌరవం కలిగినవాడు.

3. **వీణాయోగం:** అన్ని కార్యక్రమాల్లో నైపుణ్యం కలిగినవాడు, గీతనృత్యాలలో ప్రత్యేకమైన అభిలాష కలిగినవాడు.

4. **దామయోగం :** సర్వసంపదలు కలిగి దాతగా ప్రసిద్ధిచెందుతాడు.

5. **పాశయోగం :** ధనవంతుడు–శీలవంతుడు.

6. **కేదారయోగం :** వ్యవసాయం చేయటం మీద ఆసక్తి కలిగిఉంటాడు.

7. **శూలయోగం :** వీరుడు, శూరుడు, తరగని ధనవంతుడు.

8. **గోలకయోగం :** ధనహీనుడు, మలినమైన గుణాలు కలిగినవాడు.

9. **చక్రయోగం :** మహారాజుల చేతకూడా నమస్కరించతగినవాడు.

10. **అర్ధచంద్రయోగం :** సౌందర్యవంతుడు, సుఖపురుషుడు, దీర్ఘాయుష్మంతుడు.

11. **ఛత్రయోగం :** మిత్రులకి ఉపకారం చేసేవాడు.

12. **కూటయోగం :** అసత్యవాది, తేజోవంతుడు, కీర్తిమంతుడు, సుఖి.

13. **యుధయోగం :** త్యాగి, యాగాలుచేసేవాడు, ఇంద్రియనిగ్రహం కలిగినవాడు.

14. **శక్తియోగం :** నీచుడు, అలసుడు, నిర్ధనుడు అవుతాడు.

15. **దండయోగం :** ప్రియులతో ఎడబాటు పొందుతాడు.

16. **కేముద్రుమయోగం :** అపరిశుభ్రంగా వుండేవాడు, దుఃఖితుడు, నీచుడు, నిర్ధనకుడుగా వుంటాడు.

## 27 నక్షత్రాలు - స్వభావాలు

1. **అశ్వినీ :** రూపవంతుడు, ఆభరణాలు ధరించేవాడు.

2. **భరణీ :** సమర్ధుడు, సత్యాలనే మాట్లాడేవాడు.

3. **కృత్తికా :** తిండిప్రియుడు, స్థిరమైన బుద్ధికలవాడు, ప్రియంగా మాట్లాడేవాడు.

4. **రోహిణి :** ధనవంతుడు.

5. **మృగశిరా :** భోగాలనుభవించేవాడు.

6. **ఆర్ద్రా :** హింసాశీలిగా ఉంటాడు. శఠుడు, పాపకారి.

7. **పునర్వసు :** ఇంద్రియనిగ్రహం కలవాడు, రోగి, శుభాలు చేసేవాడు.

8. **పుష్యమి :** మంచికవి, సుఖాలనుభవించేవాడు.

9. **ఆశ్లేషా :** ధూర్తుడు, శరుడు, కృతఘ్నుడు, పాపి, అన్ని పదార్థాలనీ తినేవాడు.

10. **మఘా :** భోగి, ధనవంతుడు, భక్తుడు.

12. **ఉత్తరా :** ధనవంతుడు, భోగాలనుభవించేవాడు.

13. **హస్తా :** చోరత్వగుణం కలిగినవాడు, దుష్టుడు, దైన్యంగాఉండేవాడు.

14. **చిత్తా :** చంచలమైన గుణంకలిగినవాడు, సహృదయుడు.

15. **స్వాతి :** మంచికళ్ళు కలిగినవాడు, చిత్రమైన వస్త్రాలు ధరించేవాడు, అయితే ధర్మాత్ముడు, దయామయుడు కాడు.

16. **విశాఖ :** లోభగుణం, కోపగుణం కలిగినవాడు.

17. **అనూరాధా :** తిరుగుబోతు, విదేశాలకి వెళ్ళేవాడు.

18. **జ్యేష్ఠా :** ధర్మపరుడు, సంతోషంగా జీవించేవాడు.

19. **మూలా :** ధనవంతుడు, అభిమానవంతుడు, సుఖవంతుడు.

20. **పూర్వాషాడా :** అభిమానవంతుడు, సంతోషగుణం కలవాడు, సుఖి.

21. **ఉత్తరాషాఢ :** వినయశీలం కలవాడు, ధార్మికుడు.

22. **శ్రవణా :** ధనవంతుడు, సుఖభోగాలనుభవించేవాడు.

23. **ధనిష్ఠా :** దాత, శూరుడు, ధైర్యవంతుడు, ధనవంతుడు.

24. **శతభిషా :** శత్రువుల్ని జయించేవాడు, వ్యసనపరుడు.

25. **పూర్వాభాద్ర :** స్త్రీలోలుడు, విషయసుఖాలమీద వ్యామోహం కలవాడు.

26. **ఉత్తరాభాద్ర :** మంచివక్త, మంచిప్రియుడు, సుఖాలనుభవించేవాడు.

27. **రేవతి :** పవిత్రుడు, ధనవంతుడు, ధైర్యవంతుడు.

## 12 లగ్నాలు - స్వభావాలు

1. **మేషలగ్నజాతకుడు :** కామి, శూరుడు, కృతజ్ఞుడు.

2. **వృషభలగ్నజాతకుడు :** ఉత్తమప్రియుడు, త్యాగి, ఓర్పుకలిగినవాడు.

3. **మిధునలగ్నజాతకుడు :** స్త్రీలహృదయం, జూదం, శాస్త్రపరిజ్ఞానం కలిగినవాడు.

**4. కర్కాటకలగ్న జాతకుడు :** స్త్రీ స్వభావం కలిగినవాడు, పొట్టివాడు.

**5. సింహలగ్న జాతకుడు :** స్త్రీలని ద్వేషించేవాడు, కోపిష్ఠి, అభిమానవంతుడు, పరాక్రమం, స్థిరమైనబుద్ధికలిగినవాడు.

**6. కన్యాలగ్న జాతకుడు :** ధర్మాత్ముడు, వినయం, మంచి బుద్ధి కలిగినవాడు.

**7. తులాలగ్న జాతకుడు :** తెలివిగలవాడు, పొడగరి, ధనవంతుడు.

**8. వృశ్చికలగ్న జాతకుడు :** అనారోగ్యంతో వుంటాడు, పూజ్యుడు, గాయాలతో ఉంటాడు.

**9. ధనుర్లగ్న జాతకుడు :** కవి, శిల్పశాస్త్రంపై అభిమానం కలవాడు, ధనవంతుడు.

**10. మకరలగ్న జాతకుడు :** సోమరిపోతు, తిరుగుబోతు, మంచికళ్ళుకలవాడు.

**11. కుంభలగ్న జాతకుడు :** ఇతరస్త్రీలని, ఇతరుల ధనాన్ని అపహరించేవాడు.

**12. మీనలగ్న జాతకుడు :** బలవంతుడు, భయస్థుడు.

ఏ లగ్నంలో జన్మించిన వాడైనా లగ్నాధిపతి బలవంతుడైతే జాతకం ఫలవంతంగా వుంటుంది. జాతకంలో చంద్రుడు క్షీణిస్తే విపరీత ఫలితాలు కలుగుతాయి. మేషం నుంచి మీనం వరకు పన్నెండు రాశుల్లో సూర్యుడుండగా జన్మించిన వాడు వరుసగా 1.ఖ్యాతి గలవాడు 2.స్త్రీద్వేషి 3.ధనవంతుడు 4.తీవ్రస్వభావం కలిగినవాడు 5.జ్ఞాని 6.కవి 7.శౌండికుడు 8.ధనవంతుడు 9.పూజ్యుడు 10.లోభి 11.దరిద్రులతో స్నేహం చేసేవాడు 12 బలవంతుడు అవుతాడు.

లగ్నంలో సూర్యుడుండగా జన్మించినవాడు ధనహీనుడు. కుజుడున్నప్పుడు పుట్టినవాడు ధనవంతుడు. చంద్రుడు లగ్నంలో ఉంటే స్వభౌదనుడు. బుధుడు లగ్నంలో ఉంటే కృతజ్ఞుడు. గురువు లగ్నంలో వుంటే కీర్తి ప్రతిష్ఠలు గలవాడు, లగ్నంలో శుక్రుడుంటే ఇతరుల భార్యలపై మమకారం గలవాడుగా ఉంటాడు.

## కాలమానాలు

జ్యోతిశ్శాస్త్రం ప్రకారం కాలమానాలు తొమ్మిది విధాలు 1.బ్రహ్మమానం 2.దేవమానం 3.మనుమానం 4.పితృమానం 5.సౌరమానం 6.సావమానం 7.చాంద్రమానం 8.నక్షత్రమానం 9.గురుమానం. ఈ మానాలన్నీ వ్యవహారాన్ని అనుసరించి వేరువేరు విధాలుగా చెప్పబడతాయి.

సౌరమానాన్ని అనుసరించి అన్ని గ్రహాలనీ అన్ని వారాలనీ గ్రహిస్తారు. సావమానం ద్వారా వర్షవిధానం, స్త్రీల గర్భవిషయం గ్రహిస్తారు. ప్రవర్ధణం, సమగర్భాలు వంటి వాటిని నక్షత్రమానంతో, యాత్రలు, వివాహం, వ్రతాలు, క్షీరం, తిథి, వర్షాధిపతి నిర్ణయం, వాస్తు, ఉపవాసాది విషయాలని చాంద్రమానం ద్వారా గ్రహిస్తారు. ఇక ప్రభవాది సంవత్సర లక్షణాలని గురుమానం ద్వారా తెలియచేస్తారు.

## అరవై సంవత్సరాలు

ప్రభవో విభవశ్శుక్లప్రమోదో ఽథ ప్రజాపతిః
అంగిరాశ్శ్రీముఖో భావో యువా ధాతా తథైవ చ ॥ 1
ఈశ్వరో బహుధాన్యశ్చ ప్రమాధీ విక్రమో వృషః
చిత్రభానుస్సుభానుశ్చ తారణః పార్థివోఽవ్యయః ॥ 2
సర్వజిత్సర్వధారీ చ విరోధీ వికృతః ఖరః
నందనో విజయశ్చైవ జయో మన్మథదుర్ముఖౌ ॥ 3
హేవిలంబో విలంబశ్చ వికారీ శార్వరీ లవః
శుభకృచ్ఛోభనః క్రోధీ విశ్వావసుపరాభవౌ ॥ 4
ప్లవంగః కీలకస్సౌమ్యస్సామాప్తశ్చ విరోధకృత్
పరిభావీ ప్రమాదీ చ ఆనందో రాక్షసోనలః ॥ 5
పింగలః కాలయుక్తశ్చ సిద్ధార్థో రౌద్రదుర్మతీ
దుందుభీరుధిరోద్గారీ రక్తాక్షః క్రోధనః క్షయః ॥ 6

*(శ్లో॥115-120,అధ్యా-56)*

ప్రభవ, విభవ, శుక్ల, ప్రమోద, ప్రజాపతి, అంగిరా, శ్రీముఖ, భావ, యువ, ధాత, ఈశ్వర, బహుధాన్య, ప్రమాధీ, విక్రమ, వృష, చిత్రభాను, సుభాను, తారణ, పార్థివ, అవ్యయ, సర్వజిత్, సర్వధారి, విరోధి, వికృతి, ఖర, నంద, విజయ, జయ, మన్మథ, దుర్ముఖ, హేలంబ, విలంబ, వికారి, శార్వరి, లవ, శుభకృత్, శోభన, క్రోధి, విశ్వావసు, పరాభవ, ప్లవంగ, కీలక, సౌమ్య, సామాప్త, విరోధికృత్, పరిభావి, ప్రమాది, ఆనంది, రాక్షస, నల, పింగళ, కాలయుక్త, సిద్ధార్థ, రౌద్రి, దుర్మతి, దుందుభి, రుధిరోద్గారి, రక్తాక్షి, క్రోధన, జయ అనేవి మొత్తం అరవై సంవత్సరాల పేర్లు. ఈ అరవై సంవత్సరాలు తమ పేర్లకి తగ్గ ఫలాలనే ఇస్తాయి.

శుక్లపక్ష పాద్యమి, షష్ఠితిథినాడు తైలాన్ని, అష్టమినాడు మాంసాన్ని, నవమినాడు కారాన్ని, పౌర్ణమి, అమావాస్య రోజులో స్త్రీ సుఖాన్ని సేవించకూడదు. అలాగే అమావాస్య, షష్ఠి, పాద్యమి, ద్వాదశి, నవమి తిథులలో దంతధావనం చేయకూడదు. వ్యతీపాతదినాలలో, సంక్రాంతి, ఏకాదశి పర్వదినాలలో, ఆదివారం, మంగళవారం, షష్ఠి వైధృతినాడు అభ్యంగనస్నానం చేయకూడదు. దశమినాడు ఉసిరికాయలతో స్నానంచేస్తే పుత్రహాని కలుగుతుంది.

**పూర్ణిమ-అమావాస్యలు :** పగలు చంద్రుడున్న పౌర్ణమిని 'సానుమతి' అంటారు. రాత్రి చంద్రుడున్న పౌర్ణమిని 'రాకా' అంటారు. అలాగే అమావాస్య కూడా రెండు విధాలుగా ఉంటుంది. చంద్రుడున్న అమావాస్యని 'సినీవాలి' అని, చంద్రుడులేని అమావాస్యను 'కుహూ' అని అంటారు. కార్తీక శుక్ల నవమి 'కృతయుగాది' వైశాఖ శుద్ధ తదియ 'త్రేతాయుగాది' మాఘ బహుళ పంచమి 'ద్వాపరయుగాది' అలాగే భాద్రపద బహుళ త్రయోదళి కలియుగాది

**మన్వాదికాలాలు :** 1.కార్తీకశుక్లద్వాదశి 2.ఆశ్వయుజ శుద్ధ నవమి 3.చైత్రశుద్ధ తదియ 4.భాద్రపద శుద్ధతదియ 5.పుష్యశుద్ధఏకాదశి 6.ఆషాఢశుద్ధ దశమి 7.మాఘశుద్ధ సప్తమి 8.భాద్రపద బహుళాష్టమి 9.శ్రావణ అమావాస్య

10.ఫాల్గుణ పూర్ణిమ 11.ఆషాఢ పూర్ణిమ 12.కార్తీక పూర్ణిమ 13.జ్యేష్ఠపూర్ణిమ 14.చైత్రపూర్ణిమ అనే ఈ పద్నాలుగు తిథులూ మన్వంతరాలు ప్రారంభమైన తిథులు. ఇవి పరమపవిత్రమైనవి. ఈ రోజులు శ్రాద్ధానికి చాలా ప్రశస్తమైనవి.

## నక్షత్రాలు - వృక్షాలు

1.అశ్వనీ–వృషవృక్షం 2.భరణీ–యమకర వృక్షం 3.కృత్తికా–మేడిచెట్టు 4.రోహిణీ–నేరేడు చెట్టు 5.మృగశిరా–చంద్రవృక్షం 6.ఆర్ద్రా–నల్లజువ్వి 7.పునర్వసు–వెదురు 8.పుష్యమి–పిప్పలి 9.ఆశ్లేషా–నాగవృక్షం 10.మఘ–మర్రిచెట్టు 11.పుబ్బ–మోదుగ 12.ఉత్తరా–అక్షవృక్షం 13.హస్తా–అరిష్టవృక్షం 14.చిత్తా–శ్రీవృక్షం 15.స్వాతి–మద్దిచెట్టు 16.విశాఖా–వికంతవృక్షం 17.అనూరాధా–పొగడచెట్టు 18.జ్యేష్ఠా–విష్ఠివృక్షం 19.మూలా–సర్జవృక్షం 20.పూర్వాషాఢా–కంజలవృక్షం 21.ఉత్తరాషాఢా–పనసచెట్టు 22.శ్రవణా–జిల్లేడు 23.ధనిష్ఠా–జమ్మిచెట్టు 24.శతభిషా–కదంబవృక్షం 25.పూర్వాభాద్రా–మామిడిచెట్టు 26.ఉత్తరాభాద్రా–వేపచెట్టు 27.రేవతి–ద్రాక్షచెట్టు.

ఈ వృక్షాలన్నీ ఆయా నక్షత్రాల ద్వారా జన్మించాయి. కనుక ఆయా నక్షత్రాలవారు ఆ నక్షత్రానికి చెందిన వృక్షాన్ని ప్రయత్న పూర్వకంగా అర్చించాలి.

## శుకమహర్షి - భాగవతాధ్యయనం

ఒకనాడు పరమయోగీశ్వరుడైన శుకమహర్షి బ్రహ్మమానసపుత్రుడైన సనత్కుమారుడి ద్వారా మోక్షం పొందే విధానాన్ని తెలుసుకున్నాడు. అది తెలుసుకున్న వెంటనే ఆయన వైరాగ్య భావంతో అన్నిటినీ విడిచి బ్రహ్మపదాన్ని అన్వేషించటానికి బయలుదేరాడు. ముందుగా తన తండ్రి వ్యాసమహర్షికి నమస్కరించి అక్కడి నుంచి కైలాసానికి వెళ్ళాడు. వ్యాసుడు పుత్రవిరహంతో పరితపిస్తూ పుత్రా! శుకా! ఆగవయ్యా! ఆగు! అని ఎంత పిలిచినా వినిపించుకోకుండా శుకమహర్షి ముందుకి సాగాడు.

మహనీయుడైన శుకయోగి ఒక పరిశుద్ధ ప్రదేశంలో ఆసీనుడై హస్తపాదాల్ని సవరించుకుని, తన ఆత్మని పరంధామంలోకి చేర్చటానికి ప్రయత్నించాడు.

కొద్ది సేపట్లోనే ఆయనకి ఆత్మసాక్షాత్కారం కలిగింది. అంతలోనే మోక్షమార్గాన్ని పొందేయోగాన్ని అవలంబించి మహాయోగీశ్వరుడై ఆకాశాన్ని అతిక్రమించాడు. గరుత్మంతుడిలా ప్రకాశిస్తూ అంతరిక్షంలో చరిస్తున్న శుకమహర్షిని చూసి దేవతలంతా పూలవాన కురిపించారు. ఎవరీ మహాసిద్ధుడని ఆశ్చర్యంతో చూసారు. అప్పుడు శుకుడు వారందరికీ తన పేరు చెప్పి యోగమార్గంలో ముందుకి సాగిపోయాడు.

పుత్రవిహారంతో పరితపిస్తూ వ్యాసమహర్షి కూడా శుకుణ్ణి వెతుకుతూ వెనకాలే బయలుదేరాడు. అయితే అప్పటికే శుకమహర్షి సర్వ భూతాంతర్గతుడై పరమపదాన్ని చేరుకున్నాడు. పుత్ర విరహంతో రోదిస్తున్న వ్యాసమహర్షిని రుద్రుడు ఓదార్చి వ్యాసా! నీ కుమారుడు ధన్యుడయ్యా! అతడు పరబ్రహ్మ రూపాన్ని ధరించి తిరిగి నీ వద్దకే వస్తాడు బాధపడకు అని చెప్పాడు. ఆ మాటలు విని శాంతించిన వ్యాసుడు తిరిగి తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు. కొంతకాలం తరువాత వ్యాసుడు నరనారాయణులు తపస్సు చేసిన బదరికాశ్రమానికి వెళ్ళి అక్కడున్న గంధమాదన పర్వతం మీద తాను కూడా తపస్సు చేసుకోవటం ప్రారంభించాడు.

పరబ్రహ్మరూపాన్ని పొందిన శుకమహర్షి తన యోగశక్తి ద్వారా సరాసరి శ్వేతద్వీపానికి వెళ్ళాడు. పరంధామమైన ఆ శ్వేతద్వీపంలో దేవదేవుడు, వేదాలచేత అన్వేషించబడేవాడు అయిన జనార్దనుణ్ణి దర్శించాడు. దివ్యతేజస్సుతో కోటిసూర్యుల కాంతితో వెలుగొందుతున్న ఆ నారాయణుణ్ణి దర్శించి భక్తిగా స్తుతించాడు. పరమయోగీశ్వరుడైన శుకమహర్షి స్తుతిని విన్న శ్వేతద్వీప నారాయణుడు ఎంతో సంతోషించి "శుకయోగీ! సనత్కుమారుడు ఉపదేశించిన యోగం ద్వారా నీవు ఎవరూ దర్శించలేని నా శ్వేత ద్వీపానికి వచ్చి నన్ను చూడగలిగావు. ఈ యోగప్రభావంతో నీవు ఏ లోకాన్నైనా చూడగలవు. స్వేచ్ఛగా సంచరించగలవు. వెంటనే వెళ్ళి అన్నిలోకాల్నీ దర్శించి తరించు" అని అన్నాడు. నారాయణుడి మాటలు విన్న శుకమహర్షి ఆయనకి నమస్కరించి అక్కణ్ణుంచి సరాసరి వైకుంఠానికి బయలుదేరాడు.

సకల దేవతల విమానాలతో, వజ్రాలు పొదిగిన బంగారు మెట్లతో ఉన్న ఆ వైకుంఠాన్ని విష్వక్సేనుడి అనుచరులైన కుముదాది ద్వారపాలకులు కాపలా కాస్తున్నారు. అయితే వైకుంఠంలోకి వాయువేగంతో ప్రవేశిస్తున్న శుకమహర్షిని వారు వారించలేక పోయారు. లోపలికి ప్రవేశించిన శుకమహర్షి అక్కడ చతుర్భుజుడు, పీతాంబరధారి, శాంతమూర్తి ప్రసన్నవదనుడు, శంఖచక్ర గదా, పద్మాల్ని ధరించినవాడు, లక్ష్మీదేవిని కౌస్తుభమణిని హృదయం మీద ధరించినవాడు, సకల సిద్ధుల చేత స్తుతించబడేవాడు అయిన శ్రీమన్నారాయణుణ్ణి దర్శించాడు. వైకుంఠనాథుడైన నారాయణుడి దివ్యగుణగణాల్ని ఎంతో తన్మయత్వంతో ఇలా స్తుతించాడు.

## శుకమహర్షి చేసిన శ్రీహరి దివ్యస్తుతి

నమస్తే వాసుదేవాయ సర్వలోకైక సాక్షిణే ॥ 1

జగద్బీజస్వరూపాయ పూర్ణాయ నిభృతాత్మనే
హరయే వాసుకిస్థాయ శ్వేతద్వీపనివాసినే ॥ 2

హంసాయ మత్స్యరూపాయ వరాహతనుధారిణే
నృసింహాయ ధ్రువేజ్యాయ సాంఖ్యయోగేశ్వరాయ ॥ 3

చతుస్సనాయ కూర్మాయ పృథవే స్వసుఖాత్మనే
నాభేయాయ జగద్ధాత్రే విధాత్రేంతకరాయ చ ॥ 4

భార్గవేంద్రాయ రామాయ రాఘవాయ పరాయ చ
కృష్ణాయ వేదకర్త్రే చ బుద్ధకల్కి స్వరూపిణే ॥ 5

చతుర్వ్యూహాయ వేద్యాయ ధ్యేయాయ పరమాత్మనే
నరనారాయణాఖ్యాయ శి పివిష్టాయ విష్ణవే ॥ 6

ఋతధామ్నే విధామ్నే చ సుపర్ణాయ స్వరోచిషే
ఋభవే సువ్రతాఖ్యాయ సుధామ్నే చాజితాయ చ ॥ 7

విశ్వరూపాయ విశ్వాయ సృష్టిస్థిత్యంతకారిణే
యజ్ఞాయ యజ్ఞభోక్త్రే చ స్థవిష్ఠాయాణవే ఽర్థినే ॥ 8

ఆదిత్య సోమనేత్రాయ సహ ఓజో బలాయ చ
ఈజ్యాయ సాక్షిణేఽజాయ బహుశీర్షాం ఘ్రిబాహవే ॥ 9
శ్రీశాయ శ్రీనివాసాయ భక్తవశ్యాయ శార్జిణే
అష్టప్రకృత్యధీశాయ బ్రహ్మణేఽనన్తశక్తయే ॥ 10
బృహదారణ్యవేద్యాయ హృషీకేశాయ వేధసే
పుండరీకనిభాక్షాయ క్షేత్రజ్ఞాయ విభాసినే ॥ 11
గోవిందాయ జగత్కర్త్రే జగన్నాథాయ యోగినే
సత్యాయ సత్యసంధాయ వైకుంఠాయాచ్యుతాయ చ ॥ 12
అధోక్షజాయ ధర్మాయ వామనాయ త్రిధాతవే
ఘృతార్చిషే విష్ణవేతేఽ నంతాయ కపిలాయ చ ॥ 13
విరించయే త్రికమదౌ ఋగ్యజుస్సామరూపిణే
ఏకశృంగాయ చ శుచిశ్రవసే శాస్త్రయోనయే ॥ 14
వృషాకపయే బుద్ధాయ ప్రభవే విశ్వకర్మణే
భూర్భువస్స్వస్వరూపాయ దైత్యఘ్నే నిర్గుణాయ చ ॥ 15
నిరంజనాయ నిత్యాయ హ్యవ్యయాయాక్షరాయ చ
నమస్తే పాహి మామీశ శరణాగత వత్సల ॥ 16

*(శ్లో॥50-65,అధ్యా-62,II పూ.భా)*

"సర్వలోకసాక్షి అయిన వాసుదేవుడికి నమస్కారం. నిత్యుడు, అవ్యయుడు నాశనం లేనివాడు అయిన శ్రీహరికి నమస్కారం. ఓ శరణాగత వత్సలా! లోకనాథా! పరాత్పరా నన్ను రక్షించు" అని ప్రార్థించగానే శరణాగత వత్సలుడైన శ్రీహరి సంతోషించి శుకమహర్షితో....

ఓ యోగీశ్వరా! శుకమహర్షీ! నీవు పూర్వం శ్వేత ద్వీపంలో చూసిన నా రూపం అవతారంకోసం ధరించింది. అక్కడ కొలువున్న విశ్వంభరుణ్ణి నేనే. నీవు నీ యోగశక్తితో సకలలోకాలూ సంచరించే శక్తిని సంపాదించు. నీవు నిత్యముక్త స్వరూపుడివి. అందుకే రాబోయేకాలంలో మానవుల చేత దేవతలచేతా పూజించబడతావు. సర్వ పరాయుణుడినైన నామీద భక్తి కుదరటం దుర్లభం. ఒకసారి భక్త కుదిరాక వారికి సాధించరానిదేదీ ఉండదు.

భూలోకంలో ఉన్న బదరికాశ్రమంలో నరనారాయణులు కల్పాంతం వరకూ తపస్సు చేస్తుంటారు. నీ తండ్రి వ్యాసమహర్షి వారి ఆజ్ఞతో భాగవత పురాణాన్ని రచించాడు. నీవక్కడికి వెళ్ళి ఆ భాగవతాన్ని అధ్యయనం చెయ్యి. ప్రస్తుతం నీ తండ్రి నీ విరహంతో అక్కడున్న గంధమాదన పర్వతం మీద తపస్సుచేస్తున్నాడు. ఆ మహర్షి నాకెంతో ప్రీతిపాత్రుడు. నీవు వెంటనే వెళ్ళి ఆయన్ని సంతోషపరచు" అని పలికాడు. శ్రీహరి ఆదేశానుసారం శుకమహర్షి గంధమాదన పర్వతం మీద ఉన్న తన తండ్రి దగ్గరకి వెళ్ళాడు.

ఎన్నాళ్ళనుంచో ఎదురుచూస్తున్న పుత్రుడు తిరిగి రావటంతో వ్యాసమహర్షి ఎంతో ఆనందించాడు. అక్కడే వున్న నరనారాయణమహర్షులకి నమస్కరించి ఇద్దరూ కలిసి వ్యాసుడి ఆశ్రమానికి వెళ్ళారు. ఆ తరువాత శుకమహర్షి శ్రీహరి ఆజ్ఞప్రకారం తన తండ్రి నుంచి విష్ణుభక్తి ప్రబోధాత్మకమైన భాగవత సంహితని ఎంతో శ్రద్ధగా అధ్యయనం చేసాడు.

## శ్రీ వాసుదేవ ద్వాదశాక్షర మంత్రం

అస్య శ్రీవాసుదేవద్వాదశాక్షర మహామంత్రస్య ప్రజాపతి ఋషిః। గాయత్రీ ఛందః। వాసుదేవో దేవతా। శక్తి బీజం శ్రీవాసుదేవ అనుగ్రహ ప్రసాదసిద్ధ్యర్థం జపేవినియోగః। మంత్రం **"ఓం నమో భగవతే వాసుదేవాయ"**

ఈ మంత్రాన్ని బ్రాహ్మణులు ఓంకార సహితంగా బ్రాహ్మణేతరులు, స్త్రీలు ఓంకారం లేకుండా జపించాలి. 12 లక్షలు ఈ మంత్రానికి పురశ్చరణ చెప్పబడింది.

## శ్రీ వారాహ మంత్రం

అస్య శ్రీవారాహ మహామంత్రస్య భార్గవ ఋషిః । అనుష్టుప్ ఛందః। ఆదివరాహో దేవతా । మమ ఆదివరాహ అనుగ్రహ సిద్ధ్యర్థం జపే వినియోగః।

ఓం ఏకదంష్ట్రాయః హృదయాయ నమః । వ్యోమోల్కాయనమః శిరసే స్వాహా। తేజోధిపతయే శిఖాయైవషట్। విశ్వరూపాయ కవచాయహుం। మహాదంష్ట్రాయ అస్త్రాయ ఫట్- భూర్భువస్సువరోమితి దిగ్బంధః ।

**ధ్యానం :** ఆణహ్రీం స్వర నిభంజాన్వోరధోనాధేప్సితప్రభమ్ ।
ఇష్టాభీతి గదాశంకచక్ర శక్త్యపి ఖేటకాన్ ।
దధతంచ కరైర్దంష్ట్రా గ్రంసద్ధరణింస్మరేత్ ।

**మంత్రం : "ఓం నమో భగవతే వరాహరూపాయ భూర్భువస్స్వః"**

**విధానం :** ఈ వారాహమంత్రాన్ని ఒక లక్షసార్లు జపించి దశాంశం అనగా పదివేలసార్లు పద్మాలు నేతితో కలిపి హోమం చేయాలి. ఈ విధంగా చేస్తే మంత్రం సిద్ధిస్తుంది. శ్రీవరాహస్వామి అనుగ్రహంతో స్వక్షేత్రంలో ఉన్న విరోధులు నశిస్తారు.

**వరాహస్వామి మరోమంత్రం :**

**"ఓం నమో భగవతి ధరణి ధరణి హరే హరే వరాహాయ"**

అస్యశ్రీ వరాహ ఏక వింశత్యక్షరమహామంత్రస్య వరాహ స్వామి ఋషిః। గాయత్రీ ఛందః। ధరణిదేవతా। ఓం బీజం। వసుప్రియాశక్తిః। మమ వరాహస్వామి అనుగ్రహ సిద్ధ్యర్థం జపే వినియోగః।

**ధ్యానం :** శ్యామాం చిత్రవిభూషాఢ్యాం పద్మస్థాం తుంగసంస్తనీమ్ ।
నీలాంబుజద్వయంశాలి మంజరీం చశుకంకరైః ।
దధతీం చిత్రవసనాం ధరాం భగవతీం స్మరేత్ ॥

**పురశ్చరణ :** ఈ మంత్రాన్ని ఒక లక్షసార్లు జపంచేసి దశాశంనేతితో కలిపిన పాయసాన్ని హోమం చేయాలి. ఈ విధంగా మంత్రసాధన చేసినవాడు భూమికి అధిపతి అవుతాడు.

## జగన్నాథుడి త్రైలోక్య మంత్రం

అస్యశ్రీ జగన్నాథ త్రైలోక్య మంత్రస్య జైమిని ఋషిః ।
అమితమనుచ్ఛందః । జగన్మోహనో జగన్నాథః దేవతా ।
క్లీం బీజం। శ్రీం శక్తిః । అఖిలాప్తయే జ పేవినియోగః ।

**ధ్యానం :** శంఖపాశేషు చాపాని ముసలం నందకం గదాం ।
అంకుశందధతం దోర్భిస్లిష్టేకమలయోరపి ।
పశ్యత్యం కంధయాంభోజశ్రియారాగోల్ల సద్దృశా ॥

**మంత్రం :**

"శ్రీకంఠప్రతిరూప లక్ష్మీనివాస సకల జగతోభణ సర్వస్త్రీ హృదయవిదారణ ! త్రిభువన మనోన్మాదకర ! సురాసుర మనుజ సుందరీ జన మనాంసి తాపయ ! తాపయ ! దీపయ ! దీపయ! శోషయ ! మారయ! మారయ ! స్తంభయ ! స్తంభయ ! మోహాయ ! మోహాయ ! ద్రావయ ! ద్రావయ ! ఆకర్షయ! ఆకర్షయ ! సమస్త పరమసుభగ ! సర్వసౌభాగ్యకర ! సర్వకామప్రద ! అముం బ్రహ్మ సేన్ద, హనుమాను చక్రేణ గదయా ఖడ్గేన సర్వబాణైః భేది భేది ! పాశీన కట ! కట! ఆయసేన తాడయ ! తాడయ ! కురు! కురు ! కురు! తావద్యావత్సమా హితం ! మే సిద్ధి రాభాస్యః" *(II,అధ్యా-72)*

**పురశ్చరణ :** రెండు వందల అక్షరాల ఈ మంత్రాన్ని నాలుగు లక్షలసార్లు జపించాలి. దశాంశం 40వేల సార్లు అర్ధచంద్రాకారం కుండంలో పద్మాలతో గానీ, జాతిపుష్పాలతోకానీ హోమం చేయాలి. ఈ విధంగా చేసిన వాడికి ముల్లోకాలనీ ఆకర్షించే శక్తి కలుగుతుంది. అలాగే సకలజన వశీకరణ చేసే శక్తి కూడా ప్రాప్తిస్తుంది.

## శ్రీనృసింహ సహస్రాక్షరీ మంత్రం

"క్రోధమూర్తే ! నృసింహా! మహాపురుష ! ప్రధాన ధర్మా ధర్మనిగడ నిర్మోచన! కాలపురుష ! కాలాన్తకసదృక్ స్వేశ్వరాదృక్ జలశ్రాంత నివిష్ట ! చైతన్య చిత్సదాభాసక! కాలాద్యతీత ! నిత్యోదిత ! ఉదయాస్తమయా క్రాంతమహాకారుణిక ! హృదయాబ్జ చతుదిల నివిష్టిత ! చైతన్యాత్మన్ ! చతురాత్మన్ ! ద్వాదశాత్మన్ ! చతుర్వింశాత్మన్! పంచ వింశాత్మన్! ఓం! హరిసహస్రమూర్తే ! ఏహ్యేహి ! భగవన్నృసింహపురుష ! క్రోధేశ్వర రస ! సహస్రనందితపాద! కల్పాన్తాగ్ని సహస్రకోట్యాభ ! మహాదేవనికాయ! దశశత యజ్ఞతల ! అమల అమల పింగలేక్షణ ! సహస్ర దంష్ట్ర ! దంష్ట్రాయుధ ! నఖాయుధ ! దానవేంద్రాంతక ! వహ్ని వర్ణ శోణిత ! సంసక్తి విగ్రహా ! భూతాపస్మార యాతు ధాన సురాసుర వంద్యమాన పాద పంకజ ! భగవాన్ ! వ్యోమచక్రచర ! ప్రభవాప్యయ రూపేణోత్తిష్ఠోతిష్ఠ! అవిద్యానిచయం దహ దహ! జ్ఞానైశ్వర్యం ప్రకాశయ! ప్రకాశయ ! ఓం సర్వజ్ఞ ! అరోష జంభా జృంభ్యవతారక ! సత్యపురుష ! సదసన్మధ్యనివిష్ట!

మమ దుస్స్వప్నభయం నిగడ భయం కాంతారభయం విషజ్వర ఢాకినీ కృత్యాధ్వ రేవతీ భయం, అశనిభయం, దుర్భిక్షభయం, మారీ భయం మారీచ భయం, ఛాయాస్కందాపస్మార భయం, చౌరభయం, జలస్వప్నాగ్ని భయం, గజసింహభుజంగ భయం, జన్మజరామరణ భయం నిర్మోచయ, ప్రశమయ, జ్ఞేయ రూప ధారణ నృసింహో బృహత్సామ పురుష సర్వభయ నివారణ అష్టాష్టక చతుష్షష్టి చేటికాభయం, విద్యావృతస్త్రయస్త్రింశద్దేవతా కోటి నమిత పదపంకజ సహస్రవదన సహస్రోదర సహస్రేక్షణ సహస్రపద, సహస్రభుజ సహస్ర జిహ్వా సహస్రలలాట సహస్రాయుధధర నమః ప్రకాశక పురమథన సర్వమన్త్ర రాజేశ్వర విహాయసగతి ప్రద పాతాలగతిప్రద యంత్ర మర్దన ఘోరాట్టహాసహసిత విశ్వావాస వాసుదేవ అక్రూర హయముఖ పరమహంస విశ్వేశ విశ్వవిడంబన నివిష్ట ప్రాదుర్భావకారక హృషీకేశ స్వచ్ఛన్ద నిశ్శేషజీవగ్రాసక మహాపిశితా సృక్ లింపట ఖేచర సిద్ధి ప్రదాయక అజేయ అవ్యయ అవ్యక్త బ్రహ్మాండోదర బ్రహ్మసహస్ర కోటి స్రగ్గుండ మూలపండిత ముండ మత్స్య కూర్మ వరాహ నృసింహవామన త్రైలోక్యాక్రమణ పాదశాలిక రామత్రయ విష్ణురూపధర తత్త్వత్రయ ప్రణవాధార తచ్ఛిఖానివిష్ట స్వాహాస్వధావషట్" *(II,అధ్యా-73)*

**గమనిక :** (ఈ మంత్రాలని గురూపదేశంతోనే ఉపాసించాలి)

## శ్రీసుదర్శన మంత్రం

"సుదర్శన మహాచక్ర రాజేశ్వర దుష్టాంతక దుష్టభయానక దుష్టభయంకర ఛింది ఛింది। భింది భింది। విదారయ విదారయ। పరమంత్రాన్ గ్రసగ్రస। భక్షయ భక్షయ। త్రాసయ త్రాసయ। స్వాహా"

## శ్రీరామ మంత్రాలు

1. ఓం నమో భగవతే రఘునందనాయ రక్షోఘ్న విశదాయ, మధురప్రసన్న వరదానాయ అమితతేజసే బాలాయ రామాయ విష్ణవే నమః
2. ఓం రామ చంద్రాయనమః
3. ఓం రామభద్రాయ నమః
4. రామాయధనుష్పాణయే స్వాహా
5. ఓం నమో భగవతే రామచంద్రాయ
6. ఓం నమో భగవతే రామభద్రాయ

7. ఓం నమోభగవతే రామాయ మహాపురుషాయ నమః

8. ఓం నమో సీతాపతయే రామాయ హనహన హుం ఫట్ స్వాహా

9. ఓం నమో కమలా రామభద్ర మహేష్వాస రఘువీర నృపోత్తమ దశాస్యాంతక మాం రక్ష దేహి పరమాం శ్రియం।

10. ఓం రమా రామా దశరథాయ నమః

11. ఓం రామచంద్రాయ స్వాహ 12. రామభద్రాయ స్వాహా

13. ఓం రామాయ హుంఫట్ స్వాహా 14. భరతాగ్రజరామ మనోభవ స్వాహా

15. ఓం నమ స్సీతాపతయే రామాయ హనహనఫట్

16. ఓం నమో బ్రహ్మణ్య సేవ్యాయ రామాయ అకుంఠ తేజసే ఉత్తమశ్లోక ధుర్యాయ

17. దాశరథాయ విద్మహే సీతావల్లభాయ ధీమహి। తన్నో రామః ప్రచోదయాత్

18. పద్మాసీతాయై ఫట్ 19.ఓం లక్ష్మణాయ నమః*(అధ్యా-73)*

**గమనిక :** (పై తెలిపిన మంత్రాలన్నీ గురువుద్వారా ఉపదేశం పొంది మాత్రమే ఉపాసించాలి. రామమంత్రోపాసన చేసే వారు ముందుగా లక్ష్మణ మంత్రాన్ని విధిగా 108 సార్లు జపించాలి)

## శ్రీహనుమాన్ మంత్రాలు

1. శ్రీహనుమాన్ మాలామంత్రం

"ఓం నమో హనుమతే ప్రకట పరాక్రమ ! అక్రాంత దిజ్మండల యశోవితాన ! ధవళీకృత జగత్త్రితయ ! వజ్రదేహ! జ్వలదగ్ని సూర్యకోటి సమప్రభ తనూరుహ ! రుద్రావతార ! లంకాపురీ దహన ! ఉదధిలంఘన ! దశగ్రీవశిరః కృతాంతక ! సీతాశ్వసన ! వాయుసుత ! అంజనాగర్భసంభూత! శ్రీరామలక్ష్మణాన్విత ! నందంతికర ! సైన్యప్రాకార ! సుగ్రీవసఖ్యక ! రణవాలిని బర్హణ కారణ ! ద్రోణ పర్వతోత్పాటన ! అశోక వనవీధీ దారణ ! అక్షకుమారకచ్ఛేదన ! వనరక్షకరసమూహవిభంజన ! బ్రహ్మాస్త్ర బ్రహ్మశక్తి గ్రస ! లక్ష్మణ శక్తి భేద నివారణ ! విశల్యోషధి సమానయన ! బాలోదిత

భానుమండల గ్రసన ! మేఘనాథ హోమ విధ్వంసన ! ఇంద్రజి ద్వధ కారణ! సీతా రక్షక ! రాక్షసీ సంఘ విదారణ ! కుంభకర్ణాది వధ పరాయణ ! శ్రీరామ భక్తి తత్పర సముద్ర వ్యోమద్రుమ లంఘన ! మహాసామర్థ్య ! మహాతేజఃపుంజ విరాజమాన ! స్వామి వచన సంపాదితార్జున సంయుగ సహాయ ! కుమార బ్రహ్మచారిన్ ! గంభీరోదయ దక్షిణాపథ మార్తాండ ! మేరు పర్వత పీఠి కార్చన! సకల మంత్రమ ! ఆచార్య ! మమ సర్వగ్రహ వినాశన ! సర్వజ్వరోచ్చాటన! సర్వవిష వినాశన ! సర్వాపత్తి నివారణ ! సర్వదుష్ట నిబర్హణ ! సర్వవ్యాధ్యాది భయ నివారణ ! సర్వశత్రుచ్ఛేదన ! మమ పరస్యచ త్రిభువన పుంస్త్రీ నపుంసకాత్మక సర్వజీవ జాతం వశయ! వశయ! మమాజ్ఞాకారకం సంపాదయ! సంపాదయ!" అని పఠించి నానా నామధేయములు గల సర్వరాజులను పఠించవలయును. "పరివారాన్ మమ సేవకాన్ కురు కురు సర్వశాస్త్రాస్త్రవిషాణి విధ్వంసయ! విధ్వంసయ!" తరువాత లజ్జా దీర్ఘత్రయో పేతమగు హోత్రయమును ఏహిద్వయమును, పంచకూటములను విలోమముగా నుచ్చరించి "సర్వశత్రూన్ హన! హన! పరబలాని పరసైన్యాని క్షోభయ! క్షోభయ ! మమ సర్వకార్యజాతం సాధయ సాధయ ! సర్వదుష్టదుర్జన ముఖాని కీలయ! కీలయ!" అని పలికి తరువాత ధౌత్రయమును వర్మత్రితయమును, ఫట్త్రయమును, హాం త్రయమును, పలికి "స్వాహా" అనాలి. *(అధ్యా. 74-2)*

*(పై తెలిపిన మంత్రమును గురుముఖతః తెలుసుకొని జపించాలి)*

2. నమో భగవతే అనంతచంద్ర శేఖరాంజనేయాయ మహాబలాయ స్వాహా
3. శ్రీహనుమతే రుద్రాత్మకాయ స్వాహా
4. శ్రీపవన నందనాయ స్వాహా
5. ఓం నమోభగవతే ఆంజనేయాయ శృంఖలాం త్రోటయత్రోటయ బంధమోక్షం కురుకురు స్వాహా
6. ఓం నమో ఆంజనేయాయ
7. ఓం నమో హనుమతే జాఠరదన క్షోభం సంహర సంహర। ఆత్మతత్త్వం ప్రకాశయ ప్రకాశయ। హుంఫట్ స్వాహా।

8. శ్రీ ఆంజనేయమాలా మంత్రం

"ఓం వజ్రకాయ! వజ్రతుండ! కపిల! పింగల! ఊర్ధ్వకేశ! మహాబల! రక్తముఖ! తడిజ్జిహ్వా! మహారౌద్రదంష్ట్ర! ఉత్కటం వహ! వహ! కరాల! మహాదృఢ ప్రహారేణ లంకేశ్వరవధాత్ వాయు మహాసేతుబంధ! మహాశైల ప్రవాహ గగనే చర ! ఏహ్యేహి ! భగవన్మహాబల పరాక్రమ ! భైరవ! అజ్ఞాపయ! ఏహ్యేహి! మహారౌద్ర ! దీర్ఘపుచ్ఛేన వేష్టేయ వైరిణమ్. జంభయ జంభయ! హుంఫట్"

*(అధ్యా. 74-3)*

## కార్తవీర్యార్జున గాయత్రీ మంత్రం

**కార్తవీర్యాయ విద్మహే మహావీర్యాయ ధీమహి తన్నోర్జునః ప్రచోదయాత్ ।**

*(ఈ మంత్రాన్ని రాత్రిపూట జపిస్తే దొంగలభయం ఉండదు)*

## కార్తవీర్యార్జున మహాకవచం

ఈ కవచముచే కార్తవీర్యార్జునుడు ప్రసన్నుడై కార్యసిద్ధిని ప్రసాదించును. సహస్ర సూర్యసన్నిభము, నానారత్నసముజ్జ్వలము, ప్రకాశించు ధ్వజపతాక యుతము, దశసహస్ర తురగ భూషితము, ప్రళయకాల సముద్ర భయఘోష వలె ధ్వనించేది, మహాఛత్రములచే వితానముగా చేయబడిన ఆకాశము గలది, నానాయుధ విరాజితము అగు మహారథవరమున చక్కగా కూర్చొని వున్నవాడు, విపులోదారుడు, సహస్రభుజమండితుడు వామ బాహువులచే ఉద్దండమగు కోదండములను, దక్షిణబాహువులచే శరములను ధరించి వున్నవాడు, కిరీటహారముకుట కేయూర వలయాంగదముద్రికోదర బంధాదులచే, మౌంజీనూపురకాదులచే భూషితుడు, వివిధ కల్పములు భాస్వరములు అగు మహాధనములచే అబద్ధకవచుడు, వీరుడు. సుప్రసన్నాన నాంబుజుడు ధనుర్జ్యాసింహనాదములచే జగత్త్రయమును కంపింప చేయుచున్నవాడు, సర్వశత్రుక్షయకరుడు, సర్వసంపత్ప్రదాత, విజయశ్రీ నిషేవితుడు, సర్వసౌభాగ్యప్రదుడు, భద్రుడు, భక్తాభయవిధాయి, దివ్యమాల్యాను లేపాఢ్యుడు, సర్వలక్షణసంయుతుడు, రథగజ అశ్వపాదాత బృందమధ్యగతుడు, ఈశ్వరుడు,

వీరదుడు, చక్రవర్తి, సర్వలోకైక పాలకుడు, సమానోదిత సాహస్ర దివాకర సమప్రభుడు, మహాయోగ భవైశ్వర్యకీర్త్యాక్రాంత జగత్త్రయుడు, శ్రీహరి చక్రాంశగా అవతరించినవాడు అగు కార్తవీర్యార్జునుని చక్కగా ఆత్మాదిభేదముచే ధ్యానించి రక్షను పలుకవలెను.

కార్తవీర్యార్జునుని అయిదు అంగమూర్తులు స్ఫటికోజ్జ్వలులు నన్ను రక్షింతురు గాక ! ఆగ్నేయ ఈశాన్యనైఋతి వాయువ్య కోణములందు హృదయాదికములు, అంతట అస్త్రజ్వలద్రూపులు శంఖ చర్మ ఖడ్గపాణులు అవ్యాహత బలైశ్వర్య శక్తి సామర్థ్య విగ్రహులు కాపాడుదురు గాక ! క్షేమంకరీ శక్తియుతుడు చోరగర్వభంజకుడు, బాణధనుర్ధారియగు కార్తవీర్యార్జునుడు తూర్పుదిక్కున నన్ను కాపాడు గాక ! శ్రీకరీశక్తిసహితుడు మారీ భయవినాశకుడు, శరచాపధరుడు శ్రీమంతుడు సర్వశత్రు వినాశకుడు మహేషుచాపధరుడు పశ్చిమ దిక్కును కాపాడుగాక ! యశఃకరీయుతుడు, దైత్యసంఘవినాశకుడు ఆగ్నేయకోణమును కాపాడు గాక ! విద్యాకరీ సమాయుక్తుడు మహద్దుఃఖనాశకుడు, చాపపాణియగు ఈశ్వరుడు నైఋతి దిక్కును కాపాడు గాక ! ధనకరీ సమాయుతుడు మహాదురిత నాశకుడు ధనుర్బాణధారి వాయవ్యదిశను కాపాడు గాక ! ఆయుఃకరీయుతుడు, శ్రీమంతుడు, మహాభయ వినాశకుడు చాపేషుధరుడు ఈశాన్యదిక్కును కాపాడు గాక !

విజయ శ్రీయుతుడు చక్రధారి, విభువు, సర్వదుష్టభయంకరుడు ఊర్ధ్వదిక్కును కాపాడు గాక ! సుమహాశక్తి సంయుతుడు, శంఖధారి అధర దిక్కును కాపాడు గాక ! మహాయోగ సమాయుక్తుడు సర్వదిక్చక్రమండలుడు, మహాయోగీశ్వరుడు, పద్మధారి అంతటా కాపాడు గాక ! ఈ మూర్తులు రక్తవర్ణులు రక్తమాల్యాంబర ధారులు, ప్రధాన దేవతారూపులు విడిగా రథమున నుందురు. శక్తులు పద్మహస్తులు నీలేన్దీవర సన్నిభులు శుక్లమాల్యాంబరధారులు చక్కగా అలదిన చందనము కలవారు, వారి పార్శ్వదేశ్వరులు స్వస్వవాహన ఆయుధభూషణ ధారులు, తమ తమ దిక్కులలో ఉన్నవారు మహాబలులగు ఇంద్రాదులు నన్ను కాపాడు గాక !

వీరందరు కార్తవీర్యార్జునుని ఆవరణ దేవతలు. సర్వశక్తి సమన్వితులు అంతటా అన్ని వేళలా నన్ను కాపాడు గాక ! హృదయమున, ఉదరమున, నాభియందు, గుహ్యమండలమున తేజోరూపులుగా నుండు అభీష్ట కల్పవృక్షములు కాపాడు గాక ! మహావర్ణులు మన్త్రరూపులు మహోజ్జ్వలులు వ్యాపకముగా ఆపాదతల మస్తకముగా నన్ను కాపాడు గాక ! కార్తవీర్యుడు శిరమును, హైహయేశ్వరుడు లలాటమును, సుముఖుడు ముఖమును, వ్యాప్తజగత్త్రయుడు కర్ణములను కాపాడుగాక ! సుకుమారుడు హనువును భ్రూయుగమును ధనుర్ధరుడు, నయనమును పుండరీకాక్షుడు నాసికను గుణాకరుడు, అధరోష్ఠమును బ్రహ్మజ్ఞేయుడు, దంతములను కవి కాపాడు గాక ! సర్వశాస్త్రకలాధారి జిహ్వను, అవ్యయుడు చిబుకమును, సర్వార్ధదుడు, కరములను, జగత్ప్రియుడు కరాగ్రములను, రేవాంబులీలాదృప్తుడు జఠరమును, వీరుడు శూరుడు నాభిని, సర్వదుష్టహరుడు పార్శ్వములను కాపాడుగాక ! సహస్రభుజధరుడు పృష్టమును, సప్తద్వీపాధిపతి కటిని, ఊరువులను మాహిష్మతీనాధుడు, జానువులను భూవల్లభుడు, వీరాధిపుడు జంఘములను, పాదములను మనోజవుడు, సర్వాయుధధరుడు సర్వాంగములను సర్వమర్మములందు కాపాడు గాక ! ధాత్వష్టక సహిత కలేవరమును సర్వాదుష్టాంతకుడు, ప్రాణాదిశజీవేశులను సర్వశిష్టేష్టదుడు, జితేంద్రియుడు సర్వేంద్రియములను, ఇంకా చెప్పని స్థానములను శరీరాంతర్బహిర్భాగములను సర్వలోక నాధేశ్వరేశ్వరుడు కాపాడుగాక ! ఈ కవచముచే అవృతమైన ఈ శరీరము వజ్రము కంటె సారతరము బాధాశత వినిర్ముక్తమగు గాక ! భయరహితమగు గాక !

ఇట్లు అభేధ్యమగు కార్తవీర్యార్జునుని కవచమును ధరించి దివారాత్రములు నిర్భయమగు అంతరాత్మతో తిరుగుచున్నాను. రాజమార్గమున, మహాదుర్గమున, చోరసంకులమగు మార్గమున విషమారణ్యమున, ఘోర దవాగ్నియందు, గిరిగుహలందు, సంగ్రామమున, శస్త్రసంఘాతమున, సింహవ్యాఘ్రుని షేవితమగు గిరిగుహలందు, సర్వసంకీర్ణమగు సంధ్యాకాలమున, నృపాలయమున, వివాదమున, విపులావర్తములుగల సముద్రమున, నదీతటమున,

పరిపుంథిజనాకీర్ణమగు, దేశమున, చోరగుణావృతమగు దేశమున, సర్వ స్వహరణము సంభవించినపుడు, ప్రాణసంకటము సంభవించినపుడు, నానారోగజ్వరావేశమున, పిశాచప్రేత యాతనలు సంభవించినపుడు, మారీదుస్స్వప్నపీడలందు, క్లిష్టసమయమున, విశ్వాసఘాతకులు ఎదురైనపుడు, శారీర దుఃఖము, మానస దుఃఖము మహాజ్వరము సంభవించినపుడు, ఆదివ్యాధి భయములుత్పన్నమైనపుడు, విఘ్నజ్వాలోపద్రవములు సంభవించినపుడు కూడా కవచములో బద్ధుడైన వానికి ఏ భయము కలుగదు.

మాకు రాబోవు ద్రవ్యాపహారకులను మహారథుడు బాహుసహస్రములచే నివారించు గాక ! కార్తవీర్యార్జునుడు తమ చేతులలోని పాశములచే బంధించి దుర్జయుల గతి సామర్థ్యము నరికట్టు గాక ! బాణసాహస్రముచే ఛేదించు గాక ! రాజచూడామణి నా శత్రువులను ఖడ్గ సహస్రములచే ఛేదించు గాక! చోరాది దుష్టప్రాణి సమూహములను ముసలసహస్రములచే భేదించు గాక ! అట్లే స్వశంఖనాదముచే సహస్ర బాహువు చక్రధారి భయపెట్టు గాక ! సాక్షాత్తు శ్రీహరి యవతారమగు కార్తవీర్యుడు నా సమస్తమును కాపాడు గాక ! ఓ కార్తవీర్యా! మహావీర్యా! సర్వదుస్ట వినాశన! అన్ని వేళలా అంతటా దుష్టులను చోరులను నశింపచేయుము. *(అధ్యా-77)*

## కార్తవీర్యార్జున అష్టోత్తర శతనామాలు

కార్తవీర్యార్జునుడు, ధన్వి, రాజేన్ద్రుడు, హైహయేశ్వరుడు, దశాస్యదర్పహంత, రేవాలీలాదృప్తుడు, సుదుర్జయుడు, దుఃఖహా, చోరదమనుడు, రాజరాజేశ్వరుడు, ప్రభువు, సర్వజ్ఞుడు, సర్వప్రదుడు, శ్రీమంతుడు, సర్వశిష్టేష్టదుడు, కృతీ, రాజచూడామణి, యోగి, సప్తద్వీపాధినాయకుడు, విజయి, విశ్వజిత్, వాగ్మి, మహాగతి, అలోలుపుడు, యజ్వ, విప్రప్రియుడు, విద్వాన్, బ్రహ్మజ్ఞేయుడు, సనాతనుడు, మాహిష్మతీ, పతి, యోధా, మహాకీర్తి, మహాభుజుడు, సుకుమారుడు, మహావీరుడు, మారీఘ్నుడు, మదిరేక్షణుడు, శత్రుఘ్నుడు, శాశ్వతుడు, శూరుడు, శంఖభృత్, యోగి వల్లభుడు, మహాభాగవతుడు,

ధీమంతుడు, మహాభయవినాశకుడు, అసాధ్యుడు, విగ్రహుడు, దివ్యుడు, భావుడు, వ్యాప్తజగత్త్రయుడు, జితేంద్రియుడు, జితారాతి, స్వచ్ఛందుడు, అనన్త విక్రముడు, చక్రభృత్, పరచక్రఘ్నుడు, సంగ్రమ విధిపూజితుడు, సర్వశాస్త్రకలాధారీ, విరజస్కుడు, లోకవందితుడు, వీరుడు, విమలసత్త్వాఢ్యుడు, మహాబలపరాక్రముడు, విజయశ్రీమహామాన్యుడు, జితారి, మంత్రనాయకుడు, ఖడ్గభృత్, కామదుడు, కాంతుడు, కాలఘ్నుడు, కమలేక్షణుడు, భద్రవాద ప్రియుడు, వైద్యుడు, విబుధుడు, వరదుడు, వశి, మహాధనుడు, నిధిపతి, మహాయోగి, గురుప్రియుడు, యోగాఢ్యుడు, సర్వరోగఘ్నుడు, రాజితాఖిల భూతలుడు, దివ్యాస్త్రభృత్, అమేయాత్మా, సర్వగోప్తా, మహోజ్జ్వలుడు, సర్వాయుధధరుడు, అభీష్టప్రదుడు, పరపురంజయుడు, యోగసిద్ధుడు, మహాకాయుడు, మహాబృన్దశతాధిపుడు, సర్వజ్ఞానిధి, సర్వసిద్ధి దానకృతోద్యముడు అని ఇవి కార్తవీర్యార్జునుడి అష్టోత్తర నామములు. *(అధ్యా-77)*

మహాప్రభావవంతమైన కార్తవీర్యార్జునుడి కవచాన్ని శ్రద్ధగా పఠిస్తే సకల శుభాలూ జరుగుతాయి. రాత్రిపూట పడమరవైపు తిరిగి ఏడుసార్లు ఏడురోజులు ఈ కవచాన్ని పఠిస్తే దొంగలు దోచుకున్న ద్రవ్యం తిరిగి దొరుకుతుంది. మూడులేక అయిదుసార్లు ఈ స్తోత్రాన్ని పఠిస్తే వ్యాధులు తగ్గిపోతాయి.

## కార్తవీర్యుడి ద్వాదశనామ స్తోత్రం

కార్తవీర్యః బలద్వేషీ కృతవీర్యసుతో బలీ ।
సహస్ర బహుశ్శతృఘ్నో రక్తవాసాధనుర్ధరః ॥ 1
రక్తగంధో రక్తమాల్యో రాజాస్మర్తురభీష్టదః ।
ద్వాదశైతాని నామాని కార్తవీర్యస్వయః పఠేత్ ॥ 2

*(శ్లో॥133-134,అధ్యా-77)*

1.కార్తవీర్యుడు 2.ఖలద్వేషి 3.కృతవీర్యసుతుడు 4.బలీ 5.సహస్రబాహువు 6.శత్రుఘ్నుడు 7.రక్తవాసుడు 8.ధనుర్ధరుడు 9.రక్తగంధుడు 10.రక్తమాల్యుడు

11.రాజు 12.స్మార్తాభీష్టుడు అనేవి కార్తవీర్యార్జునుడి దివ్యనామాలు. వీటిని పఠించేవారికి సర్వ సంపదలు కలుగుతాయి.

## శ్రీ ఆంజనేయ కవచం

భుక్తి ముక్తి ప్రదమగు ఈ ఆంజనేయకవచమును శ్రీరాముడు చెప్పెను. తూర్పుదిక్కున హనుమంతుడు, దక్షిణమున పవనాత్మజుడు, పశ్చిమమున అక్షఘాతకుడు, ఉత్తరమున సాగరతారకుడు కాపాడుగాక ! ఊర్ధ్వభాగమున కపిశ్రేష్ఠుడు, కేసరి ప్రియనందనుడు, అధోభాగమున విష్ణుభక్తుడు, మధ్యభాగమున పావని కాపాడు గాక ! అన్నివేళలా అన్ని ఆపదల నుండి లంకా దాహకుడు కాపాడు గాక ! మస్తకమును సుగ్రీవసచివుడు, వాయునందనుడు ఫాలమును, మహావీరుడు భ్రూమధ్యమును, నేత్రములను ఛాయాపహర్షి ప్లవగేశ్వరుడు కాపాడుగాక ! కపోలములను, కర్ణమూలమున శ్రీరామకింకరుడు, నాసాగ్రమును అంజనాసూనుడు, వక్త్రమును హరీశ్వరుడు, కంఠమును దైత్యారి, స్కంధమును రాక్షసజిత్, భుజములను మహాతేజస్కుడు, కరములను చరణాయుధుడు, నఖములను నఖాయుధుడు, కుక్షిని కపీశ్వరుడు, వక్షస్థలమును ముధాపహారి, పార్శ్వములను భుజాయుధుడు కాపాడు గాక! పృష్ఠదేశమును లంకావిభంజకుడు, నాభిని శ్రీరామ భక్తుడు, కటిని అనిలాత్మజుడు, గుహ్యమును మహాప్రాజ్ఞుడు, సక్థులను అతిథిప్రియుడు, ఊరువులను, జానువులను లంకాప్రాసాదభంజనుడు, జంఘలను కపిశ్రేష్ఠుడు, గుల్ఫములను మహాబలుడు, పాదములను అచలోద్ధారకుడు, అంగములను భాస్కర సన్నిభుడు, పాదాంగుళులను సత్త్వాఢ్యుడు కాపాడు గాక ! ముఖాంగములను మహాశూరుడు, రోమములను ఆత్మవంతుడు, దివారాత్రములలో, త్రిలోకములలో సదాగతిసుతుడు కాపాడు గాక! నిలుచున్న వానిని, నడుచుచున్న వానిని, కూర్చునియున్నవానిని, తినుచున్నవానిని కపి కాపాడుగాక !. లోకోత్తర గుణుడు, శ్రీమంతుడు, త్ర్యంబకసంభవుడు, ప్రమత్తుని, అప్రమత్తుని, నిద్రించువానిని, అరణ్యమున జలమున, స్థలమున, అంతరిక్షమున, అగ్నియందు, పర్వతమున, సాగరమున, వృక్షములలో, సంగ్రామమున, ఘోరసంకటము నందు, విరాడ్రూపధరుడు కాపాడు గాక ! ఢాకినీ శాకినీ మారీ కాలరాత్రి మరీచికల నుండి నిద్రించుచున్న నన్ను పిశాచోరగరాక్షసులనుండి విభువు కాపాడుగాక !

నన్ను అంతటా, దివ్యదేహధరుడు, ధీమంతుడు, సర్వసత్త్వభయంకరుడు, సాధకేంద్రావనుడు నన్ను అంతటా కాపాడుగాక! భయానకసత్త్వములు చూచి భయపడు సర్వరూపములను ధరించువాడు, సర్వజ్ఞుడు, సృష్టి స్థితికరుడు కాపాడు గాక !

స్వయం బ్రహ్మ, విష్ణువు, స్వయం సాక్షాత్తుగా మహేశ్వరుడు సూర్యమండలగతుడు, శ్రీప్రదుడు నన్ను కాలత్రయమున కాపాడు గాక ! హనుమంతుని ధ్వనిని విని దైత్యదానవరాక్షసులు దేవతలు మనుష్యులు తిర్యగ్జంతువులు, స్థావర జంగమములు భయము కలవి భయము తొలగినవి యగును. ప్రతి కల్పమునందు హనుమంతుని అనేక కథలు పవిత్రములు వినబడుచుండును. అట్టి రామపరాయణుడు సాధక శ్రేష్ఠుని కాపాడు గాక ! వైధాత్రధాత్ృ ప్రభృతులుగా ఈ ప్రపంచమున కనపడునదంతయు కేశరూపముచే వ్యాపించబడియున్నది. ఆ ప్రభువు నేను, ఈ నేను స్వీయుడను, స్వయముగా అణువు, బృహత్, ఋగ్యజుస్సామరూపుడు ప్రణవము, తివృత్, అధ్వరము, అస్వరూపుడు, సర్వరూపుడగు కపీశ్వరుని ఆత్మసమాధిచే నమస్కరించుచున్నాను. అనేకానన్త బ్రహ్మాండ ధారి, బ్రహ్మస్వరూపి, సమీర స్వరూపి, ఆత్మ స్వరూపి యగు వానికి నమస్కారము, హనుమంతునికి, మారుత పుత్రునికి నమస్కారము.

శ్రీరామ భక్తునకు శ్యామునకు, మహాత్మునకు నమస్కారము. వానర వీరునకు, సుగ్రీవసఖ్యకారకునకు, లంకా విదాహకునకు, మహాసాగర తారకునకు, సీతాకోక వినాశకునకు, రామముద్రాధరునకు రావణాంత నిదానమునకు సర్వోత్తరాత్మకు నమస్కారము. మేఖ నామద ఖధ్వంసకారణునకు, అశోకవన విధ్వంసకారికి, జయదాయికి, వాయుపుత్రునకు, వీరునకు, ఆకాశోదరగామికి, వనపాల శిరచ్ఛేత్తకు, లంకాప్రాసాదభంజకునకు నమస్కారము. జ్వలత్కాంచన వర్ణునకు, దీర్ఘలాంగూలధారికి, సౌమిత్ర జయదాతకు, రామదూతకు నమస్కారము. అక్షవధకారికి, బ్రహ్మాస్త్ర నివారకునకు, లక్ష్మణాంగ మహాశక్తి జాత క్షత వినాశికి, రక్షోఘ్నునకు, రిపుఘ్నునకు, భూతఘ్నునకు నమస్కారము. ఋక్షవానరవీరౌఘ ప్రాసాదునకు పరసైన్యబలఘ్నునకు, శస్త్రాస్త్రఘ్నునకు, విషఘ్నునకు, విషఘ్నునకు, ద్విషఘ్నునకు, భయఘ్నునకు నమస్కారము. మహాభయఘ్నుపురినకు, భక్తత్రాణైక కారికి, పరప్రేరితమంత్ర యంత్రస్తంభకారికి, పయఃపాషాణ తరణకారణునకు,

బాలార్కమండలగ్రాసకారికి, దుఃఖహారికి నమస్కారము. నఖాయుధునకు, భీమునకు, దంతాయుధునకు, విహంగమునకు, శైవునకు, వజ్రదేహునకు, ప్రతిగ్రామ స్థితునకు, భూతప్రేత వధార్థికి, కరస్థశైలశస్త్రునకు రామశస్త్రునకు నమస్కారము. కౌపీనవాసనునకు, రామభక్తిరతునకు, దక్షిణాశాభాస్కరునకు, సజ్జనులకు చంద్రోదయ స్వరూపునకు, కృత్యాక్షతవ్యధఘ్నునకు, సర్వక్లేశహరునకు, స్వామ్యాజ్ఞాపార్థసంగ్రామ సఖ్యసంజయ కారికి నమస్కారము. దివ్యవాదములందు, సంగ్రమములందు భక్తులకు జయమును కలిగించువానికి, కిల్కిలారావకరునికి, ఘోరశబ్దకరునకు, సర్వాగ్నివ్యాధి సంస్తంభకారికి, భయహారికి, సదావనఫలహార సంతృప్తునకు, మహార్ణవశిలాబద్ధ సేతు బంధువుడవగు నీకు నమస్కారము.

ఈ విధంగా శుభకరముగు హనుమత్కవచమను నీకు చెప్పితిని. ఈ కవచాన్ని ప్రతివారికీయ రాదు. ప్రయత్నముచే రక్షించవలయును. అష్టగంధములచే వ్రాసి కంఠమున గాని, దక్షిణబాహువున కాని ధరించిన వానికి ప్రతిక్షణమున జయమే కలుగుచుండును. ఆదరముచే ఈ కవచమును లక్ష జపించిన వానికి అసాధ్యమంటూ ఉండదు. ప్రతిదానిని సాధించగలడు. *(అధ్యా-78)*

## శ్రీకృష్ణ మంత్రాలు

1. శ్రీకృష్ణాయ గోవిందాయ గోపీజన వల్లభాయ స్వాహా।
2. చక్రీష్ట్యాయ నమః
3. వాసుదేవాయ విద్మహే పుష్పబాణాయ ధీమహి తన్నో అనంగః ప్రచోదయాత్
4. శ్రీకామదేవాయ సర్వజన ప్రియాయ సర్వజన సమ్మోహనాయ జ్వల జ్వల ప్రజ్వల ప్రజ్వల సర్వజనస్య హృదయం మమ వశం కురుకురు
5. శ్రీకృష్ణాయ గోవిందాయ నమః స్వాహా
6. ఓం కృష్ణా గోవిందాయ నమః
7. ఓం కృష్ణ కృష్ణ! మహాకృష్ణ। సర్వజ్ఞ। త్వంప్రసీద। మే శ్రీరమా రమణ విద్యేశ। విద్యామాశుప్రయచ్ఛమే।
8. నందపుత్రాయ శ్యామలాంగాయ బాలవపుషే కృష్ణాయ గోవిందాయ శ్రీకృష్ణాయ గోవిందాయ స్వాహా।

9. ఓం నమో భగవతే నందపుత్రాయ ఆనందవపుషే
శ్రీకృష్ణాయ గోవిందాయ స్వాహా

10. ఓం నమో భగవతే నందపుత్రాయ బాలవపుషే స్వాహా ।

11. ఓం నమో భగవతే రుక్మిణీ వల్లభాయ స్వాహా ।

12. లీలాదండ పదాబ్జ జనసంసక్తదోర్దండ ధరాధీశ మేఘశ్యామ
భగవాన్ విష్ణోఫట్ ।

13. ఓం నమో భగవతే గోవిందాయ

14. ఓం కేశవాయ స్వాహా 15.ఓం ధరానాథాయ నమః

16. ఓం శ్రీ భువనకామాయ శ్రీకృష్ణాయ, శ్రీ గోవిందాయ గోపీజన వల్లభాయః

17. ఓం శ్రీ గోవిందాయ నమః 18.శ్రీధరాశ్యామలాంగాయ నమః

19. బాలవపుషే కృష్ణాయ స్వాహా 20.బాలవపుషే కృష్ణాయ నమః

21. శ్రీహృషీకేశాయ నమః

22. శ్రీ శ్రీధరాయ త్రైలోక్య మోహనాయ నమః

23. వసుదేవనిగడచ్ఛేద వాసుదేవాయ హుంఫట్

24. బాలాత్రిః న్యాసాయ నమః

(గమనిక : ఈ మంత్రాలని గురుముఖతః ఉపదేశం పొంది జపించాలి)

## నవరతాత్మక దేవీకవచం

అథ తే కవచం దేవ్యా వక్ష్యే నవరతాత్మకమ్ ।
యేవ దేవాసురవర జయీా స్యాత్సాధకస్సదా ॥ 1

సర్వత స్సర్వదాత్మానం లలితా పాతు సర్వగా ।
కామేశీ పురతః పాతు భగమాలీ త్వనంతరమ్ ॥ 2

దిశం పాతు తథా దక్ష పార్శ్వం మే పాతు సర్వదా ।
నిత్యక్లిన్నాథ భేరుండా దిశం మే పాతు కౌణపీమ్ ॥ 3

తథైవ పశ్చిమం భాగం రక్షతాద్వహ్నివాసినీ ।
మహావజ్రేశ్వరీ నిత్యా వాయవ్యే మా సదావతు ॥ 4
వామపార్శ్వం సదా పాతు ఇతీ మే లలితా తతః ।
మహేశ్వరీం దిశం పాతు త్వరితం సిద్ధిదాయినీ ॥ 5
పాతు మామూర్ధ్వత శ్శశ్వత్ దేవతామల సున్దరీ ।
అథో నీలపతాకాఖ్యా విజయా సర్వతశ్చ మామ్ ॥ 6
కరోతు మే మంగలాని సర్వదా సర్వమంగలా ।
దేహేన్ద్రియమనఃప్రాణాన్ జ్వాలామాలిని విగ్రహా ॥ 7
పాలయత్వనిశం చిత్తా చిత్తం మే సర్వదావతు ।
కామాత్క్రోధాత్తథా లోభాన్మోహా న్మానాన్మదాదపి ॥ 8
పాపాన్మాం సర్వతశ్శోకాత్ సంక్షయాత్సర్వత స్సదా ।
అసత్యాత్క్రూర చింతాతో పింసాతశ్చౌరతస్సదా ॥ 9
స్తైమిత్యాచ్చ సదా పాతు ప్రేరయంత్యశ్శుభం ప్రతి ।
నిత్యాష్షోడశ మాం పాంతు గజారూఢా స్స్వశక్తిభిః ॥ 10
తథా హయ సమారూఢాః పాంతు మాం సర్వతస్సదా ।
సింహారూఢాస్సదా పాంతు పాంతు ఋక్షగతా అపి ॥ 11
రథారూఢాశ్చ మాం పాతు సర్వత స్సర్వదా రణే ।
తార్క్ష్యారూఢాశ్చ మాం పాంతు తథా వ్యోమగతాశ్చ తాః ॥ 12
భూతగా స్సర్వగాః పాంతు పాంతు దేవ్యశ్చ సర్వదా ।
భూతప్రేత పిశాచాశ్చ పురవృత్యాదిధాన్గదాన్ ॥ 13
ద్రావయంతు స్వశక్తీనాం భూషణైరాయుధైర్మమ ।
గజాశ్వద్వీపిపంచాస్య తార్క్ష్యారూఢాఖిలాయుధః ॥ 14
అసంఖ్యాశ్శక్తయో దేవ్య పాంతు మాం సర్వత స్సదా ।
సాయం ప్రాతర్జపన్నిత్యా కవచం సర్వరక్షకమ్ ॥ 15
కదాచిన్నాశుభం పశ్యేత్సర్వదానందమాస్థితః ।
ఇత్యేత త్కవచం ప్రోక్తం లలితాయాశ్శుభావహమ్ ।
యస్య సంధారణాన్మర్త్యో నిర్భయో విజయీ సుఖీ ॥ 16

*(శ్లో॥23-28,అధ్యా-89)*

మహాప్రభావవంతమైన ఈ నవరతాత్మక దేవీకవచాన్ని ఉదయం సాయంత్రం శ్రద్ధగా పఠించిన వారికి అశుభాలన్నవి ఎప్పుడూ జరగవు. ఎప్పుడూ ఆనందాన్నే అనుభవిస్తారు.

## శ్రీలలితా విశేష సహస్రనామ స్తోత్రం

అథ నామ్నాం సహస్రం తే వక్ష్యే సావరణార్చనమ్ ।
షోడశానామపి మునే స్వస్వక్రమగతాత్మకమ్ ॥ 1

లలితా చాపి వా కామాఈశ్వరీ భగమాలినీ ।
నిత్యక్లిన్నా చ భేరుండా కీర్తితా వహ్నివాసినీ ॥ 2

వజ్రేశ్వరీ తథా దూతీ త్వరితా కులసుందరీ ।
నిత్యా సంవిత్తథా నీలపతాకా విజయాహ్వయా ॥ 3

సర్వమంగలికా చాపి జ్వాలామాలిని సంజ్ఞితా ।
చిత్రాచేతి క్రమాన్నిత్యా షోడశాపీష్టవిగ్రహాః ॥ 4

కురుకుల్లా చ వారాహీ ద్వే ఏతే చేష్టవిగ్రహా ।
వశినీ చాపి కామేశీ మోహినీ విమలారుణా ॥ 5

తపినీ చ తథా సర్వేశ్వరీ చాప్యథకాలినీ ।
ముద్రాణం తనురిష్వర్ణరూపా చాపర్ణ విగ్రహా ॥ 6

పాశావర్ణశరీరాచా కుర్వర్ణసువపుర్ధరా ।
త్రిఖండా స్థాపినీ సన్నిరోధనీ భావగుంఠనీ ॥ 7

సన్నిధానేషు చాపాఖ్యా తథా పాశాంకుశాబిధా ।
నమస్కృతిస్తథా సంక్షోభణీ విద్రావణీ తథా ॥ 8

ఆకర్షణీ చ విఖ్యాతా తద్వైవావేశవారిణీ ।
ఉన్మాదినీ మహాపూర్వా కుశాధో ఖేచరీ మతా 9

బీజా శక్త్యుత్థాపనా చ స్థూలసూక్ష్మ పరాభిదా ।
అణిమా లఘిమా చైవ మహిమా గరిమా తథా ॥ 10

ప్రాప్తిః ప్రకామితా చాపి చేశితా వశితా తథా ।
భుక్తి స్సిద్ధి స్తథైవేచ్ఛా సిద్ధిరూపా చ కీర్తితా ॥ 11

బ్రాహ్మీ మహెశ్వరీ చైవ కౌమారీ వైష్ణవీ తథా ।
వారాహీంద్రాచ చాముండా మహాలక్ష్మీ స్వరూపిణీ ॥ 12

కామా బుద్ధిరహంకారా శబ్దస్పర్శస్వరూపిణీ ।
రూపరూపా రసాహ్వా చ గంధవిత్తధృతిస్తథా ॥ 13

నాభిబీజామృతాఖ్యా చ స్మృతిదేహాత్మరూపిణీ ।
కుసుమా మేఖలా చాపి మదనా మదనాతురా ॥ 14

రేఖా సంవేగినీ చైవ హ్యంకుశా మాలినీతి చ ।
సంక్షోభిణీ తథా విద్రావిణ్యాకర్షణరూపిణీ ॥ 15

ఆహ్లాదినీతి చ ప్రోక్తా తథా సంమోహినీతి చ ।
స్తంభినీ జంభినీ చైవ వశంకర్యథ రంజినీ ॥ 16

ఉన్మాదినీ తథైవార్థసాధినీతి ప్రకీర్తితా ।
సంపత్తిపూర్ణా సా మంత్రమయీ ద్వంద్వక్షయంకరీ ॥ 17

సిద్ధిస్సంపత్ప్రదా చైవ ప్రియమంగలకారిణీ ।
కామప్రదా నిగదితా తథా దుఃఖమోచనీ 18

మృత్యుప్రశమనీ చైవ తథా విఘ్ననివారిణీ ।
అంగసుందరికా చైవ తథా సౌభాగ్యదాయినీ ॥ 19

జ్ఞానైశ్వర్యప్రదా జ్ఞాన మయీ చైవ చ పంచమీ ।
వింధ్యవాసనకా ఘోర స్వరూపాపాపహారిణీ ॥ 20

తథానన్దమయీ రక్షా రూపేప్సితఫలాప్రదా ।
జయినీ విమలా చాథ కామేశీ వజ్రిణీ భగా ॥ 21

త్రైలోక్యమోహనాస్థానా సర్వాశాపరిపూరణీ ।
సర్వసంక్షోభణగతా సౌభాగ్యప్రదసంస్థితా ॥ 22

సర్వార్థసాధకాగారా సర్వరోగహరా స్థితా ।
సర్వరక్షాకరాస్థానా సర్వసిద్ధిప్రదస్థితా ॥ 23

సర్వానందమయాధారా బిందుస్థానశివాత్మికా ।
ప్రకృష్టా చ తథా గుప్తా జ్ఞేయా గుప్తతరాపి చ ॥ 24

సంప్రదాయ స్వరూపా చ కులకౌల నిగర్భగా ।
రహస్యా పరాప్రాకృ త్తథైవాతి రహస్యకా ॥ 25

త్రిపురా త్రిపురేశీ చ తథైవ పురవాసినీ ।
శ్రీమాలినీ చ సిద్ధాన్తా మహాత్రిపుర సుందరీ ॥ 26

నవరత్నమయద్వీప నవఖండ విరాజితా ।
కల్పనోద్యాన సంస్థా చ ఋతురూపేన్ద్రియార్చకా ॥ 27

కాలముద్రా మాతృకాఖ్యా రత్నదేశోపదేశికా ।
తత్త్వాగ్రహాభిదా మూర్తిస్తథైవ విషయద్విషా ॥ 28

దేశకాలాకారశబ్ద రూపా సంగీత యోగినీ ।
సమస్త గుప్త ప్రకట సిద్ధయోగిని చక్రయుక్ ॥ 29

వహ్ని సూర్యేన్దు భూతాహ్వా తథాతాస్వక్షరాహ్వయా ।
పంచధార్చ స్వరూపా చ నానావ్రత సమాహ్వయా ॥ 30

నిషిద్ధాచార రహితా సిద్ధచిహ్న స్వరూపిణీ ।
చతుర్ధా కూర్మ భాగస్థా నిత్యాద్యర్చ స్వరూపిణీ ॥ 31

దమనాది సమభ్యర్చా షట్కర్మ సిద్ధి దాయినీ ।
తిథివార పృథగ్ద్రవ్య సమర్చన శుభావహా ॥ 32

వాయోశ్యనంగ కుసుమా తథైవానంగమేఖలా ।
అనంగ మదనానంగ మదనాతుర సాహ్వయా ॥ 33

మదదేగినికా చైవ తథా భువన పాలినీ ।
శశిలేఖా సముద్దిష్టా గతిలేఖాహ్వయా మతా ॥ 34

శ్రద్ధా ప్రీతీ రతిశ్చైవ ధృతిః కాంతి ర్మనోరమా ।
మనోహరా సమాఖ్యాతా తథైవ హి మనోరథా ॥ 35

మదనోన్మాదినీ చైవ మోదినీ శంఖినీ తథా ।
శోషిణీ చైవ శంకారీ సింజనీ సుభగా తథా ॥ 36

పూషా చే ద్వాసుమనసా రతిః ప్రీతిర్ధృతి స్తథా ।
బుద్ధి స్సౌమ్యా మరీచిశ్చ తతైవ హ్యంశుమాలినీ ॥ 37

శశినీ చాంగిరా ఛాయా తథా సంపూర్ణమండలా ।
తుష్టిస్తథామృతాఖ్యా చ డాకినీ సాధ లోకపా ॥ 38

బటుకేభా స్వరూపా చ దుర్గా క్షేత్రేశ రూపిణీ ।
కామరాజ స్వరూపా చ తథా మన్మథ రూపిణీ ॥ 39

కందర్ప రూపిణీ చైవ తథా మకర కేతనా ।
మనో భవ స్వరూపా చ భారతీ వర్ణ రూపిణీ ॥ 40

మదనా మోహినీ లీలా జంభినీ చోద్యమా శుభా ।
హ్లాదినీ ద్రావిణీ ప్రీతీరతా రక్తా మనోరమా ॥ 41

సర్వోన్మాదా సర్వముఖా హ్యభంగా చామితోద్యమా ।
అనల్పా వ్యక్తవిభవా వివిధా క్షోభవిగ్రహా ॥ 42

రాగశక్తి ర్ద్వేష శక్తి స్తథా శబ్దాది రూపిణీ ।
నిత్యా నిరంజనా క్లిన్నా క్లేదినీ మదనాతురా ॥ 43

మద ద్రవా ద్రవిణీ చ ద్రావిణీ చేతి కీర్తితా ।
మదావిలా మంగలా చ మన్మథానీ మనస్వినీ ॥ 44

మోహామోదా మానమయీ మాయా మందా మితావతీ ।
విజయా విమలా చైవ శుభా విశ్వా తథైవ చ ॥ 45

విభూతిర్వనితా చైవ వివిధా వినతా క్రమాత్ ।
కమలా కామినీ చైవ కిరాతా కీర్తి రూపిణీ ॥ 46

కుట్టినీ చ సముద్దిష్టా తథైవ కులసుందరీ ।
కల్యాణీ కాలకోలా చ డాకినీ శాకినీ తథా ॥ 47

లాకినీ కాకినీ చైవ రాకినీ కాకినీ తథా ।
ఇచ్ఛా జ్ఞానా క్రియాఖ్యా చ ఆయుధాష్టకధారిణీ ॥ 48

కపర్దినీ సముద్దిష్టా తత్రైవ కులసున్దరీ ।
జ్వాలినీ విస్ఫులింగా చ మంగలా సుమనోహరా ॥ 49

కనకా కినవా విద్యా వివిధా చ ప్రకీర్తితా ।
మేషా వృషాహ్వయా చైవ మిథునా కర్కటా తథా ॥ 50

సింహా కన్యా తులా కీటా చాపా చ మకరా తథా ।
కుంభా మీనా చ సారా చ సర్వభక్షా తథైవ చ ॥ 51

విశ్వాత్మా వివదోద్భూత చిత్రరూపా చ కీర్తితా ।
నిస్సపత్నా నిరాతంకా యాచనాచింత్యవైభవా ॥ 52

రక్తా చైవ తతః ప్రోక్తా విద్యాప్రాప్తి స్వరూపిణీ ।
హృల్లేఖా క్లేదినీ క్లిన్నా క్షోభిణీ మదనాతురా ॥ 53

నిరంజనా రాగవతీ తథైవ మదనావతీ ।
మేఖలా ద్రావిణీ వేగవతీ చైవ ప్రకీర్తితా ॥ 54

కమలా కామినీ కల్పా కలా చ కలితాద్భుతా ।
కిరాతా చ తథా కాలా కదనా కౌశికా తథా ॥ 55

కంబువాదనికా చైవ కాతరా కపటా తథా ।
కీర్తిశ్చాపి కుమారీ చ కుంకుమా పరికీర్తితా ॥ 56

భంజినీ వేగినీ నాగా చపలా పేశలా సతీ ।
రతిశ్శ్రద్ధా భోగలోలా మదోన్మత్తా మనస్వినీ ॥ 57

విహ్వలా కర్షిణీ లోలా తథా మదన మాలినీ ।
వినోదా కతుకా పుణ్యా పురాణా పరికీర్తితా ॥ 58

వాగేశీ వరదా విశ్వా విభవా విఘ్నకారిణీ ।
బీజవిఘ్నహరా విద్యా సుముఖీ సుందరీ తథా ॥ 59

సారా చ సుమనా చైవ తతా ప్రోక్తా సరస్వతీ ।
సమయా సర్వగా విద్ధా శివా వాణీ చ కీర్తితా ॥ 60

ధూరసిద్ధా తథా ప్రోక్తాథో విగ్రహవతీ మతా ।
నాదా మనోన్మనీ ప్రాణ ప్రతిష్ఠారుణ వైభవా ॥ 61

ప్రాణాపానా సమానా చ వ్యానోదానా చ కీర్తితా ।
నాగా కూర్మా చ కృకలా దేవదత్తా ధనంజయా ॥ 62

ఫట్కారీ కింకరారాధ్యా జయా చ విజయా తథా ।
హుంకారీ ఖేచరీ చండా ఛేదినీ క్షపిణీ తథా ॥ 63

స్త్రీ హుంకారీ క్షేమకరీ చతురక్షర రూపిణీ ।
శ్రీవిద్యా మాత వర్ణాంగే కాలీ యామ్యా నృపార్ణకా ॥ 64

భాషా సరస్వతీ వాణీ సంస్కృతా ప్రాకృతా పరా ।
బహురూపా చిత్తరూపా రమ్యానన్దా చ కౌతుకా ॥ 65

త్రయాఖ్యా పరమాత్మాఖ్యా ప్యమేయవిభవా తథా ।
వాక్స్వరూపా బిన్దుసర్గరూపా విశ్వాత్మికా తథా ॥ 66

తథా త్రైపురకందాఖ్యా జ్ఞాత్రాది త్రివిధాత్మికా ।
ఆయుర్లక్ష్మీ కీర్తిభోగ సౌందర్యారోగ్య దాయికా ॥ 67

ఐహికాముష్మిక జ్ఞానమయీా చ పరికీర్తితా ।
జీవాఖ్యా విజయాఖ్యా చ తథైవ విశ్వవిన్మయీా ॥ 68

హృదాది విద్యారూపాది భానురూపా జగద్వపుః ।
విశ్వమోహనికా చైవ త్రిపురామృత సంజ్ఞికా ॥ 69

సర్వాప్యాయనరూపా చ మోహినీ క్షోభిణీ తథా ।
క్లేదినీ చ సమాఖ్యాతా తథైవ చ మహోదయా ॥ 70

సంపత్కరీ హలక్షార్ణా సీమా మాతృతనూరతిః ।
ప్రీతిర్మనోభవా వాపి ప్రోక్తా వారాధిపా తధా ॥ 71

త్రికూటా చాపి షట్కూటా పంచకూటా విశుద్ధగా ।
అనాహత గతా చైవ మణిపూరక సంస్థితా ॥ 72

స్వాధిష్ఠానస మాసీనా ధారస్థా జ్ఞానమాస్థితా ।
షట్త్రింశత్కూట రూపా చ పంచాశన్మిధునాత్మికా ॥ 73

పాదుకాదిక సిద్ధీశా తదా విజయ దాయినీ ।
కామరూప ప్రదేవేతాలరూపా చ పిశాచికా ॥ 74

విచిత్రా విభ్రమా హంసీ భీషణీ జనరంజికా ।
విశాలా మదనా తుష్టా కాలకంఠీ మహాభయా ॥ 75

మాహేన్ద్రీ శంఖినీ చైంద్రీ మంగలా వటవాసినీ ।
మేఖలా సకలా లక్ష్మీర్మాలినీ విశ్వనాయికా ॥ 76

సులోచనా సుశోభా చ కామదా చ విలాసినీ ।
కామేశ్వరీ నన్దినీ చ స్వర్ణరేఖా మనోహరా ॥ 77

ప్రమోదా రాగిణీ సిద్ధా పద్మినీ చ రతిప్రియా ।
కల్యాణ దా కలా దక్షా తతశ్చ సురసుందరి ॥ 78

విభ్రమా వాహకా వీరా వికలా కోరకా కవిః ।
సింహనాదా మహానాదా సుగ్రీవా మర్కటా శఠా ॥ 79

బిడాలక్షా బిడాలస్యా కుమారీ ఖేచరీ భవా ।
మయూరా మంగలా భీమా ద్విపవక్త్రా ఖరాననా ॥ 80

మాతంగీ చ నిశాచారా వృషగ్రాహా వృకాననా ।
సౌరిభాస్యా గజముఖా పశువక్త్రా మృగాననా ॥ 81

క్షోభకా మణిభద్రా చ క్రీడకా సింహ చక్రకా ।
మహోదరా స్థూలశిఖా వికృతాస్యా కరాననా ॥ 82

చపలా కుక్కుటాస్యా చ పాలినీ మదనాలసా ।
మనోహరా దీర్ఘజంఘా స్థూలదన్తా దశాననా ॥ 83

సుముఖా పండితా క్రుద్ధా వరాహాస్యా సటాముఖా ।
కపటా కౌతుకా కాలా కింకరా కితవా ఖలా ॥ 84

భక్షకా భయదాఽసిద్ధా సర్వగా చ ప్రకీర్తితా ।
జయా చ విజయా దుర్గా భద్ర భద్రకరీ తథా ॥ 85

అంబికా వామదేవీ చ మహామాయా స్వరూపిణీ ।
విదారికా విశ్వమయీ విశ్వావిశ్వవి భంజితా ॥ 86

వీరా విక్షోభిణీ విద్యా వినోదా బీజవిగ్రహా ।
వీతా శోకా విషగ్రీవా విపులా విజయ ప్రదా ॥ 87

విభవా వివిధా విప్రా తథైవ పరికీర్తితా ।
మనోహరా మంగళా చ మదోత్సిక్తా మనస్వినీ ॥ 88

మానినీ మధురా మాయా మోహినీ చ తథా స్మృతా ।
భద్రా భవానీ భవ్యా చ విశాలాక్షీ శుచిస్మితా ॥ 89

కకుభా కమలా కల్పా కలాధో పూరణీ తథా ।
నిత్యా చాప్యమృతా చైవ జీవితా చ తథా దయా ॥ 90

అశోకా హ్యమలా పూర్ణా పూర్ణాభాగ్యోద్యతా తథా ।
వివేకా విభవా విశ్వా వితతా చ ప్రకీర్తితా ॥ 91

కామినీ ఖేచరీ గర్వా పురాణా పరమేశ్వరీ ।
గౌరీ శివా హ్యమేయా చ విమలా విజయా పరా ॥ 92

పవిత్రా పద్మినీ విద్యా విశ్వేశీ శివవల్లభా ।
అశేషరూపా హ్యానందాంబుజాక్షీ చాప్యనిందితా ॥ 93

వరదా వాక్యదా వాణీ వివిధా వేద విగ్రహా ।
విద్యా వాగీశ్వరీ సత్యాసంయతా చ సరస్వతీ ॥ 94

నిర్మలానన్ద రూపా చ హ్యమృతా మానదా తథా ।
పూషా చైవ తథా పుష్టిస్తుష్టి శ్చాపి రతిర్ధృతిః ॥ 95
శశినీ చన్ద్రికా కాంతి ర్జ్యోత్స్నా శ్రీః ప్రీతి రంగదా ।
పూర్ణా పూర్ణామృతా కామదాయినీన్దు కలాత్మికా ॥ 96
తపినీ తాపినీ ధూమ్రా మరీచిర్జ్వలినీ రుచిః ।
సుషుమ్ణా భోగాదా విశ్వా బాధినీ ధారిణీ క్షమా ॥ 97
ధూమ్రార్చిరుష్మా జ్వలినీ జ్వాలినీ విస్ఫులింగినీ ।
సుశ్రీ స్స్వరూపా కపిలా హవ్య కవ్యవహా తథా ॥ 98
ఘస్మరా విశ్వకబలా లోలాక్షీ లోల జిహ్వికా ।
సర్వభక్షా సహస్రాక్షీ నిస్సంగా చ గతిప్రియా ॥ 99
అచింత్యా చాప్రమేయా చ పూర్ణ రూపా దురాసదా ।
సర్వా సంసిద్ధ రూపా చ పావనీ త్యేకరూపిణీ ॥ 100
తథా యామలవేధాఖ్యా శాక్తీ వేద స్వరూపిణీ ।
తతా శాంభవవే ధా చ భావనా సిద్ధి సూచినీ ॥ 101
వహ్నిరూపా తథా దస్రా హ్యమా విఘ్నా భుజంగమా ।
షణ్ముఖా రవిరూపా చ మాతా దుర్గా దిశా తథా ॥ 102
ధనదా కేశవా చాపి యమీ చైవ హరా శశా ।
అశ్వినీ చ యమీ వహ్నిరూపా ధాత్రీతి కీర్తితా ॥ 103
చన్ద్రా శివా దితిర్జీవా సర్పిణీ పితృరూపిణీ ।
అర్యమ్ణా చ భగా సూర్యా త్వాష్ట్రీ మారుతిసంజ్ఞివా ॥ 104
ఇంద్రాగ్నిరూపా మిత్రా చాపీన్ద్రాణీ నిఋుతిర్జలా ।
వైశ్వదేవీ హరితభూర్వాసవీ వరుణా జయా ॥ 105
అహిర్బుధ్న్యా పూషణీ చ తథాకారస్కరామలా ।
ఉదుంబరాజంబుకా చ ఖదిరా కృష్ణరూపిణీ ॥ 106

వంశా చ పిప్పలా నాగా రోహిణీ చ పలాశకా ।
పక్షకా చ తథామ్బష్ఠా బిల్వాచార్జునరూపిణీ ॥ 107

వికంకుతా చ కకుభా సరలా చాపి సర్జికా ।
వంజులా పనసార్కా చ శమీ హలిప్రియామ్రకా ॥ 108

నింబా మధూవసంజ్ఞాచాప్యశ్వత్థా చ గజాహ్వయా ।
నాగినీ సర్పణీ చైవ శునీ చాపి బిదాలనీ ॥ 109

ఛాగీ మార్జారికా మూషీ వృషభా మాహిషీ తథా ।
శార్దూలీ సౌరభీ వ్యాఘ్రీ హారిణీ చ మృగీ శునీ ॥ 110

కపిరూపా చ గోఘంటా వానరీ చ నరాశ్వినీ ।
నగా గౌర్హస్తినీ చేతి తథా షట్చక్రవాసినీ ॥ 111

త్రిఖండా తీర పాలాక్యా భ్రామణీ ద్రావిణీ తథా ।
సోమా సూర్యాతిథి ర్వారా యోగార్క్షా కరణాత్మికా ॥ 112

యక్షిణీ తారణా వ్యోమశబ్దాద్యా ప్రాణినీ చ ధీః ।
క్రోధినీ స్తంభినీ చండో చ్చండా బ్రాహ్మ్యాది రూపిణీ ॥ 113

సింహస్థా వ్యాఘ్రగా చైవ గజాశ్వ గరుడ స్థితా ।
బౌమాప్యా తైజసీ వాయురూపిణీ నాభసా తథా ॥ 114

ఏకవక్త్రా చతుర్వక్త్రా నవవక్త్రా కలాననా ।
పంచవింశతి వక్త్రా చ షడ్వింశద్వదనా తథా ॥ 115

ఊనపంచాశదాస్యాచ చతుష్షష్టిముఖా తథా ।
ఏకాశీతి ముఖా చైవ శతానన సమన్వితా ॥ 116

స్థూలరూపా సూక్ష్మరూపా తేజోవిగ్రహధారిణీ ।
వృణావృత్తి స్వరూపా చ నాధా వృత్తి స్వరూపిణీ ॥ 117

తత్త్వావృత్తి స్వరూపాపి నిత్యావృత్తివపుర్ధరా ॥ 118

అంగావృత్తి స్వరూపా చాప్యాయుధావృత్తి రూపిణీ ।
గురు పంక్తి స్వరూపా చ విద్యావృత్తి తనుస్తథా ॥ 119

బ్రహ్మాద్యా వృత్తిరూపా చ పరాపశ్యంతికా తథా ।
మధ్యమా వైఖరీ శీర్ష కంఠతాల్వోష్ఠదన్తగా ॥ 120

జిహ్వా మూలగతా నాసా గతోర స్స్థలగామినీ ।
పదవాక్యస్వరూపా చ వేదభాషా స్వరూపిణీ ॥ 121

సేకాఖ్యా వీక్షణాఖ్యాచోపదేశాఖ్యా తథైవ చ ।
వ్యాకులాక్షర సంకేతా గాయత్రీ ప్రణవాదికా ॥ 122

జపహోమార్చన ధ్యాన యంత్రతర్పణ రూపిణీ ।
సిద్ధసారస్వతా మృత్యుం జయా చ త్రిపురా తథా ॥ 123

గారుడా చాన్నపూర్ణాచాప్యశ్వారూఢా నవాత్మికా ।
గౌరీ చ దేవీ హృదయా లక్షదా చ మతంగినీ ॥ 124

నిష్కత్రయపదా చేష్టా వాదినీ చ ప్రకీర్తితా ।
రాజలక్ష్మీర్మహాలక్ష్మీ స్సిద్ధలక్ష్మీర్గవాననా ॥ 125

ఇత్యేవం లలితా దేవ్యా దివ్యం నామ సహస్రకమ్ ।
సర్వార్థసిద్ధిదం ప్రోక్తం చతుర్వర్గ ఫలప్రదమ్ ॥ 126

ఏతన్నిత్యముషఃకాలే యో జపేచ్ఛుద్ధమానసః ।
స యోగీ బ్రహ్మవిజ్ఞానీ శివయోగీ తథాత్మవిత్ ॥ 127

*(శ్లో॥40-165,అధ్యా-89)*

పవిత్రమైన ఈ లలితాసహస్రనామ స్తోత్రాన్ని ప్రతిరోజూ రెండు సార్లు జపిస్తే ఆయురారోగ్య ఐశ్వర్యాలు సాధకుడికి సిద్ధిస్తాయి. తొమ్మిది సార్లు జపిస్తే వాక్సిద్ధి కలుగుతుంది. 12 సార్లు జపిస్తే అంతటా విజయం సుఖం లభిస్తాయి. 40 రోజులు దీక్షగా రోజుకి ఒకసారి ఈ సహస్రనామ స్తోత్రాన్ని పఠిస్తే కోరిన కోరికలు తీరుతాయి.

## మహేశ్వర మంత్రాలు

1. నమః శివాయ

2. ఓం నమః శివాయ

3. ఓం నమో భగవతే దక్షిణామూర్తయే మహ్యంమేధాం ప్రయచ్ఛ స్వాహా

## ఖడ్గరావణ మంత్రం

ఓం నమః పశుపతయే ఓం నమో భూతాధి పతయే నమో రుద్రాయ నమోరుద్రాయ ఖడ్గరావణ విహర విహర। నరీనృత్య నరీనృత్య। శ్మశాన భస్మాంచిత శరణ్యాయ। ఘంటా కపాలమాలాది ధరాయ। వ్యాఘ్రచర్మ పరిధానాయ। శశాంక కృత శేఖరాయ। కృష్ణ సర్ప యజ్ఞోపవీతినే। బలబల। చలాచలా। నివర్తకపాలినే। హనహన। భూతాంస్త్రాసయ త్రాసయ। మండపమధ్యే కటకట। రుద్రాంకు శేన శమయ శమయ। ప్రవేశయ ప్రవేశయ। ఆవేశయ ఆవేశయ। చండాసి ధరాధిపతి రుద్రోయం। ఆజ్ఞాపయతి స్వాహా। 176 అక్షరాల మంత్రం (ఈ మంత్రాలని గురువుద్వారా ఉపదేశం పొంది ఉపాసించాలి)

## అఘోరాస్త్ర మంత్రం

**హ్రీం స్ఫుర స్ఫుర ప్రస్ఫుర ఘూతయ ఘూతయ హుం ఫట్**

**క్షేత్రపాల మంత్రం : హం క్షేత్ర పాలాయ నమః**

**వటుక మంత్రం :**

**ఓం వటుకాయ ఆపదుద్ధరణం కురు కురు వటుకాయ స్వాహా**

**చండమంత్రం : శ్రీం హ్రీం ఫట్**

**చండీశ్వర మంత్రం : ఆం చండేశ్వరాయ నమః**

## మంత్రసిద్ధి కలిగించే మహేశ్వర స్తోత్రం

శృణు నారద వక్ష్యామి దివ్యం మాహేశ్వరం స్తవమ్ ।
యస్య పాఠేన పూజాయాం సిద్ధ్యంతి మనవోఽఖిలాః ॥ 1

ధరాంబ్వగ్నిమరుద్వ్యోమ మఖేశేంద్వర్కమూర్తయే ।
సర్వభూతాంతరస్థాయ శంకరాయ నమోనమః ॥ 2

శ్రుత్యంతకృతవాసాయ శ్రుతయే శ్రుతి జన్మనే ।
అతీంద్రియాయ మహసే శాశ్వతాయ నమోనమః ॥ 3

స్థూలసూక్ష్మ విభాగాఖ్యామనిర్దేశ్యాయ శంభవే ।
భవాయ భవసంభూత దుఃఖహన్త్రే నమోనమః ॥ 4

తర్కమార్గాతి దూరాయ తపసాం ఫలదాయినే ।
చతుర్వర్గవదాన్యాయ సర్వజ్ఞాయ నమోనమః ॥ 5

ఆదిమధ్యాంతశూన్యాయ నిరస్తాశేషభీతయే ।
యోగిధ్యేయాయ మహతే నిర్గుణాయ నమోనమః ॥ 6

విశ్వాత్మనే వివిక్తాయ విలసచ్చన్ద్రమౌలయే ।
కందర్పదర్పనాశాయ కాలహంత్రే నమోనమః ॥ 7

విషాశనాయ విహరద్వృషస్కంధము పేయుషే ।
సరిద్ధామసమాబద్ధకపర్దాయ నమో నమః ॥ 8

శుద్ధాయ శుద్ధాభాయ శుద్ధానామంతరాత్మవే ।
పురాంతకాయ పూర్ణాయ పుణ్యానామ్నే నమోనమః ॥ 9

భక్తాయ నిజభక్తానాం భుక్తిముక్తి ప్రదాయినే ।
వివాసనే నివాసాయ విశ్వేషాం పతయే నమః ॥ 10

త్రిమూర్తిమూలభూతాయ త్రినేత్రాయ త్రిశూలినే ।
త్రిధామ్నే ధామరూపాయ జన్మదాయ నమోనమః ॥ 11

దేవాసురశిరోరత్నకిరీటారుణితాఘ్రయే ।
కాంతాయ నిజకాంతాయై దత్తార్ధాయ నమోనమః ॥ 12

ఏతత్స్తోత్రం మహేశస్య ప్రోక్తం సర్వాఘనాశనమ్ ।
శివసాన్నిధ్యదం విప్ర సర్వత్ర ప్రకాశకమ్ ॥ 13

*(శ్లో॥218-230,అధ్యా-91)*

మహిమాన్వితమైన ఈ దివ్యస్తోత్రాన్ని పఠించిన వెంటనే సకల మంత్రాలూ సిద్ధిస్తాయి.

## కాశీ మాహాత్మ్యం

కాశీక్షేత్రం మానవుల కర్మబీజాన్ని శమింపచేసి అందరికీ సద్గతిని ప్రసాదిస్తుంది. ఈ నగరం పూర్వం వైష్ణవ క్షేత్రంగా ప్రసిద్ధిచెందింది. అసలు వైష్ణవక్షేత్రం కానిచోట ఎవరికీ మోక్షం అనేది లభించదు. సర్వ ప్రాణులకీ ఈ కాశీనగరం మోక్షాన్ని కలిగిస్తుంది.

ఒకప్పుడు పరమేశ్వరుడు సకలలోకసృష్టికర్త, తన దివ్యతేజస్సుతో ప్రకాశిస్తున్న పితామహుణ్ణి చూడటానికి బయలుదేరాడు. బ్రాహ్మలోకాన్ని చేరిన శివుడు బ్రహ్మదేవుడికి నమస్కరించి నుంచున్నాడు. ఆ సమయంలో బ్రహ్మ తన నాలుగు ముఖాలతో నాలుగువేదాల్నీ పఠిస్తున్నాడు. అది చూసి శంకరుడు ఎంతో ఆనందించాడు. అయితే బ్రహ్మ అయిదో తల మాత్రం చాలా నిర్లక్ష్యంగా చూస్తోంది. అది గ్రహించాడు శంకరుడు. ఆయనకి చాలా కోపం వచ్చింది. వెంటనే తన చిటికినవేలి గోరుతో ఆ అయిదో తలని తెంచేసాడు.

తెగిన బ్రహ్మతల శివుడి చేతికి అంటుకుని అలాగే ఉండిపోయింది. ఆయన ఎంత ప్రయత్నించినా ఆ తల తనచేతిని వదల్లేదు. ఎలాగైనా ఆ తల వదిలించుకుందామని అక్కణ్ణుంచి బయలుదేరాడు శివుడు. ఎంత తిరిగినా ఆ తల ఊడలేదు. చింతాక్రాంతుడైన శంకరుడు వెంటనే శ్రీహరిని స్మరించాడు. శంకరుడి పిలుపు విని శ్రీహరి అక్కడ ప్రత్యక్షమయ్యాడు. బాధపడుతున్న శంకరుడితో –

"శంకరా! నీవు బ్రహ్మతల తెంచి బ్రహ్మహత్యని చేసినవాడివయ్యావు. కనుక స్వయంకృతాపరాధ ఫలాన్ని కొన్నాళ్ళు నీవు అనుభవించక తప్పదు. అది అనివార్యం. వందజన్మలెత్తినా కర్మఫలం అనుభవించాల్సిందే. శంకరా! నిన్ను చూస్తే నాకు చాలా బాధకలుగుతోంది. నీవు సకలలోకాలకీ గురువువి. అందరికీ ధర్మాన్ని ఉపదేశించినవాడివి. నీవీ ఘోరం చేయటం దురదృష్టం.

ఈ బ్రహ్మ హత్యా పాతకం నిన్ను వెన్నంటే వస్తుంది. కనుక నీవు ఒకేచోట నిలవకుండా పన్నెండు సంవత్సరాల పాటు సంచరిస్తూవుండు. నీ చేతిలో ఉన్న కపాలంతో భిక్షను స్వీకరిస్తూ పుణ్య తీర్థాల్ని, దివ్యక్షేత్రాల్ని సేవించు. అలా చేస్తేనే నీ పాపం ప్రక్షాళనమవుతుంది" అని చెప్పి వెళ్ళిపోయాడు.

శ్రీహరి మాట ప్రకారం శంకరుడు ఆనాటి నుంచి అన్ని పుణ్యతీర్థాలకీ తిరగటం ప్రారంభించాడు. అలా అన్ని లోకాలలో సంచరిస్తూ శ్రీమహావిష్ణువు నుంచి భిక్ష స్వీకరించాలనుకున్న శంకరుడు వైకుంఠద్వారాన్ని చేరాడు. ద్వారం దగ్గర నిలబడి "శ్రీహరీ! నాకు భిక్షని ప్రసాదించు" అని అర్థించాడు. వెంటనే భిక్షని స్వీకరించమని శ్రీహరి తన కుడిచేతిని చాచగా శంకరుడు ఆ చేతిని తన త్రిశూలంతో ప్రహరించాడు. త్రిశూలం దెబ్బకి శ్రీహరిచేతికి పెద్ద గాయమయ్యింది. ఆ గాయం నుంచి భయంకరంగా మూడు రక్తపు ధారలు బయలుదేరాయి. ఆ ధారల్లో ఒక రక్తధార శంకరుడి కపాలంలో పడగా, రెండోధార ఆయనముఖం మీద, మూడోధార జలంలో పడ్డాయి. పవిత్రమైన ఆ మూడురక్తధారల్ని పరమేశ్వరుడు మూడుసంవత్సరాలు సేవించి కొంత సంతృప్తి పడి పుణ్యక్షేత్రమైన కురుక్షేత్రానికి చేరుకున్నాడు.

కురుక్షేత్రానికి చేరిన శంకరుడు అక్కడున్న బ్రహ్మకుండంలో మూడు సంవత్సరాలు క్రమం తప్పకుండా స్నానం ఆచరించాడు. అలా మూడు సంవత్సరాలు చేసేసరికి ఆయన చేతికంటిన కపాలం సగం ఊడింది. దానితో ఆనందించిన శంకరుడు మరింత భక్తితో శ్రీహరిని ధ్యానించసాగాడు. ఒకనాడు శ్రీహరి ప్రత్యక్షమై శంకరా! ఇక్కడి నుంచి పరమపవిత్రమైన కాశీక్షేత్రానికి వెళ్ళు. అది పాపనాశనక్షేత్రం, నా దివ్య స్థలం. నీకక్కడ శుభం జరుగుతుంది" అని చెప్పి వెళ్ళాడు. శంకరుడు వెంటనే కురుక్షేత్రం నుంచి బయలుదేరి అవిముక్త క్షేత్రమైన కాశీనగరానికి చేరుకున్నాడు. ఆయన కాశీ సీమలో ప్రవేశించి ఒక్కసారి వెనక్కి తిరిగి చూసాడు. ఆశ్చర్యం! అప్పటిదాకా ఆయన ఎక్కడికి వెళితే అక్కడికి అనుసరించి వస్తున్న బ్రహ్మహత్య అక్కడే ఆగిపోయింది.

పాపనాశన క్షేత్రమైన కాశీలోకి ప్రవేశించలేకపాయింది. అది గ్రహించిన శంకరుడు ఎంతో ఆనందించాడు. తనకి కాశీనగరంలో నివసించేందుకు అనుమతిని ప్రసాదించమని ఆ క్షేత్ర నివాసి అయిన శ్రీహరిని ఇలా స్తుతించాడు.

## శంకరుడు చేసిన శ్రీహరిస్తుతి

ఓ జగదీశా! నాథా! విష్ణు! జగదానన్ద నిధాన! వేదవేద్యా! మధుమధన! నృసింహా! పీతాంబరధారీ! గరుడవాహనా! మాధవా, ఆదిదేవా గోపనాయక! రమేశ! రాధాపతీ! దేవేశ! సకల కామపూర! కృష్ణ! జయము జయము. సురవర! వరుణ సాగరా! ఆర్తి నాశక! పుండరీకాక్ష! అధిపతి! విభో! పరేశ! యదు కుల తిలక! సాగరవాస! శౌరీ! పర్వతోద్ధార దక్ష! ధనుర్ధారీ! కలికలు షాపహరణ! పద్మపాద! గృణద ! ఆత్మప్రద! కూర్మ! వామనా ! వరాహా ! నరసింహా పరశు రామా! యజ్ఞరూపా ! కాలాశితవస్త్రధారీ ! బుద్ధిరూపా కల్కి! భవభయహరణ! భక్తవశ్య! గోపాలక! ప్రణతోద్ధారక! పుణ్యకీర్తి నామ! భూభారహరణ! దేవపూజ్య! ప్రకృతీశ! జగన్నివాస! రామ! గుణగణ విలసచ్చరాచరేశ! త్రిగుణాతీత! సనాతన! అగ్రపూజ్య! నిజజన పరిరక్షిత! అంతకరిపూ! కమల పాద! సుందర! పద్మనాభ! కమలకర! కుశేశయాధి వాసప్రియ! కామానన! త్రిగుణాధీశ! త్రిమూర్తి వరదా! పాపహరణ! రఘునాథ! దురితాపహరణ! త్రిగుణవ్యాప్త జగత్! త్రికాల దక్ష! దనుజకుల వినాశనైక కర్మ! అనఘారూఢ ! ఫణేశ ! కంసనాశా ! సూర్యచన్ద్రనేత్ర! ప్రగల్భ చేష్ట! ధ్వాంతహరణ! నవజలదశ్యామదేహా! లక్ష్మీనాథా! యజ్ఞరూపా యజ్ఞధర! మాతృబద్ధదామ! నవనీత ప్రియ! గోపీజనప్రియ! అఘ, బక, వృషకేశి, పూతనాంతక! త్రిశిరోవాలి దశాస్యభేదక! నరకపుర వినాశన! బాణబాహుచ్ఛేదక! త్రిపురారిపూజ్య! సుదామ మిత్ర! సంసార తారణ! అహిత్ర పాదపద్మ! ప్రకటైశ్వర్య! పురాణ పురుష! ఆజానుబాహు బహుజన్మ పుణ్యప్రాప్య! మంగళార్హ! శ్రుతివేద్య! శ్రుతి ధామ ! శాంత! శుద్ధ! వరద! వరేణ్యా! నీ పాదపద్మములను శరణు పొందితిని. పాపపీడితుడనగు నన్ను కాపాడుము. నాకు సద్గతిని ప్రసాదించువారు నీకంటే ఇతరులు లేరు. నా ప్రార్థనచే ప్రసన్నుడవు కమ్ము!

*(III శ్లో॥29,ఉ.భా)*

ఈవిధంగా శంకరుడు స్తుతించగానే జగన్నాథుడైన శ్రీహరి ప్రత్యక్షమయ్యాడు. దివ్యమంగళాకారుడైన స్వామికి శంకరుడు భక్తి పూర్వకంగా నమస్కరించగా మరి ప్రేమతో “శంకరా! నీ స్తుతి నాకెంతో ఆనందాన్ని కలిగించింది. ఏం వరం కావాలో కోరుకో” అని అడిగాడు.

చక్రధరా! నాప్రార్థన విని ప్రత్యక్షమైనందుకు చాలా సంతోషంగా వుంది. ఇప్పటిదాకా నన్ను వెంటాడిన బ్రహ్మహత్య పాపవినాశన కారకమైన నీ దివ్యకాశీలోకి రాలేకపోయింది. కనుక నేను ఇక్కడే ఉండాలని కోరుకుంటున్నాను. దయచేసి నాకీ క్షేత్రాన్ని దానంచేయి. నేనిక్కడనుంచి వెళ్ళిపోతే తిరిగి ఆ బ్రహ్మ హత్య నావెంట పడుతుంది. నేనీ క్షేత్రంలో నివసిస్తే ముల్లోకాలచేతా పూజలందుకుంటాను.నా మాట మన్నించి నాకీ వరాన్ని ప్రసాదించు” అని ప్రార్థించాడు. రమావల్లభుడైన శ్రీహరి శివుడి విన్నపాన్ని మన్నించి అప్పటిదాకా తాను కొలువున్న కాశీక్షేత్రాన్ని శివుడికి శాశ్వత నివాస స్థానంగా ఇచ్చేశాడు. ఆనాటి నుంచి కాశీక్షేత్రం హరిక్షేత్రంగా కాక శివక్షేత్రంగా ప్రసిద్ధి చెందింది.

పూర్వం విష్ణుక్షేత్రంగా ఉన్న కాశీలో మాధవుడి రూపంలో శ్రీహరి కొలువుండేవాడు. ఒకనాడు ఆయన కంటిబిందువు నుంచి నీరుకారి అదే బిందుసరోవరంగా ఏర్పడింది. ఆ సరోవరంలో వృషభధ్వజుడైన శంకరుడు స్నానంచేసాడు. అంతే అప్పటిదాకా ఆయన చేతిని అంటిపెట్టుకున్న బ్రహ్మ కపాలం ఒక్కసారిగా ఊడిపడిపోయింది. ఆనాటి నుంచి ఆ బిందు సరోవరానికి కపాలమోచన తీర్థమనే పేరు వచ్చింది. ఈ సరస్సునే బిందుమాధవ సరస్సు అని కూడా అంటారు.

బ్రహ్మకపాలం తొలగిపోగా ఎంతో సంతోషించిన శివుడు ఆనాటి నుంచీ పరమపావనమైన కాశీక్షేత్రాన్ని తన శాశ్వత నివాసంగా చేసుకున్నాడు. ఇక్కడ కొలువైన శంకరుణ్ణి అన్ని లోకాలవారు సేవించసాగారు. పదివేల సూర్యుల కాంతితో వెలుగొందే శంకరుడు కాశీవాసిగా విఖ్యాతి చెంది అందర్నీ రక్షిస్తున్నాడు.

కాశీక్షేత్రంలో స్నానం, జపం, పూజ, దానం ఇలాంటి వేవీ విధిగా చెప్పబడలేదు. కేవలం ఇక్కడ మరణిస్తే చాలు వారికి మోక్షం లభిస్తుందని పురాణాలు చెబుతాయి. భోగులకీ, యోగులకీ మోక్షాన్ని ప్రసాదించే అవిముక్త క్షేత్రం కాశీ. ఈ దివ్యక్షేత్రాన్ని కర్మనాశనం కోసమే శ్రీహరి నిర్మించాడు. ఇక్కడ మరణించిన వారు పరమభయంకరమైన యమయాతనలు అనుభవించరు.

## హరిద్వార మాహాత్మ్యం

భరతఖండంలో వున్న సప్తమోక్ష పురాలలో ఒకటి హరిద్వార పుణ్యక్షేత్రం. దీనినే గంగాద్వారం అనికూడా అంటారు. పూర్వం భగీరథుడి వెంట హిమాలయాల నుంచి కొండలు కోనలు దాటి నడిచిన గంగ ఇక్కడే మొదటిసారిగా భూమిమీద ప్రవహించింది. ఈ దివ్యక్షేత్రంలోనే దక్షప్రజాపతి యజ్ఞేశ్వరుణ్ణి పూజించాడు.

దక్షప్రజాపతి హరిద్వారంలో తలపెట్టిన మహాయజ్ఞానికి సకల దేవతలు, రాజర్షులు, బ్రహ్మర్షులు వారి శిష్య గణాలతో సహా విచ్చేసారు. వారితో పాటు గంధర్వులు, అప్సరసలు, యక్షులు, కిన్నరులు, విద్యాధరులు ఇలా ఎంతోమంది ఆ యజ్ఞభూమికి వచ్చారు. అయితే ఒక్క శంకరుడు మాత్రం ఆ యాగానికి రాలేదు. ఎందుకంటే దక్షుడు ఆయన్ని ఆహ్వానించలేదు.

ఆకాశంలో గుంపులు గుంపులుగా విమానాలు అధిరోహించి దేవతలంతా వెళుతుండటాన్ని సతీదేవి చూసింది. వారంతా వెళ్ళేది తన తండ్రి చేస్తున్న యాగం చూడటానికేనని తెలుసుకుంది. ఆమెకి కూడా అక్కడికి వెళ్ళాలన్న కోరిక కలగగా వెంటనే శివుడితో ఆ విషయాన్ని ప్రస్తావించింది. సతి కోరికవిన్న శివుడు పిలవని పేరంటానికి వెళ్ళటం మంచిదికాదని ఆమెకి నచ్చచెప్పాడు. అయితే సతీదేవికి ఆ మాటలు రుచించలేదు. ఎలాగైనా వెళ్తే బాగుండననుకుంది. ఇక చేసేదేం లేక శివుడు వెళ్ళమన్నాడు.

ఎంతో ఉత్సాహంతో కైలాసం నుంచి బయలుదేరిన సతీదేవి తన తండ్రి చేస్తున్న యాగం దగ్గరకి వచ్చింది. చుట్టూ బంధువులు, దేవతలు, మునులు పరివారం కనిపించేసరికి ఆమెకి చాలా ఆనందం కలిగింది.

ఆమె రాకని చూసి కూడా చూడనట్టుగా నటించాడు దక్షప్రజాపతి. సతీదేవికి అది చాలా అవమానమనిపించింది. అంతేకాదు కొద్దిసేపటికి దక్షుడు తన భర్త అయిన శివుణ్ణి నిందించటం ప్రారంభించాడు. ఇక తట్టుకోలేక పోయింది సతీదేవి, వెంటనే ఆ అవమానాన్ని భరించలేక యోగాగ్ని సృష్టించుకుని దగ్ధమైపోయింది. సతీదేవి ప్రాణత్యాగం చేసిన ఆ ప్రాంతం (గంగాద్వారం) పరమపవిత్రమైన తీర్థ స్థలంగా రూపొందింది.

హరిద్వారంలో ఉన్న ఆ దివ్యతీర్థంలో స్నానం చేసి పితృదేవతలకి తర్పణాలు చేసినవారు సతీదేవికి ఎంతో ప్రీతిపాత్రులై పుణ్యలోకాలు చేరుకుంటారు. దక్షయజ్ఞవాటికలో సతీదేవి దగ్ధమైందన్న వార్త విని శివుడు ఆగ్రహోదగ్రుడయ్యాడు. వెంటనే వీరభద్రుణ్ణి సృష్టించాడు. శివుడి ఆజ్ఞతో వీరభద్రుడు ప్రమథగణాల్ని వెంటబెట్టుకుని దక్షుడిమీదకి దండెత్తాడు. దక్షయజ్ఞాన్నంతా విధ్వంసం చేసారు. ఆ తరువాత బ్రహ్మ ప్రార్ధన విని శంకరుడు ఆ యుద్ధంలో మరణించిన వారందరినీ తిరిగి బ్రతికించాడు.

ఆ విధంగా గంగాద్వారం ఉత్తమతీర్ధంగా ప్రశస్తి పొందింది. ఇక్కడ స్నానం చేసే చంద్రుడు తన పాపాల్ని సమూలంగా పోగొట్టుకున్నాడు. ఇక్కడి గంగలో స్నానం చేసిన వాడి కోరికలన్నీ తీరతాయి. ఇక్కడే దక్షప్రజాపతి, దేవతలు, యజ్ఞేశ్వరుడైన శ్రీహరిని ఘనంగా స్తుతించారు. అందుకే ఇది హరిద్వారంగా సుప్రసిద్ధమైంది. ఇక్కడ గంగ ప్రత్యక్షంగా త్రిపథగా ప్రవహిస్తుంది. ఈ దివ్యక్షేత్రంలో స్నానం చేసి హరిని కొలిచినవారు శ్రీహరికి ప్రీతి పాత్రులై భక్తి ముక్తులు పొందుతారు.

ఈ హరిద్వార తీర్ధానికి తూర్పుదిశలో త్రిగము అనే ఒక పుణ్యతీర్థం ఉంది. ఇక్కడ స్నానం చేసి దేవతలకి, పితృదేవతలకి, ఋషులకి తర్పణం ఇచ్చినవారు స్వర్గంలో దేవతల్లాగా సుఖాలనుభవిస్తారు. పొరపాటున ఇక్కడి గంగా ప్రవాహంలో పడి మరణించినప్పటికీ వారు సరాసరి విష్ణులోకానికి చేరుకుంటారు.

హరిద్వారానికి దక్షిణ దిశలో 'కనఖలం' అనే మరో దివ్యక్షేత్రమున్నది. మూడు రాత్రులు ఉపవాసం చేసి ఆ తీర్థంలో స్నానంచేసిన వారు సకల పాపలనుంచీ విముక్తులవుతారు. ఇక్కడ వేదపండితుడికి గోదానం చేస్తే వైతరిణీనదిని, యమలోకాన్ని దర్శించరు. ఈ కనఖలక్షేత్రంలో చేసిన జపం, దానం అక్షయంగా నిలుస్తుంది.

ఇక్కడే జహ్నుతీర్థం ఉన్నది. పూర్వం జహ్నుమహర్షి ఇక్కడే గంగానదిని సంపూర్ణంగా త్రాగాడు. దేవతలందరూ ప్రార్థించగా తిరిగి దాన్ని విడిచిపెట్టాడు. ఈ జహ్నుతీర్థంలో స్నానంచేసినవాడు పాపవిముక్తుడవుతాడు. వేదం చదివిన ఒక బ్రాహ్మణుడికి పరమాన్నాన్ని, దక్షిణ తాంబూలాలతో సమర్పిస్తే ఒక కల్పం దాకా స్వర్గలోకవాసాన్ని పొందుతాడు.

హరిద్వారానికి పడమరభాగంలో కోటి తీర్థం ఉంది. అక్కడే కోటేశ్వరస్వామి నెలకొన్నాడు. ఆ స్వామిని దర్శిస్తే కోటిరెట్లు అధికమైన పుణ్యం లభిస్తుంది. ఈ క్షేత్రంలో ఒక రాత్రి ఉపవాసం చేస్తే పౌండరీకయాగం చేసిన ఫలితాన్ని పొందుతారు.

హరిద్వారానికి ఉత్తర దిశలో సకల పాపాల్నీ పోగొట్టే 'సప్తగంగ' అనే సుప్రసిద్ధక్షేత్రం వుంది. ఇక్కడే పరమపవిత్రమైన సప్తర్షుల ఆశ్రమాలున్నాయి. వాటి పక్కనే ఏడు తీర్థాలున్నాయి. వీటినే సప్తగంగలంటారు. వీటిలో ఒక్కొక్క తీర్థంలో విడివిడిగా స్నానంచేసి, దేవ, పితృ, ఋషి తర్పణాలు సమర్పిస్తే సనాతనమైన ఋషిలోకానికి చేరుకుంటారు. పూర్వం భగీరథుడు గంగను భూమిపైకి తెచ్చేటప్పుడు ఋషులందరి కోరిక ప్రకారం గంగానది ఏడుద్వారాలుగా మారింది. అందుకే దీనికి సప్తగంగ తీర్థమనే పేరువచ్చింది.

పరమపావనమైన హరిద్వార క్షేత్రంలో కపిలాహ్రదం, నాగరాజతీర్థం, శంతనతీర్థం, భీమస్థల తీర్థం అనే పుణ్యతీర్థాలున్నాయి. వీటిలో కపిలాహ్రదంలో స్నానంచేసి, విప్రుడికి ఒక గోవుని గోదానం చేస్తే వెయ్యి గోవుల్ని దానం

చేసిన ఫలితం లభిస్తుంది. అలాగే నాగరాజ తీర్థంలో స్నానంచేసిన వారికి సర్పభయం వుండదు. శంతన తీర్థంలో స్నానంచేసిన వారికి ఉత్తమగతులు కలుగుతాయి. పూర్వం శంతనమహారాజు ఈ తీర్థం దగ్గరే గంగాదేవిని వివాహం చేసుకున్నాడు. మానవ దేహం ధరించిన గంగాదేవి ఇక్కడే అష్టవసువుల్ని ప్రసవించి తన శరీరాన్ని విడిచిపెట్టింది. ఇక భీమస్థల తీర్థంలో స్నానం చేసినవారికి ఇహ పరాల్లో సకల సుఖభోగాలు లభిస్తాయి. ఈ క్షేత్రంలో ఇవేకాక ఇంకా ఎన్నో తీర్థాలున్నాయి.

బృహస్పతి కుంభరాశిలో ఉన్నప్పుడు ఈ క్షేత్రంలో కుంభమేళా జరుగుతుంది. అప్పుడు ఇక్కడి గంగలో స్నానంచేసిన వాడికి సకల పాపాలూ నశిస్తాయి. అలాగే సూర్యుడు మేషరాశిలో ఉన్న సమయంలో హరిద్వార గంగలో మునిగినవాడు అపరసూర్యుడిలా, వాక్పతిగా ప్రకాశిస్తాడు. సంక్రాంతి, అమావాస్య, వ్యతీపాతయోగాలు, ఉగాదులు,ఇతర పర్వదినాలలో ఇక్కడ ఏ కొంచెం దాన ధర్మాలు చేసినా అనంతమైన పుణ్యఫలాలు లభిస్తాయి.

దూరంగా ఉన్నవాడు కూడా గంగాద్వారాన్ని స్మరిస్తే చాలు శ్రీహరిని స్మరించిన పుణ్యం కలుగుతుంది. హరిద్వారంలో వున్న ప్రతిదేవుడూ తనని పూజించినవారి మనోరథాల్ని తప్పక నెరవేరుస్తారు. ఇది గొప్పతపస్థ్సానం.అలాగే జపస్థ్యాం కూడా. ఇక్కడ చేసే హోమం తక్షణ ఫలితాల్నిస్తుంది.

హరిద్వారక్షేత్రంలో గంగాతీరంలో నిలబడి నియమబద్ధంగా గంగా సహస్రనామాన్ని త్రికాలాలో పఠించినవాడికి అక్షయ సంపదలు, సత్సంతానం కలుగుతాయి. ఈ హరిద్వార మాహాత్మ్యాన్ని విన్నవారు, పఠించినవారు కూడా గంగాస్నానం చేసిన ఫలితాన్ని పొందుతారు. గంగామాహాత్మ్య ఘట్టాన్ని వ్రాసి ఇంట్లో ఉంచుకుంటే ఆ ఇంటికి చోర, అగ్ని, గ్రహాల భయం ఉండదు. శ్రీహరి దివ్యానుగ్రహంతో ఆ ఇంట్లో ఉన్న వారందరికీ సకల సుఖాలు, సంపదలు లభిస్తాయి.

# బదరికాశ్రమ మాహాత్మ్యం

హిమాలయాల్లో ఉన్న బదరికాశ్రమం పరమపవిత్రమైనది. ఆ దివ్యక్షేత్ర మహాత్మ్యాన్ని విన్న మానవుడికి సంసారబంధాల నుంచి విముక్తి లభిస్తుంది. బదరి అనేది శ్రీహరిక్షేత్రం. సకల పాపాల్నీ నశింపచేసే పుణ్య స్థలం. కలిదోషాల్ని అది హరిస్తుంది.

పూర్వం ధర్ముడికి పుత్రులుగా జన్మించిన నరనారాయణులు బదరికాశ్రమంలో ఉన్న గందమాదన పర్వతం మీదకి వెళ్ళారు. అక్కడే వున్న బదరీ వనంలో ఈ కల్పం ప్రారంభం నుంచీ తపస్సు చేస్తున్నారు. సకల ముని సిద్ధ సంఘ పరివృతులైన ఆ మహామునులు లోక స్థితి కోసం తమ తపస్సుని ఆనాటి నుంచీ కొనసాగిస్తున్నారు. ఈ బదరికాశ్రమంలో సకల సిద్ధి ప్రదమైన 'అగ్నితీర్థం' ఉంది. అందులో స్నానంచేసిన వారు మహా పాతకాలనుంచి కూడా విముక్తిని పొందుతారు. కొన్నివేల చాంద్రాయణ వ్రతాలతో, కోటి కృచ్ఛ వ్రతాలతో పొందే ఫలితాన్ని ఇక్కడి అగ్ని తిర్థంలో ఒక్కసారి చేసే స్నానంతోనే పొందుతారు. కలుషితమైన బంగారం అగ్నిలో దహించబడి ఎలా స్వచ్ఛంగా మారుతుందో అదేవిధంగా కలుషితుడైన మానవుడు ఇక్కడి అగ్నితీర్థం (ఉష్ణకుండం) లో స్నానం చేస్తే స్వచ్ఛంగా పవిత్రంగా బైటికి వస్తాడు.

**1.నారదశిల :** బదరీ క్షేత్రంలో పరమపావనమైన అయిదు శిలలున్నాయి. ఈ శిలల మధ్యలోనే అగ్నితీర్థం(ఉష్ణకుండం)ఉంది. ఈ దివ్యతీర్థం దర్శనంతోనే సర్వపాతకాలూ నశిస్తాయి. ఇక్కడున్న పంచశిలల్లో మొదటిది 1.నారదశిల. ఈ నారదశిలని దర్శిస్తే చాలు ముక్తి లభిస్తుంది. ఇక్కడే నారదకుండం కూడా వుంది. నారదకుండంలో స్నానం చేసిన మానవుడు పరిశుద్ధుడవుతాడు. ఈ శిలని దర్శించినవాడికి శ్రీహరి మీద భక్తి పెంపొంది భుక్తి ముక్తి రెండూ కలుగుతాయి. అతడి అభీష్టాలన్నీ నెరవేరుతాయి. ఇక్కడ చేసే జపం, దానం, హోమం, తపస్సు, అర్చన అక్షయంగా నిలుస్తాయి.

**2. గరుడశిల :** ఉష్ణకుండానికి (అగ్నితీర్థం) సమీపంలోనే వైనతేయశిల అనే గరుడశిలఉంది. పూర్వం ఇక్కడే శ్రీహరి వాహనమైన గరుత్మంతుడు కఠోరంగా తపస్సుచేసాడు. శ్రీహరి దివ్యానుగ్రహం కోసం గరుడుడు 30వేల సంవత్సరాలు చేసిన తపస్సుకి మెచ్చి శ్రీహరి ప్రత్యక్షమయ్యాడు. ఆ గరుడుకి దైత్యుల్ని నాగుల్నీ జయించే వరాన్ని ప్రసాదించి అతన్ని తన వాహనంగా చేసుకున్నాడు. ఆనాటి నుంచి అక్కడున్న శిల గరుడశిలగా ఖ్యాతి పొందింది. ఈ శిలని దర్శిస్తే చాలు పాపాలన్నీ నశిస్తాయి. ఇక్కడి గంగలో స్నానం చేసినవారికి దేవ, ఋషి, పితృతర్పణాలు చేసినవారికి సనాతనమైన బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది.

**3. వారాహిశిల :** బదరీక్షేత్రంలో ఉన్న పంచశిలల్లో వారాహిశిల ఒకటి. ఈ శిల ఉన్న ప్రాంతంలోనే శ్రీమహావిష్ణువు గంగాస్నానం చేసాడు. భక్తితో ఈ వారాహి శిలని స్పర్శించిన వారికి, పూజించిన వారికి సద్గతులు కలుగుతాయి.

**4. నారసింహశిల :** ఇక్కడే పంచశిలల్లో ఒకటైన నారసింహశిల ఉంది. పూర్వం హిరణ్యకశిపుణ్ణి వధించిన నరసింహుడు ఇక్కడే నిలబడ్డాడు. అప్పుడు దేవతలందరూ ఆయన్ని ప్రార్థించి శాంతింపచేసారు. తరువాత నరసింహమూర్తిని ఇక్కడున్న శిలలో కొలువుండమని ప్రార్థించగా శ్రీహరి అంగీకరించి ఆనాటి నుంచి ఆ శిలలో కొలువయ్యాడు. ఈ నరసింహ శిల నీటిలో ఉంటుంది. ఇక్కడ స్నానం చేసి నారసింహ శిలని పూజించిననవాడు పునరావృత్తి రహితమైన శ్రీహరి దివ్య పదాన్ని చేరుకుంటాడు.

**5. నారాయణ శిల :** బదరికాశ్రమంలో ఉన్న శిలల్లో గొప్పది నారాయణ శిల. కృతయుగంలో ఈ శిలలో నరనారాయణ శ్రీహరి ప్రత్యక్షంగా ఉండేవాడు. త్రేతాయుగంలో కేవలం మునులకి, యోగులకి మాత్రమే దర్శనమిచ్చేవాడు. ద్వాపరయుగం నాటికి కేవలం జ్ఞానులకి మాత్రమే దర్శనమిచ్చే శ్రీహరి కలియుగం వచ్చేసరికి అదృశ్యుడై కేవలం శిలారూపంలోనే

దర్శనమిస్తున్నాడు. అది చూసి దేవతలంతా స్వామిని ప్రత్యక్షంగా దర్శనమివ్వమని ప్రార్థించారు. అప్పుడు శ్రీహరి అశరీరవాణి రూపంతో "బ్రహ్మాదిదేవతలారా! ఋషులారా! మునులారా! మహర్షులారా! ఈ కలియుగంలో నేను మీకు ప్రత్యక్షంగా కనపడను. నన్ను మీరు నిత్యం దర్శించి పూజించాలనుకుంటే నారదకుండం సమీపంలో ఉన్న నా మూర్తిని స్వీకరించండి" అని చెప్పాడు.

శ్రీహరి మాటలు విన్న దేవతలంతా వెంటనే నారదకుండానికి వెళ్ళి అక్కడున్న శ్రీహరి మూర్తిని పైకి తెచ్చి స్థాపించారు. తరువాత నిత్యం ఆ మూర్తికి పూజలు, సేవలు చేసి తరించసాగారు. ఆనాటి నుంచీ దేవతలంతా ప్రతి కార్తీక మాసంలో అక్కడికి వచ్చి వైశాఖమాసందాకా ఆరునెలలు బదరీనారాయణుణ్ణి పూజించగా, మంచుతొలగిపోయే వైశాఖమాసం నుంచి తిరిగి కార్తీక మాసందాకా మిగిలిన ఆరుమాసాలూ మానవులు స్వామిని పూజిస్తున్నారు. ఇలా ఈ క్షేత్రంలో బదరీనారాయణుడు ఆరుమాసాలు మానవుల చేత ఆరుమాసాలు దేవతల చేతా పూజలందుకుంటున్నాడు.

బదరీ నారాయణుణ్ణి దర్శించి స్వామికి సమర్పించే వేద్యాన్ని భుజించే వారికి మోక్షం తప్పక లభిస్తుంది. పరమపవిత్రమైన అయిదు శిలలమధ్య కొలువైన నారాయణుడి దర్శనం పరమపావనం భక్తి ముక్తి ప్రదం.

బదరీక్షేత్రంలో ఎన్నో తీర్థాలున్నాయి. వీటిలో ప్రముఖమైనది కపాలమోచన తీర్థం. ఇది సకల పాపనాశనం. ఇక్కడే పాపాల్ని పోగొట్టే అయిదు శిలలున్నాయి. ఇక్కడున్న తీర్థంలో స్నానంచేసిన వారు మరుజన్మలో వేదపారంగతులవుతారు. పూర్వం బ్రహ్మదేవుడి నుంచి వెలువడ్డ వేదాల్ని హయగ్రీవుడనే రాక్షసుడు అపహరించగా బ్రహ్మ ప్రార్థన విని శ్రీహరి మత్స్యావతారాన్ని ధరించాడు. హయగ్రీవుణ్ణి సంహరించి అతడి ఆధీనంలో ఉన్న వేదాల్ని తిరిగి బ్రహ్మకి అప్పగించాడు. ఆ చిహ్నంగా ఇక్కడ హయగ్రీవతీర్థం, మత్స్యతీర్థం రెండూ వెలిసాయి. వీటిలో వేదాలు ద్రవరూపంలో ఉంటాయి. కాబట్టి ఈ జలం పాపవినాశకంగా ప్రఖ్యాతి చెందింది.

హయగ్రీవ తీర్థానికి ఆగ్నేయకోణంలో ఇంద్రపదమనే మరో తీర్థం వుంది. ఇక్కడ స్నానంచేసిన వారికి ఇంద్రలోక ప్రాప్తి కలుగుతుంది. అలాగే 'మానసోద్భేదకం' అనే మరోతీర్థంలో స్నానంచేస్తే సకల పాపాలూ హరిస్తాయి. ఇక్కడి మరోతీర్థమైన 'కామకామ తీర్థం' లో చేసిన స్నానం సకల కోరికల్నీ తీరుస్తుంది. ఎలాంటి కోరికలూ లేని వారికి మోక్షం కలుగుతుంది.

**వసుధారా తీర్థం :** బదరీక్షేత్రానికి పడమర భాగంలో సుప్రసిద్ధమైన 'వసుధారా' తీర్థం వుంది. మహాపుణ్యాత్ములు మాత్రమే ఆజలమధ్యగతాన్ని చూడగలుగుతారు. ఇక్కడి ధారక్రింద భక్తితో స్నానంచేసిన వారు వాంఛిత ఫలాల్ని పొందుతారు. ఈ తీర్థాన్ని దర్శించిన మానవుడు తిరిగి గర్భవాస దుఃఖాన్ని పొందడు.

**పంచధారా తీర్థం :** వసుధారా తీర్థానికి నైరృతీ దిశలో పంచధారలు పడుతుంటాయి. వీటిని ప్రభాస, పుష్కర, గయా, కాశీ, నైమిశారణ్య ధారలు అని వ్యవహరిస్తారు. ఇవి పరమ పవిత్రమైన జలపాతాలు. ఈ ధారల క్రింద స్నానంచేసినవారు ఆయా తీర్థాలలో స్నానం చేసిన ఫలాన్ని పొందుతారు.

**సోముకుడు :** అక్కడికి కొద్ది దూరంలో 'సోమకుండం' అనే పేరుతో చంద్రుడు తపస్సుచేసిన ఒక కుండం ఉంది. చంద్రుడు ఇక్కడ తపస్సు చేసినందువల్లే నక్షత్రాధిపతి అయ్యాడు. ఈ కుండంలో స్నానం చేసినవారికి సకలదోషాలూ తొలగిపోతాయి. ఇక్కడే సకల పాపాల్నీ నశింపచేసే ద్వాదశాదిత్య తీర్థం ఉంది. ఇందులో స్నానం చేసిన వారు సూర్యుడి తేజస్సుతో ప్రకాశిస్తారు. ఇంకా ఈ దివ్యక్షేత్రంలో ఎన్నో దివ్య తీర్థాలున్నాయి.

1. **చతుస్స్రోత తీర్థం :** ధర్మార్ధకామ మోక్షాల్ని పొందుతారు.
2. **సప్తపద తీర్థం :** మహాపాతకాలు నశిస్తాయి.
3. **త్రిమూర్తికుండం :** దీని సమీపంలో మరణించినవారికి సద్గతులు కలుగుతాయి.
4. **ఊర్వశీకుండం :** ఇక్కడ స్నానంచేసిన వారికి మంచి సౌందర్యం లభిస్తుంది.

**5. అస్త్రతీర్థం :** ఇక్కడస్నానం చేసిన వారికి శత్రుభయం ఉండదు.

**6. లోకపాలతీర్థం :** ఇక్కడే అష్టదిక్పాలకులు స్నానంచేసారు. ఈ తీర్థంలో స్నానం చేస్తే సర్వతీర్థాల్లో స్నానంచేసిన ఫలం లభిస్తుంది.

**7. దండపుష్కరిణి :** ఇందులో స్నానం చేస్తే శ్రీహరి అనుగ్రహం కలుగుతుంది.

**8. కర్మోద్ధరతీర్థం :** కర్మదోషాలుతొలగి బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది.

**9. ధర్మక్షేత్ర తీర్థం :** ఇక్కడ స్నానం చేస్తే హరికొలువుకి చేరతారు.

**10. అలకనందాభాగీరథీ సంగమం :** బదరికాశ్రమంలో ఉన్న అన్ని తీర్థాలలో ఇది ఉత్తమమైనది. ఇక్కడ స్నానం చేసి దేవతలకి, పితృదేవతలకి, ఋషులకి తర్పణాలు విడిస్తే అవాఙ్మానసగోచరమైన వైకుంఠానికి చేరుకుంటారు.

ఇక్కడున్న తీర్థాలన్నీ పరమపావని అయిన గంగని ఆశ్రయించి ఉన్న తీర్థాలు. ఇవన్నీ మహిమాన్వితమైనవి. ఇక్కడున్న అన్ని తీర్థాల గురించీ చెప్పాలంటే అది బ్రహ్మకి కూడా సాధ్యంకాదు.

ఈ బదరికాశ్రమ మాహాత్మ్యాన్ని గురించి విన్నవారు, చదివినవారు, చెప్పినవారు సకల పాపాల నుంచీ విముక్తులై విష్ణులోకాన్ని చేరుకుంటారు. ఈ దివ్యక్షేత్రంలో నియమపూర్వకంగా ఒకమాసం రోజులు నివసించినవారు ప్రత్యక్షంగా నరనారాయణ స్వరూపుడైన శ్రీహరిని దర్శించగలుగుతారు. ఈ బదరీ మహాత్మ్యాన్ని వ్రాసిన వారికి అకాలమృత్యువు కలగదు. అధివ్యాధులు, సర్పభయాలు కలగవు. శ్రీహరి దివ్యానుగ్రహంతో అతడికి అతడి కుటుంబానికి సకల శుభాలూ చేకూరతాయి.

## సేతు మాహాత్మ్యం

దక్షిణ భారతదేశంలో వున్న రామేశ్వర క్షేత్రం ఎంతో గొప్పది. రామేశ్వరుడి దర్శనంతోనే అమరత్వం లభిస్తుంది. నిశ్చలమైన మనస్సుతో రామేశ్వరుణ్ణి పూజించిన వాడికి సకల కోరికలూ తీరుతాయి. ఇక్కడే పాపనాశనం అనే దివ్యతీర్థం ఉంది. ఇక్కడ చేసిన జప, తప, దాన, హోమాలు అక్షయ ఫలితాల్నిస్తాయి.

ముందుగా ఇక్కడి తాళ తీర్థంలో స్నానం చేసి ఆ తరువాత పాప వినాశన తీర్థంలో స్నానంచేయాలి. అలాచేసిన వారికి అక్షయమైన పుణ్యఫలాలు లభిస్తాయి.

1. **సీతాకుండం :** ఇక్కడ స్నానంచేసి పితృదేవతల్ని తృప్తి పరిస్తే సకల కోరికలూ తీరుతాయి.
2. **మంగళతీర్థం :** సకల పాపాలూ తొలగి పుణ్యలోక ప్రాప్తి కలుగుతుంది.
3. **అమరదాపితీర్థం :** అమృతత్వాన్ని ఇక్కడ స్నానంచేసిన వారు పొందుతారు.
4. **లక్ష్మణతీర్థం :** ఇందులో స్నానంచేసిన వారికి యోగసిద్ధి కలుగుతుంది.
5. **జటాతీర్థం :** ఈతీర్థంలో స్నానంచేయటం వల్ల రోగాలన్నీ నశిస్తాయి.
6. **హనుమత్కుండం :** ఈ కుండంలో స్నానంచేసినవారు అజేయులవుతారు.
7. **అగస్త్య తీర్థం :** ఈ దివ్య తీర్థంలో స్నానంచేసిన వారికి సత్సంతానం ఐశ్వర్యం లభిస్తుంది.
8. **రామకుండం :** పరమ పవిత్రమైన రామకుండంలో స్నానం చేసినవారికి రామసాలోక్యం కలుగుతుంది.
9. **లక్ష్మీ తీర్థం :** ఇందులో స్నానం చేసిన వాడికి సంపదలు పెంపొందుతాయి.
10. **అగ్నితీర్థం :** ఇందులో స్నానంచేసినవాడు పాపాల్ని దహించుకుని పుణ్యాత్ముడవుతాడు.
11. **శివతీర్థం :** ఈ దివ్య తీర్థంలో చేసే స్నానం శివలోక ప్రాప్తిని కలిగిస్తుంది.
12. **శంఖతీర్థం :** ఇక్కడ స్నానంచేసినవాడు సద్గతి పొందుతాడు.
13. **యమునాతీర్థం :** దీనిలో చేసిన స్నానం స్వర్గప్రాప్తిని కలిగిస్తుంది.
14. **కోటితీర్థం :** ఈ దివ్య తీర్థంలో స్నానంచేసినవాడు సద్గతి పొందుతాడు.
15. **ధనుష్కోటి :** రామేశ్వరంలో ఉన్న సుప్రసిద్ధతీర్థం. దీనిలో స్నానమాచరించిన వాడు సకల బంధాల నుంచీ విముక్తుడవుతాడు.

**16. క్షీరకుండం :** ఇందులో స్నానం చేసినవాడు సుఖభోగాలనుభవిస్తాడు.

**17. ఋణమోచన తీర్థం :** ఇందులో స్నానం చేసినవారికి అన్ని రకాల ఋణ బాధలూ తీరిపోతాయి.

పరమపావన క్షేత్రమైన రామేశ్వరానికి వెళ్ళి అక్కడి సేతువుని, రామేశ్వరుణ్ణి దర్శించిన వారికి కోటి జన్మల్లో చేసిన పాపం నశిస్తుంది. ఈ సేతు మాహాత్మ్య కథనాన్ని విన్నా, చదివినా అనంతమైన పుణ్యం కలుగుతుంది.

## సావిత్రీ పంజర (కవచ) స్తోత్రం

త్రిపదా, హరిజా, పూర్వముఖీ, బ్రహ్మాస్త్రసంజ్ఞిక, చతుర్వింశతి తత్త్వాఢ్య యగు సావిత్రి పూర్వదిక్కును కాపాడుగాక!

చతుష్పద బ్రహ్మదండ, బ్రహ్మాణి, దక్షిణముఖీ షడ్వింశత్తత్త్వ సంయుక్తా, దక్షిణ దిక్కును కాపాడుగాక!

పశ్చిమముఖీ, పంచపదీ, పంచాశతత్త్వ రూపిణి, బ్రహ్మ శిరోంకితా పశ్చిమ దిక్కును కాపాడుగాక!

సౌమ్యాస్య బ్రహ్మతుర్యాఢ్య అధర్వాంగి రసాత్మక, షట్పదా, షష్టితత్త్వ కలాత్మిక ఉత్తర దిక్కును కాపాడుగాక!

పంచాశద్వర్ణ రచిత, నవపాద, శతాక్షరి, వ్యోమా, వేదాంత సంస్థిత, ఊర్ధ్వమును కాపాడుగాక!

విద్యున్నిభ, బ్రహ్మ సంధ్య, మృగారూఢ, చతుర్భుజ, చాపేషు చర్మాసిధరా, ఆగ్నేయ దిక్కును కాపాడుగాక!

బ్రాహ్మి, కుమారి, రక్తాంగీ, హంసవాహిని కమండలమును జపమాలను, స్రుక్స్రువములను ధరించు గాయత్రి నైఋుత దిక్కును కాపాడుగాక!

శుక్లవర్ణ, యువతి, వృషవాహిని. కపాల శూల కాక్ష స్రగ్ధారిణి యగు సావిత్రి వాయవ్య దిక్కును కాపాడుగాక!

శ్యామా, వృద్ధ వైష్ణవి, గరుడాసన, శంఖ చక్రాభయకర యగు సరస్వతి ఈశాన్య దిక్కును కాపాడుగాక!

చతుర్భుజ, దేవతమాత, గౌరాంగి, సింహవాహన, వరాభయ ఖడ్గ చర్మభుజ అధర దిక్కును కాపాడుగాక!

ఆయా పార్శ్వములనున్నవారు స్వస్వవాహనాయుధ భూషణ ధారిణులు గ్రహ శక్త్యంగ సంయుతలై కాపాడుగాక!

మంత్రాధి దేవతారూపలు ముద్రాదిష్ఠాతృ దేవతలు ఆపాద తలమస్తకమును వ్యాపకముగా కాపాడుగాక!

## సావిత్రీ అష్టోత్తర శతనామాలు

భూతిదా, భువనా, వాణి, మహా వసుమతి, మహీ, హిరణ్యా, జనని, నందా, సవిసర్గా, తపస్విని, యశస్విని, సతీ, సత్యా, వేదివిత్, చిన్మయి, శుభ, విశ్వా, తుర్యా, వరేణ్యా, నిస్పృణీ, యమునా, భువా, మోదా, దేవీ, వరిష్ఠా, ధీ, శాంతి, మతి, మహి, ధిషణ, యోగిని, యుక్త, నదీ, ప్రజ్ఞా, ప్రచోదిని, దయా, యామిని, పద్మా, రోహిణి, రమణి, జయ, సేనాముఖి, సామమయి, జగలా, దోషవర్జిత, మాయా, ప్రజ్ఞా, పరా, దోగ్ధ్రీ, మానినీ, పోషిణి, క్రియా, జ్యోత్స్నా, తీర్థమయీ, రమ్యా, సౌమ్యా, అమృతమయి, బ్రాహ్మీ, హైమీ, భుజంగి, వశినీ, సుందరీ, వనీ, ఓంకారహాసినీ, సర్వా, సుధా, షడ్గుణవతీ, మాయా, స్వధా, రమా, తన్వీ, రిపుఘ్నీ, సతీ, హైమీ, తారా, విధుగతి, విషఘ్నీ, వరాననా, అమరా, తీర్థదా, దీక్షా, దుర్ధర్షా, రోగహారిణి, నానా పాపనృశంసఘ్నీ, షట్పదీ, వజ్రిణీ, రణీ, యోగిని, విమలా, సత్యా, ఆబాలా, బలదా, జయ, గోమతీ, జాహ్నవీ, రజ్వీ, తపనీ, జాతవేదసా, ఆచిరా, వృష్టిదా, జ్ఞేయా, ఋతతంత్రా ఋతాత్మికా, సర్వకామదుఘా, సౌమ్యా, భవాహంకారవర్జితా, ద్విపదా, త్రిపదా, చతుష్పదా, షట్పదా, అష్టాపదీ, నవపదీ, సహస్రాక్షరాత్మిక, ఇవి సావిత్రీ దేవి అష్టోత్తర శతనామాలు.

ప్రతిరోజు ఈ అష్టోత్తర శతనామాలాను భక్తితో పఠించేవారు
దీర్ఘాయుష్మంతులు, పుత్రవంతులు, అన్ని కార్యాలలో
విజయవంతులు అవుతారు.

## నారదపురాణ ఫలశ్రుతి

నారదీయం పురాణంతు లక్షణైర్దశభిర్యుతమ్ ।
యశ్శృణోతి నరోభక్త్యా సగచ్ఛే ద్వైష్ణవం పదమ్ ॥ 1

ధర్మార్థకామమోక్షాణాం చతుర్ణాంకారణం పరమ్ ।
సర్వేషాం చ పురాణానాం ఇదం బీజం సనాతనమ్ ॥ 2

*(శ్లో॥30-31,అధ్యా-82,ఉ.భా)*

పరమ పవిత్రమైన ఈ నారదీయ పురాణంలో ప్రతి పదం నారాణుడి మీద భక్తిని పెంపొందిస్తుంది. పదిలక్షణాలతో ఉన్న ఈ మహాపురాణాన్ని భక్తి శ్రద్ధలతో వినేవారు శ్రీహరి దివ్యపదాన్ని చేరుకుంటారు. ధర్మార్థకామమోక్షాలనే నాలుగు విధాల పురషార్థాలనీ ఈ పురాణం ఫలవంతం చేస్తుంది. అన్ని పురాణాలకీ ఈ పురాణమే బీజం.

వ్రతాలలో ఏకాదశి, నదుల్లో గంగా, అరణ్యాలలో బృందావనం, క్షేత్రాలలో కురుక్షేత్రం, పురాలలో కాశీపురి, తీర్థాలలో మధురాతీర్థం, సరస్సులలో పుష్కర సరోవరం, పురాణాలలో నారదీయ మహా పురాణం సర్వశ్రేష్ఠమైనవి. గణపతి భక్తులు, సూర్యభక్తులు, విష్ణు-శివ భక్తులు, శాక్తేయులు సకాములు, నిష్కాములు, స్త్రీలు, పురుషులు - ఇలా ఎవరైనా ఈ నాదీయమహాపురాణాన్ని విన్నా, చదివినా ప్రబోధించినా వారందరి కోరికలూ తీరుతాయి.

**స్వస్తి**

**సర్వేజనాః సుఖినోభవన్తు**



